# ఆంధ్ర సచిత్ర వారపత్రిక

26 జూలై-1 ఆగస్టు, '85
రు. 2/-

"నిజం నిలకడ మీద తేలుతుంది" -సుమన్

మధురాలయం మంత్రాలయం!



ఉచితం

తళతళ మెరిసే స్టెయిన్‌లెస్ స్టీల్ గిన్నె

క్రొత్త

# పాలతో కూడిన ఫారెక్స్ ఘన ఆహారం

రెండు టిన్నులు కొన్నప్పుడు

క్రొత్త ఫారెక్స్ అధిక రుచికరం
క్రొత్త ఫారెక్స్ అధిక సంపూర్ణం

ప్రేమతో మీరు పెట్టే ప్రతి చెంచాడు
మీ పాపాయి పెరుగుదలకు మంచిది.




ఈ కానుక ఎంపిక చేయబడిన పట్టణాలలో ప్రత్యేక కానుక టిన్నులపై సరుకు వున్నంత వరకు లభ్యం.

మంచి ఆరోగ్యానికి మూలస్థానం—గ్లాక్సో

CLARION/B/GX/5/244 TEL

# సమృద్ధ పరిమళము
# సరియైన ధరతో




ప్రేమ్ - తాజాతనము నందించు సబ్బు.

"గులాబి మఱియు ఆకుపచ్చ రంగులలో లభించును"



జయలక్ష్మి
గుంటూరు వారి
తయారీ

Imageads-2107 Tel

## ముఖచిత్రం

మా అభిమాన నటి రాధ ముఖచిత్రంతో వెలువడిన పత్రిక చాలా ఆకర్షణీయంగా ఉంది

జె రవి, పి ప్రవీణ్
విజయనగరం

## సీరియల్స్

'శుశ్రుత నర్సింగ్‌హోమ్ సీరియల్ ప్రారంభంలోనే మమ్మల్ని ఆకర్షించింది

ఈ సీరియల్‌లో 'రచయితల' మనోభావాలను రచయిత చక్కగా విపులీకరించారు

'కళ్యాణీ సోమరాజ్' గారి 'ముసురు వెలిసింది' సీరియల్ ఆసక్తికరంగా ఉన్నది

రమ, మూర్తి వంటి ఆదర్శ యువతీయువకులు గ్రామమునకు ఒక్కరున్నా ఈ వరకట్న పిశాచం పారిపోతుంది

బీశెట్టి ముత్యాలనాయ్డు,
కస్పా జగన్నాధపురం

★ ★ ★

28 6 85 రాధ ముఖచిత్రంతో అందంగా ముస్తాబై వచ్చిన ఆంధ్ర సచిత్ర వారపత్రికలో శుశ్రుత నర్సింగ్‌హోమ్ సీరియల్ ఇంట్రస్టుగా వుంది శ్రీ యార్లగడ్డ కిమీరగారి మల్లిక సీరియల్‌లో అమెరికా గురించి తెలుసుకుంటున్నాం మంచి కథలు, సీరియల్స్ ప్రచురిస్తున్నందుకు మీకు మా అభినందనలు

చుండి వెంకటసుబ్బారావు, మైలవరం




ఆంధ్రసచిత్ర వారపత్రికలో సీరియల్‌గా ప్రచురించిన 'మౌనవిపంచి' నవల ఈ వారం అయిపోయింది రచయిత్రి ఆరె పద్మజాచౌదరి సంపూర్తిగా ముగించినారు వారికి మా ధన్యవాదాలు ఇందులో కృష్ణచైతన్య పాత్ర బాగుగా నచ్చినది

జె వి. చెంగల్‌రాయులు చిత్తూరు

## కథలు

అందాల నటి 'రాధ' ముఖచిత్రంతో వెలువడిన పత్రిక ఆకర్షణీయంగా ఉంది శ్రీ మధురాంజీ గారు రచించిన ఇది జీవితం కథ చాలా బాగుంది ఇటువంటి చక్కని కుటుంబగాథను రచించిన రచయితగార్కి మా ధన్యవాదములు

షేక్ షాజహాన్, పాత గుంటూరు

## గమనిక

5-11 జూలై, 85 సంచికలోని 51 వ పేజీలో ప్రచురింపబడిన 'ధర్మపథం' శీర్షికలో దుష్కృత్ కరణే కి బదులు దు కృక్ కరణే అని పొరపాటుగా పడింది పాఠకులు గమనించగోరుతున్నాము అచ్చు పొరపాటుకి చింతిస్తున్నాము –సం ☐


# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు (1938-1972)

శుక్రవారం 26 జూలై–1 ఆగస్టు 1985
శ్రీ క్రోధన నామ సం అధిక శ్రావణ శు నవమి

సంపుటము 77 : సంచిక 47

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు. 2-00 |
| ఆరు మాసాల చందా | రు. 55-90 |
| పోస్టులో ఏడాది చందా | రు. 111-80 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

# అంచనాలని మించిపోయిన నల్లడబ్బు!




ఇతర దేశాలకి కొన్ని మంచి సంవత్సరాలు, కొన్ని చెడు సంవత్సరాలు ఉంటాయి భారత దేశానికి చెడు సంవత్సరాలు, మరీ ఎక్కువ చెడ్డ సంవత్సరాలే ఉన్నాయి ఇప్పటికి ఆరు నెలలు మాత్రమే గడిచిన 1985వ సంవత్సరం చరిత్రలో అత్యంత చెడ్డ సంవత్సరంగా మిగిలిపోతుంది పారిస్, వాషింగ్టన్‌లలో జరుగుతున్న ఉత్సవాలని, భారీ ఎత్తున అక్కడ జరుగుతున్న విందులని మరిచిపోండి అవన్నీ పన్నులు కట్టే వారి కర్చుతో నే నిర్వహింప బడుతున్నాయి 1984 నవంబరు 1 నించీ ఎంత మంది భారతీయులు అసహజమైన చావులకి గురైనారో లెక్కించండి ఢిల్లీ భోపాల్‌లలో మరణించిన వారు కాక ఆ సంఖ్య 50 వేల వరకూ అంటే రోజుకి 200 ఉంటుందని అంటున్నారు మహోధృత మైన ఒక మృత్యు కెరటం మన మీద విరుచుకు పడినట్లుగా ఉంది అది పురుషులని, స్త్రీలని చివరికి పిల్లలని కూడా పొట్టన పెట్టుకున్నది కానీ పాలకులు మాత్రం నిమ్మకి నీరెత్తినట్లుగా ఉన్నారు ఎయిర్ ఇండియా విమాన ప్రమాదంలో దుర్మరణం పాలైన వారికోసం కెనడా ఒక రోజు సంతాప దినంగా ప్రకటించి, పతాకాలని అవనతం చేసింది. మన పతాకం మాత్రం అవనతం కాలేదు ఎక్కడో ఐర్లాండులోని భయంకర అట్లాంటిక్ సముద్రంలోనించి మృత దేహాలని బయటికి తీస్తున్న రోజున భారత రాజకీయ నాయకులు ఆసియా క్రీడోత్సవాల పుస్తకాన్ని ఆవిష్కరించడంలో తీరిక లేకుండా ఉన్నారు

అత్యంత విషాదకరమైన ఆ వార్తని ఏమాత్రం అవకాశం ఉన్నా బయటికి పొక్కనీకుండా చేయడానికి కొందరు రాజకీయ నాయకులు ప్రయత్నం చేసి ఉంటారని నా నమ్మకం ఎందుకంటే గత నవంబరులో ఢిల్లీలో వందలాదిగా జనం వధింప బడుతూ ఉంటే ప్రభుత్వ ప్రతినిధి ఒకరు టి వి తెరపై కనిపించి పరిస్థితి పూర్తిగా అదుపులో నే ఉందని అందరికీ హామీ ఇచ్చారు పరిస్థితి అదుపులో అప్పుడూ లేదు ఇప్పుడూ లేదు గుజరాత్‌లో ఎక్కువ మంది చేత ద్వేషింప బడుతున్న సోలంకీ అక్కడ జరుగుతున్న ఆందోళనని గాలికి వదిలివేసి ఢిల్లీలో పండగ చేసుకున్నట్లు మూడు రోజులు గడిపారు పంజాబ్ అస్సాం గుజరాత్‌లలో పరిస్థితులు ఆందోళనకరంగా ఉన్నా ప్రధానమంత్రి ఒ పక్షం రోజుల పాటు విదేశాలలో విందులు చేసి వచ్చారు

విశ్వనాథ్ ప్రతాప్‌సింగ్ విడుదల చేసిన నల్ల డబ్బుపై నివేదికని తీసుకోండి ఆ నివేదిక భారత దేశంలోని ఆర్థిక వ్యవస్థని పరిశీలిస్తూ, దేశంలో నల్ల డబ్బు శాతం పెరిగిపోవడాన్ని అంచనా వేస్తున్న విదేశీ పరిశీలకుల కోసం ప్రధానంగా రూపొందించబడింది అంతర్జాతీయ ద్రవ్యనిధి అధ్యయనాన్ని బట్టి కొన్ని సంవత్సరాల క్రితం దేశంలో నల్లడబ్బు 50 శాతానికి కొంచెం తక్కువగా ఉండేది అది ఈపాటికి ఆ అంకెని దాటి పోయి ఉంటుంది కానీ అధికార అంచనాల ప్రకారం దేశంలోని మొత్తం ఉత్పత్తిలో 20 శాతం మాత్రమే ఉంది వ్యవసాయం ద్వారా వచ్చే ఆదాయాలపై ఈ దేశంలో పన్నులేదని ఏ స్కూలు విద్యార్థిని అడిగినా చెబుతాడు మొత్తం జాతీయ ఉత్పత్తిలో వ్యవసాయం 40 శాతానికి పైగా ఉంటుంది దీన్ని మినహాయిస్తే ఈ అధ్యయన బృందం అంచనా వేసిన నల్లడబ్బు పన్ను వేయదగిన మొత్తం ఆదాయంలో 35 శాతం ఉంటుంది కానీ ఆ నివేదికని చూస్తే ఈ అంకెకి దరిదాపులలో ఆ శాతం కనిపించదు

అంతేకాదు ఈ నల్లడబ్బు అంచనాలలో సరకుల దొంగ రవాణా విదేశీ మారకద్రవ్యం ద్వారా జరిగే దొంగవ్యాపారం కంట్రోలు వస్తువులని నల్ల బజారులో అమ్మడం ద్వారా వచ్చే లాభాలు మొదలైన వాటిని చేర్చలేదు అంటే అప్పుడు నల్ల డబ్బుకి అర్థం ఏమిటి? సక్రమంగా జరిగే దిగుమతుల పరిమాణంలో దాదాపు విదేశాలనించి అక్రమంగా దిగుమతులు దొంగరవాణా ద్వారా జరుగుతున్నాయని అంచనా వేయబడింది అలాంటివి సంవత్సరానికి దాదాపు 12 వేల కోట్ల రూపాయల మేరకి ఉంటాయి దేశంలోని విదేశీ మారక ద్రవ్యాన్ని దొంగ రవాణా ద్వారా విదేశాలకి చేరవెయ్యడం, లేదా స్విట్‌జర్లాండు తదితర చోట్ల గల నెంబరు మాత్రమే ఉండే ఖాతాల ద్వారా వాటికి పెట్టుబడి లభిస్తూ ఉంటుంది మాధవసింగ్ సోలంకీ మిత్రుడైన ఒక యువ పారిశ్రామిక వేత్త దాదాపు 43 లక్షల విదేశీ మారక ద్రవ్యాన్ని దొంగ రవాణా చేస్తూ బొంబాయిలో పట్టుబడ్డాడు ఒక పత్రికలో దానిని వివరిస్తూ అతని మిత్రులు ఆ మొత్తాన్ని ఒక హోటల్ గదిలో కూర్చుని బయటికి కదలకుండా సాయంత్రానికి సాయంత్రమే సమకూర్చ గలిగారట ఇలా కొద్ది గంటలలోనే 43 లక్షల రూపాయల విలువ గల డాలర్లని కొనగలిగితే ఇక కొన్ని రోజుల్లో అయితే ఎంత మొత్తాన్ని కొన గలుగుతారో దాన్నిబట్టి ఊహించండి అదే పత్రిక మరొక నివేదికలో వారు రెండు సంవత్సరాలకి సరిపోయే విదేశీ వ్యాపారానికి తగినంత విదేశీ మారక ద్రవ్యాన్ని కూడ బెట్టారని పేర్కొన్నది అధికారికంగా వెలువడిన నివేదిక మాత్రం ఈ అంశాలని అసలు స్పృశించనే లేదు సరికదా వాటిని పూర్తిగా విస్మరించింది బహుశః దానికి ఎన్నో మొహమాటాలు కారణం అయి ఉండవచ్చు

మరొక ఉదాహరణ తీసుకుందాము ప్రభుత్వ ప్రతినిధులు దేశంలో గోదుమ నిల్వలు విపరీతంగా ఉన్నాయని వాటిని ఏం చేయాలో అంతు పట్టటంలేదని అదే పనిగా చెబుతున్నారు ప్రభుత్వం దగ్గర గోదుమలు ఉంటే ఉండవచ్చు కానీ ప్రజల దగ్గర మాత్రం లేవు అలా ఉండి ఉంటే తమకి వచ్చే కొద్దిపాటి రేషన్ కోసం పగలంతా గంటల తరబడి ఎండలో పడిగాపులు కాసి వాటిని తెచ్చుకోవాల్సిన అవసరం వారికి ఉండదు అసలు అంత ఎక్కువ గోధుమ నిల్వలు మనకి ఎందుకు?

మనం మంచి తిండిపుష్టి గలవాళ్ళమా? అదేమీ కాదు మనం వాటిని కొనలేని స్థితిలో ఉండటమే దానికి కారణం ఏ ఇతర ప్రభుత్వం అయినా దేశంలో ఉన్న వాటిని సక్రమంగా పంపిణీ చేసే మార్గాలని గురించి ఆలోచించి ఉండేది అందువల్ల అన్నార్తులకి కనీసం ఒక పూట భోజనం అయినా దొరికేది కానీ అలా వీల్లేదు మన దృష్టి అంతా 21వ శతాబ్దం మీదే ఉంది

కంప్యూటర్లు, వ్యోమ నౌకలు లేకుండా మనం దాంట్లోకి వెళ్లలేము కాబట్టి కంప్యూటర్లు, తదితర తమాషా సామగ్రి ఉన్న దేశాల వారికి మన గోదుమలని అయిన కాడికి అమ్మాలి నల్ల డబ్బు పై నివేదికని తయారు చేసిన సంస్థనే అదనంగా ఉన్న ఈ గోదుమ నిల్వల గురించి నివేదికని రూపొందించమని వాళ్లు ఆదేశించినా నాకు ఆశ్చర్యం కలగదు

ప్రధాన మంత్రి కనుసన్నలలో ఉండే కుర్రకారు గత 8 నెలలుగా చాలా ఎక్కువగా పనిచేస్తున్నారు ఇది పనిచేసే ప్రభుత్వం మాత్రమే కాదు ప్రజలకి కావలసిన వన్నీ సమకూర్చే ప్రభుత్వం అన్న భావాన్ని ప్రజలలో కలిగించాలని వాళ్ల తాపత్రయం కానీ అలాంటి సూచన లేవీ నాకు కనిపించడంలేదు ప్రభుత్వం ఇప్పుడు వారానికి అయిదు రోజులే పని చేస్తున్నది అంటే సంవత్సరానికి నాలుగు నెలలు సెలవులో నే ఉంటుందన్న మాట ఇక ప్రజలకి కావలసిన వన్నీ సమకూర్చడం అన్న విషయానికి వస్తే అది పారిస్, వాషింగ్టన్‌లో ఉత్సవ నిర్వహణే అనిపిస్తున్నది ఇక్కడి నించి వెళ్లిన ఎంతో మందికి అత్యాధునిక క్లబ్‌లలో అక్కడి కొత్త ఫాషన్ల గురించి చర్చించుకోడానికి మాత్రమే అవి ఉపయోగిస్తాయి ఇది వరకు రెండు రోజులలో అందే ఉత్తరాలు ఇప్పుడు వారం రోజులకి గానీ అందవు టెలిగ్రాములు అసలు పత్తాయే ఉండవు గంటలు, రోజుల తరబడి విద్యుచ్ఛక్తి, నీరు లేకుండా గడపవలసి వస్తుంది కానీ సంపన్నుల, ఉన్నత పదవులలో ఉన్న వారి బంగళాలలో మాత్రం అన్నీ లక్షణంగా ఉంటాయి ప్రధానమంత్రి చెబుతున్న కొత్త ఆర్థిక విధానం ఇదే అయితే ఆయనకీ, ఆయనకి వోట్లు వేసిన వారికీ శుభమగుగాక! □

# పంజాబు రాజకీయాల రంగులరాట్నం లేదా ఎవరు పవిత్రులు?

(21-27 జూన్,'85 సంచిక తరువాయి)

1975 జూన్‌లో భారతదేశంలో ఒక పెద్దమార్పు వచ్చింది శ్రీమతి ఇందిరాగాంధీ ఎన్నికలకేసు పోవటంతో ఆమె అత్యవసర పరిస్థితి లేదా ఎమర్జెన్సీ విధించారు ఒక దెబ్బతో దేశంలో పార్లమెంటరీ ప్రజాస్వామ్య వ్యవస్థ అంతం అయిపోయినట్లనిపించింది ఇక్కడ ఒక అతి ముఖ్యమయిన యదార్థాన్ని గుర్తించక తప్పదు పార్లమెంటరీ ప్రజాస్వామ్య వ్యవస్థ ఆధునిక కాలాలలో పశ్చిమ యూరోపులోనే అభివృద్ధి చెందింది రష్యాలో, పశ్చిమ ఆసియా దేశాలలో ఈ వ్యవస్థ అసలు రూపొందనేలేదు పశ్చిమ యూరోపు దేశాల వలస ప్రాంతాలలో పార్లమెంటరీ ప్రజాస్వామ్య వ్యవస్థకి అంటు వేశారనవచ్చు కాని అది నిలిచింది ఒక్క భారతదేశంలో మాత్రమే ఒకప్పుడు భారతదేశంలో భాగాలుగా ఉన్న నేటి పాకిస్తాన్ బంగళాదేష్‌లలో ఏమయిందో వేరే చెప్పనక్కరలేదు భారతదేశంలో మధ్యఆసియా నుంచివచ్చి సామ్రాజ్యాలు స్థాపించినవారు నెలకొల్పిన సంప్రదాయాలు ఈ దేశంలో తలఎత్తగలవని ఎందరో భయపడ్డారు దీనికితోడు కమ్యూనిస్టు రాజ్యాల నియంతృత్వం కూడా ఇక్కడ నెలకొన గలదన్న భయం చాలామందికే కలిగింది ఒక్క మాటలో చెప్పాలంటే భారతదేశంలో ఒక సుదీర్ఘమయిన రాత్రి మొదలయినదనుకున్నారు వీరందరూ

భారతదేశంలో ఏదీ గట్టిగా నిలవదనటానికి ఎమర్జన్సీ చరిత్రే నిదర్శనం' ఇది కొనసాగిన పంతొమ్మిది నెలలలోనూ అత్యవసర పరిస్థితి సయితం కుంటుతూనే నడిచింది (కీశే స్టాలిన్ భారతదేశానికి మారిపోతే అచిరకాలంలోనే చెవిలో పువ్వుమూ నుదిటిమీద బొట్టూ పెట్టుకుని ఒక అతిసాధువయిన నియంతగా మారిపోగలరని కొందరు అనేవారు) చివరికి -అదికూడా అంతం అయింది కారణాలు ఏమయితేనేమి శ్రీమతి ఇందిరాగాంధీ ఎన్నికలు జరుపుతామని ప్రకటించారు అత్యవసర పరిస్థితిని తొలగించారు ఎన్నికలలో ఓడిపోయారు. ప్రధానమంత్రి పదవి నుంచి తప్పుకున్నారు

(ఈ వ్యాసానికి ప్రస్తుతమయిన విషయం కాదుకాని 1977లో జరిగిన లోకసభ ఎన్నికలలో ఆ తరువాత 1978లో జరిగిన శాసనసభ ఎన్నికలలో ఆంధ్రప్రదేశ్‌లో శ్రీమతి ఇందిరాగాంధీ పార్టీయే ఘనంగా గెలిచింది 1983 తరువాత పరిస్థితి మారిపోయింది నియంతృత్వపు ప్రమాదాలపట్ల ఉదాసీనంగా ఉన్నవారు సినిమామోజుని ఆపుకోలేక పోయారు ఆంధ్రప్రదేశ్‌లో రాజకీయ చైతన్యాలు బాగా అభివృద్ధి కాలేదని ఈ పరిణామాలు చెప్పక చెబుతాయి')

1977లో పంజాబులో ఏమయింది? ఉంటే, శాసన సభ ఎన్నికలలో ఏమయింది?

పంజాబు శాసనసభలో 117 స్థానాలు ఉన్నాయి

వీటికి జరిగిన పోటీలో కాంగ్రెసు (శ్రీమతి ఇందిరాగాంధీ పార్టీ) ఒక పక్క అంటే మిగిలిన రాజకీయ పక్షాలు ఇంకొక పక్క ఉన్నాయి

మత ప్రధానమయిన అకాలీదళ్‌తో జనతాపార్టీ కమ్యూనిస్టు పార్టీలు వగయిరా కలిసి పనిచేశాయి భారతీయ కమ్యూనిస్టుపార్టీ ఎమర్జన్సీలో ఎటుఉందో అందరికీ తెలుసు

అత్యవసర పరిస్థితిని రా స్వ సం నాయకులు శ్రీ దేవరస్ బలపరిచారన్న వార్తలు వెలువడ్డాయి ఒక్క జనతాపార్టీవారుతప్ప ఇతరులు ఆధునిక భావాలని బలపరిచేవారు అనటానికి వీలులేదు

(1939లో కీశే స్టాలిన్ ఒక ఒప్పందం చేసుకున్నారు దానిపేరు మోలటోవ్- రిబ్బన్‌ట్రోప్ ఒప్పందం కీశే హిట్లర్‌తో కీశే స్టాలిన్ చేసుకున్న ఒప్పందానికి రష్యా, జర్మనీ దేశాల ప్రతినిధుల నామధేయాలు కలిసిన పేరువచ్చింది కమ్యూనిస్టులకి సిద్ధాంతాలు ఎప్పుడూ అడ్డురాలేదనే అనాలి )

ఎన్నికల ఫలితాలు ఈ కిందివిధంగా ఉన్నాయి

| పార్టీ | స్థానాలు పోటీ చేసినవి | స్థానాలు గెలిచినవి |
|---|---|---|
| కాంగ్రెసు (ఇం) | 96 | 17 |
| జనతా | 41 | 25 |
| భా క పా | 18 | 07 |
| భా క పా మా | 08 | 08 |
| అకాలీదళ్ | 70 | 58 |
| స్వతంత్రులు | 435 | 02 |
| మొత్తం | | 117 |

స్థానాల వివరాలు ఇలాగ ఉంటే వోట్ల వివరాలు కింద చూపించినవిధంగా ఉన్నాయి

| పార్టీ | శాతం |
|---|---|
| కాంగ్రెసు (ఇం) | 34 1 |
| జనతా | 15 0 |
| అకాలీదళ్ | 31 4 |
| భా క పా | 06 1 |
| భా క పా మా | 03 5 |
| స్వతంత్రులు | 09 6 |

(మొత్తం 100 0 రాకపోవడానికి కారణం పయిన చెప్పిన పార్టీలుకాక వేరే ఉన్నాయి వాటికి 0 3 కన్నా కొంచెం ఎక్కువ శాతం వోట్లు పడ్డాయి )

నిజానికి జనతా ఒక కాంగ్రెసు చీలిక పార్టీమాత్రమే జనసంఘంవారు కొంత కా ం ఈ పార్టీతో ఉన్నప్పటికీ 1980 ఎన్నికలలో భా జ పా కి శాసనసభ ఎన్నికలలో ఒకే ఒక్క సీటు వచ్చినసంగతి ఈ సందర్భంలో జ్ఞాపకం చేసుకోవాలి'

అందుచేత 1977 ఎన్నికలలో ఓడిపోయిన కాంగ్రెసు (ఇం)కీ, జనతాకీ కలిపి 34 1+15 0=49 1 శాతం వోట్లువస్తే అకాలీదళానికి- ఇతరుల మద్దతుతో- 31 4 శాతం వోట్లు మాత్రమే రావటం భారత స్వాతంత్ర్యోద్యమానికి పునాదులువేసిన కాంగ్రెసుపార్టీ బలం నిజంగా తగ్గలేదని సందేహం లేకుండా చెప్పవచ్చు'

(కమ్యూనిస్టు పార్టీలు రెండింటికీ కలిపి- ఇతరుల భాసటతో- 10 1 శాతం వోట్లు రావటం గమనించాలి )

శ్రీమతి ఇందిరాగాంధీ ఎంత బలహీనంగా ఉన్నప్పటికీ (1977లో) పంజాబులో ఆమె పార్టీ 34 శాతంకన్నా ఎక్కువ వోట్లు తెచ్చుకుంటే అకాలీదళ్ 31 4 శాతం మాత్రమే తెచ్చుకోగలిగింది

జనతావారు మంత్రివర్గం ఏర్పాటు చేసుకున్నారు శ్రీ ప్రతాప్‌సింగ్ బాదల్ ముఖ్యమంత్రి అయ్యారు ఈయన ప్రభుత్వం అవినీతికి పేరు తెచ్చుకున్నదని జనతాకి అనుకూలంగా ఉండేవారు అనేవారు ఏది ఏమయితేనేమి శ్రీయుతులు చరణ్‌సింగ్ సంజీవరెడ్డి కొందరు ఇతరుల సహాయంతో జనతాని నాశనంచేసి మళ్ళీ శ్రీమతి ఇందిరాగాంధీ అధికారంలోకి రావటానికి వీళ్ళు కల్పించారు

★ ★ ★ ★

1980 ఎన్నికలలో శ్రీమతి ఇందిరాగాంధీ ఘనంగా

గెలిచారు ఆమె మళ్లీ ఎమర్జెన్సీ పెడతారని కొందరు భయపడ్డారు కాని అలాగ జరగలేదు దేశంలో రాజకీయాలు ఎప్పటిలాగే తమ వింతదోరణిలో కొనసాగుతూనే వచ్చాయి

1980లో పంజాబు శాసనసభకి జరిగిన ఎన్నికల ఫలితాలు ఇలాగ ఉన్నాయి

| | |
|---|---|
| కాంగ్రెసు (ఐ) | 63 |
| అకాలీదళ్ | 37 |
| జనతా | 00 |
| బా క పా | 09 |
| భా క పా మా | 05 |
| భా జ పా | 01 |
| ఇతరులు | 02 |

జనతాపార్టీలు మూడు పోటి చేశాయి. ఇంకొక కాంగ్రెసు కూడా పోటీ చేసింది. రెండిటికీ సున్నా స్థానాలు వచ్చాయి.

భారతీయ జనతాపార్టీకి ఒకే ఒక్క సీటు వచ్చింది.

ఇతరులు అంటే స్వతంత్రులు.

ఇక వోట్ల శాతాల వివరాలు ఇలాగ ఉన్నాయి

| పార్టీ | శాతం |
|---|---|
| కాంగ్రెసు (ఐ) | 45 2 |
| అకాలీదళ్ | 27 0 |
| జనతా (అన్నీ) | 03 5 |
| బా క పా. | 06 5 |
| భా క పా మా | 04 1 |
| భా జ పా | 06 5 |
| ఇతరులు | 06 5 |

పయి లెక్కలు రెండు వాస్తవాలని తెలుపుతాయి ఇందరితో కలిసి పనిచేసినా అకాలీదళ్‌కి 27 0 శాతం వోట్లు మాత్రమే వచ్చాయి

కాంగ్రెసు (ఐ)కి 45 0 శాతం వచ్చాయి

హిందువుల పార్టీగా చెప్పుకునే బా జ పా కి 6 5 శాతం మాత్రమే వోట్లు పడ్డాయి

అకాలీదళ్‌వారి ఖేదానికి, వ్యధకీ ఇవే కారణాలు

వారు ఎన్నికలలో గెలవలేక దౌర్జన్యానికి దిగారు

ఇప్పుడు ఎన్ని కబుర్లు చెప్పినాసరే బా జ పా వారు పంజాబులో అకాలీదళ్‌క అనుబంధపు రాజకీయ పక్షంగా వ్యవహరించారు (శ్రీ లోంగోవాల్‌ని నిర్బంధించినప్పుడు బా జ పా నాయకుడు శ్రీ జఠ్‌మలానీ ఆయన తరఫున వాదిస్తానన్నారు కాని శ్రీ లోంగోవాల్ అక్కరలేదని అన్నారు

1980-85 మధ్య పంజాబులో జరిగినదంతా ఈ వ్యాసంలో సమీక్షించటం అనవసరం అనిపిస్తుంది' కొన్ని పరిణామాలని మాత్రం స్పృశించి వదిలివెయ్యవచ్చు

నేడు భారతదేశానికి రాష్ట్రపతిగా ఉంటున్న, అంతకి ముందు దేశీయాంగ మంత్రిగా ఉన్న జ్ఞానీ జెయిల్‌సింగ్ పంజాబు ముఖ్యమంత్రిగా ఉన్నారన్న సంగతి మర్చిపోరాదు ఆయన ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు పంజాబు రాజకీయాలు మరీ చెడిపోయాయని కొందరు అంటారు ఇందులో కొంత నిజం లేకపోలేదు కాని ఇతర రాజకీయవాదులకన్నా ఆయన ఎక్కువ చెడుపనులు చేశారంటే నమ్మటం అంత తేలిక కాదు

అసలు అకాలీల కోరిక ఏమిటి?

పంజాబులో సిక్కుమతం వారికితప్ప ఇంకెవరికీ ఏ ముఖ్యమయిన పదవీ రాకూడదు, అని

ఇది న్యాయమయిన కోరికగా తోచదు కాని కాంగ్రెసువారి పాలనలోనే సిక్కుల ఆధిక్యతకి అడ్డులేక పోయింది రా స్వ. సం వారి ఇంగ్లీషు



శ్రీ దర్బారాసింగ్

వారపత్రిక ఆర్గనయిసర్ లో ఒకసారి ప్రచురించిన వివరాల ప్రకారం పంజాబులోని ముఖ్యమయిన పదవులు 100 ఉంటే 77 సిక్కులకేదక్కాయి

ఇక వారికి జరిగిన అన్యాయం ఏమిటి?

అకాలీల మధ్య పోట్లాటలు ఈనాటివికావు కాంగ్రెసు (ఐ) వారు భేదోపాయాన్ని వాడారన్న ఆరోపణ వినపడుతూ ఉంటుంది ఇందులో ఆశ్చర్యం ఏమిటి?

కన్సర్వేటివ్‌లు ఇంగ్లాండులో లేబర్ పార్టీవారి భావాలని దొంగిలించి నట్టే తమిళనాడులో కీ శే కామరాజనాడార్ కాంగ్రెసు అప్పటి ద్రావిడ కళగమ్ వారిభావాలని పరోక్షంగా అమలుపరచే వారన్న వ్యాఖ్య వినపడేది శ్రీమతి ఇందిరాగాంధీ కొంతకాలం కింద ద్రావిడకళగాన్ని చీల్చారు ఆమె తండ్రికి కమ్యూనిస్టు పార్టీనే చీల్చిన కీర్తి దక్కింది అకాలీలని చీల్చటం తప్పా, ఒప్పా అనికాదు ప్రశ్న, ఆ పని కాంగ్రెసువారు మాత్రం చేస్తే తప్పా? అసలు ఇంకొకరు చీల్చటం దేనికి? ప్రస్తుతం అకాలీదళంలో చెలరేగిన విభేదాలమాట ఏమిటి?

కీ శే బింద్రన్‌వాలే ఒక వింత వ్యక్తి ఆయనకి కాంగ్రెసు (ఐ)వారు ప్రోత్సాహం ఇచ్చారంటారు ఇచ్చి ఉండవచ్చు కాని ఆయన అమృత్‌సర్ బంగారుగుడిని ఒక సాయుధ స్థావరంగా చేస్తారని కాంగ్రెసు (ఐ)వారు ఊహించి ఉంటారా?

చివరికి దీనివలననే కదా శ్రీమతి ఇందిరాగాంధీ ప్రాణం పోయింది" ఆమె కోరి ఇదంతా చేసి ఉంటారా? (సిక్కు అంగరక్షకులు వద్దని ఆమెకి ఎవరో సూచించగా మత విచక్షణ సరికాదని ఆమె ఈ సూచనని తోసి పుచ్చారట )

ఈ మధ్యనే బా జ పా నాయకులు శ్రీ వాజపేయి జాతీయ సమయిక్యత కోసం విజ్ఞప్తి చేశారు

బొంబాయిలో శివసేనతో పొత్తు కుదుర్చుకున్నది బా జ పా కాదా" శివసేనవారు ఏమంటారు?బొంబాయిలో దక్షిణాదివారు ఉండరాదంటారు

గుజరాత్‌లో అగ్రవర్ణాల వారు కొందరు ఇతర "అగ్రవర్ణాల వారిమీద యుద్ధం చేస్తున్నారు' ఇది మత కలహాలకి కూడా దారితీసింది శ్రీ సోలాంకీ గద్దెదిగాలని భా జ పా వారు బ్హాహాటంగా ప్రచారం చేస్తున్నారు మరి సోలాంకీ ఎన్నికలలో ఘనంగా గెలిచింది ఎందుకు?

జూన్ 12 తేదీతో (!) పంజాబులోని హోషియార్‌పూర్ నుంచి టయిమ్స్‌ఆఫ్ ఇండియా విలేఖరి శ్రీ సుబాష్ కిర్పేకర్ పంపిన ఒక వార్తలో ఇలాగ ఉంది

అఖిలభారత సిక్కు విద్యార్థుల సమాఖ్యకి చెందిన కొందరు యువకులు ప్రదర్శించే తీవ్రవైఖరికీ (అమృత్‌సర్‌లోని) శివసేనకీ మధ్య చెప్పుకోతగిన తేడాలేదని ఈ విలేఖరికి అనిపించింది రెండు పక్షాలవారికీ ద్వేషం, అనుమానం నూరిపోస్తున్నారు శివసేనకి చెవగా 270 పురుషులు ఉన్నారని చెప్పబడుతూ ఉంటుంది . శ్రీ పవన్‌కుమార్ హిందూ సురక్ష సమితిని ఏర్పాటు చేసిన తరువాత రా స్వ సం కి చెందిన శ్రీ జగదీష్ తంగ్రి (ఈయన వయసు 55, ఈయనకి ఒక అంగడి ఉందట ) శివసేనని ప్రారంభించారని చెప్పబడుతోంది

పంజాబులో ఎవరూ అమాయకులుకారు నీతులు చెప్పేవారు అసలేకారు అవతలి వారిని హింసపెట్టి తమ ఆత్మగౌరవం దెబ్బతిన్నదని వాపోయేవారు కూడాకారు కాంగ్రెసు (ఐ)వారు పంజాబులో అనుసరించిన విధానాలు ఇతరుల విధానాలకన్నా హీనమయినవి అంటే అంగకరించటం కష్టం!

(అయి పోయింది)

—సూరి

సీరియల్

# శుశ్రుత నర్సింగ్ హోమ్

డాక్టర్ కె. రవీంద్రబాబు

(గత సంచిక తరువాయి)

మంజ వాళ్లయిల్లు, శుశ్రుత నర్సింగ్‌హోమ్‌కు రెండు బజార్ల అవతలవున్నది రవి యం బి బి యస్ చదివేటప్పుడు చాలాసార్లు వాళ్ల ఇంటికి వెళ్లాడుకూడాను మంజ తండ్రి నరసింహారావు లాయరు ఆయన ఎంత సరదామనిషో అంత కోపిష్టి! మంజతల్లి భూదేవికి మంజ ఒకర్తే సంతానం భూదేవి మంజను అపురూపంగా పెంచింది మంజ స్నేహితులందరినీ ఎంతో ప్రేమగా చూచుకునేదామె సావిత్రమ్మగారికి భూదేవి అంటే ఎంతో ఇష్టం, అభిమానం పక్కబజార్లలో ఇళ్లు వుండడంతో తరచుగా వొకరింటికి వొకరు వస్తూ పోతూ వుండేవాళ్లు

భూదేవి మాదొడ్డఇల్లాలు! వెనుకటికాలం మనిషి చుట్టాలన్నా స్నేహితులన్నా ఎంతో అభిమానం చూపుతుంటుంది ప్లీడరుగారికి ముక్కుమీదే కోపం! అయినా తొణకకుండా నిండుకుండలా సంసారం నెట్టుకొస్తుంది! అనేది భూదేవిని గూర్చి సావిత్రమ్మ

అయితే మనసులో మాత్రం మంజకి రవికి ఈడూ జోడూ, చదువు అన్నీ సరిపోతాయి గీతకు అన్యాయం జరుగుతుందని భయంగాని లేకపోతే చక్కగా రవి మంజని పెళ్లి చేసుకోవచ్చు అనుకునేది

అందుకనే సావిత్రమ్మ భూదేవితో పైకి చనువుగానూ స్నేహంగానూ వుంటూనే మనసులో కొంత దూరం వుంచేది

నరసింహారావుగారు సార్థకనామధేయుడు పట్టుదలవస్తే మనిషికాదు

ఆయన ఒకసారి రవిని వాళ్లయింటికి భోజనానికి పిలిచాడు పరీక్షల హడావిడివల్ల మరచిపోయి వెళ్లలేదు రవి! ఆ తరువాత నెల రోజులవరకూ ఆయన రవితో మాట్లాడలేదు

రవి ఎన్నోమార్లు క్షమాపణ చెప్పుకుని, మంజ ఎంతో బతిమిలాడిన తర్వాతగాని ఆయన కోపం చల్లారలేదు!

ఆయన కోపం పట్టుదలవల్ల దాదాపుగా ఆస్థిఅంతా నాశనమయిపోయింది మంజ యం బి బి యస్ పాసయేనాటికి వుంటున్న ఇల్లుతప్ప మిగిలిన ఆస్థిఅంతా కర్చుపెట్టేసాడు ఒక్కగానొక్క కూతురుకు తగిన సంబంధం తేలేనేమోననే దిగులుతో హార్ట్ఎటాక్‌వచ్చి పోయాడాయన

ఇండియాలో వుంటే వుద్యోగం దొరకదు అనే వుద్దేశంతో మంజ అమెరికా వెళ్లిపోయింది ఆ తర్వాత! మంజ యింటికి వెళుతుంటే జరిగిన విషయాలన్నీ వొకటి గుర్తుకు రాసాగాయి!

మంజ వాళ్లింట్లో అడుగు పెడుతుంటే భూదేవి ఎదురుగావచ్చి ఏమయ్యా రవీ! నన్ను బొత్తిగా మర్చిపోయావే? మంజ లేకపోతే నువ్వు మా యింటికి రాకూడదా ఏం? అంటూ ఆప్యాయంగా పలుకరించింది

లేదు ఆంటీ! నర్సింగ్‌హోమ్ పెట్టిన దగ్గరనుండి క్షణం తీరికలేకుండా వుంటున్నది! లేకపోతే నీ చేతివంట రుచి మర్చిపోగలనా?

మంజ ఎన్నాళ్లుంటుందో అన్నాళ్లు నువ్వు మా యింట్లో భోంచెయవలసిందే! మంజ ఎప్పుడు వెళ్లిపోతుందో తెలియదు! అది వున్న నాలుగురోజులయినా యింట్లో కాస్త సందడిగా వుండాలి! ఏం

అలాగే ఆంటీ! కాని చిన్న చిక్కువచ్చింది మా అమ్మమ్మ కూడా నువ్వన్నట్టు

జరిగిన కథ .—5 రచయిత, సర్జన్ అయిన రవితో రచయిత్రి, లెక్చరర్ అయిన ఇందువదనకు హైదరాబాదులో పరిచయం అయ్యింది విజయవాడలో తన ఇంటికి వచ్చిన ఇందూకి చంద్రహాస్ నుంచి వచ్చిన ఉత్తరం సాక్షాత్కరించింది తనకి కడుపు నెప్పి ఎక్కువగా ఉందని, అందు మూలంగా గుంటూరులోని రవిగారి శుశ్రుతా నర్సింగ్‌హోమ్‌లో చేరానని రాసాడు ఇందుకి చంద్ర మొదట తనని ఎలా అల్లరి పెట్టిందీ తుదకు ఏ విధంగా ఆప్తమిత్రుడైనదీ గుర్తుకు వస్తుంది చంద్రను చూడటానికి గుంటూరు వస్తుంది ఇందువదన రవి ఇంట్లో దిగుతుంది అక్కడి నుండి ఆ రాత్రే చంద్రను చూడను నర్సింగ్‌హోమ్‌కి వెళుతుంది చంద్ర ఆమెను చూసి ధైర్యం తెచ్చుకుంటాడు చంద్ర, రాకేష్ ఇందువదన పేరు కలవరించటం విన్న రవి మనసు కల్లోలం చెందుతుంది రవికి మేనకోడలు గీతను పెళ్లి చేసుకోవటం ఇష్టంలేదు రవి క్లాస్‌మేట్ మంజ అమెరికా నుండి వచ్చింది చంద్రహాస్‌కి అల్సర్ ఆపరేషన్ జరిగింది



అంటున్నది

అదేం కుదరదయ్యా రవీ! కావాలంటే నేనువచ్చి సావిత్రత్తయ్యను బతిమిలాడుతాను! ఆమెకు సందడి కోసం నువ్వు, గీత వుండనే వున్నారు

ఇక మంజు వున్నన్నాళ్లే కదా మా యింట్లో సందడి! అందుకని యీ నాలుగు రోజులూ నువ్వు మా యింటికి భోజనానికి రావాలి!

సమాధానంగా చిరునవ్వు నవ్వి వూరుకున్నాడు రవి

అమ్మా! ఇందు కనబడిందే!

ఆ ఇందు కనబడిందా? ఎక్కడా?

రవి నర్సింగ్‌హోమ్‌లో చంద్ర అనే రోగికి ప్రమాదంగా వుంది అతని దగ్గర వుంది ఇందు!

'అలాగా! మరి నాకు కనబడలేదేమే? పెద్దమ్మనుచూచి వెళితే నామర్దా అనుకున్నదా ఏం?

చంద్ర ఇందు క్లాస్‌మేట్‌అట! అతనికి నా అన్నవారెవరూ లేకపోతే ఇందుకు కబురుచేసాడు అందుకని అతని దగ్గర వున్నది!

అంతేగదా! ఇంకాపెదనాన్న మీద కోపం పోలేదేమోనని భయపడ్డాను సరే ఆనకపెళ్లి చూచి ఇందును ఇంటికి తీసుకువస్తాను

రవీ! ఇందు నాకు స్వయాన చిన్నమ్మకూతురు బాబాయి లక్ష్మణమూర్తి పిన్ని శ్రీదేవి అంటే మా నాన్న చాలా అబిమానంగా వుంటుండేవాడు మొదట్లో! బాబాయి ప్రైవేట్ కంపెనీలో పని చెస్తూవుండేవాడు బాబాయి పనిచేసే కంపెనీమీద ఎవరో వ్యాజ్యంవేసారు! వాళ్లతరపున నాన్న లాయరుగా పనిచేసాడు ఆ వ్యవహారాలప్పుడు నాన్నకు బాబాయికి ఏదో మాటామాటా వచ్చింది అంతే! ఇక అప్పట్నుంచీ నాన్న వాళ్లతో మాట్లాడడం మానివేసాడు నన్ను అమ్మనీ కూడా వాళ్లతో మాట్లాడటానికి వీల్లేదన్నాడు! అమ్మ నేను ఎంత మొత్తుకున్నా ప్రయోజనం లేకపోయింది నాన్న బ్రతికివున్నన్నాళ్లు ఇందు, పిన్ని, బాబాయి యీ యింటి గడప తొక్కలేదు!



నాన్న పోయాక ఆయన కర్మరోజున మళ్లీ వాళ్లు మా యింటికి వచ్చారు! అదీ అమ్మ, నేను మరీమరీ కబురుచేస్తే వచ్చారు ఆ తర్వాత బాబాయికి బొంబాయి ట్రాన్స్ఫర్ అయింది నేనేమో అమెరికా వెళ్ళిపోయాను!

మంజూ! మీ నాన్న పట్టుదల గురించి తెలియని వాడినికాదుగాని, కోర్టు వ్యవహారాలకోసం అయిన వారిని జీవితాంతం దూరంగా అట్టి పెట్టాడంటే నాకు ఏమిటో గావుంది

అవును రవీ! నాన్న పద్ధతే అంత! బాగుంటే ప్రాణాలు విడుస్తుండేవాడు కావాలనుకున్నవారికి సహాయం చేయటానికి సర్వస్వం వొడ్డి త్యాగం చేసేవాడు పట్టుదలవస్తే అంతకంటే తీవ్రంగా ద్వేషంచేవాడు మంచిగాని చెడుకుగాని నాన్నలాటి మనిషి లేడనేవాళ్లు

అమ్మాయి మంజూ! ఇందు కబుర్లేమిటి? పిన్ని, బాబాయి బాగా వున్నారంటనా?

ఏమోనమ్మా! ఆ విషయాలేవీ అడగటానికి వీలు కాలేదు సాయంత్రం కనుక్కుంటాను

ఇందును చూడాలనిపిస్తుందే! శ్రీదేవికి జబ్బుచేస్తే ఇందుని చిన్నప్పుడు రెండుమూడేళ్లపాటు నేను పెంచాను ఇందు నన్ను చాలారోజులపాటు అమ్మా అని పిలిచేది శ్రీదేవిని 'పిన్ని' అంటుండేది ఇంతలో మాట పట్టింపులవల్ల దూరం అయిపోయాము

మంజూ ఇందు నీచెల్లెలని పొద్దునవరకు నాకు తెలియదు సుమా! ఆమె అయినా నాకు చెప్పలేదు!

ఇందుతో హైద్రాబాద్‌లో రచయితల సభలో పరిచయం అయింది రెండు రోజులలోనే మేమిద్దరం ఎంతో సన్నిహితులమయ్యాము గుంటూరు రమ్మనమని ఆమెకు నాకార్డు ఇచ్చాను! మరుసటిరోజే ఆమె వచ్చేసింది

చంద్రకు ఎవరూలేరనీ, అతను ప్రమాదస్థితిలో వున్నప్పుడు వ్రాసిన ఉత్తరం చూచుకుని వచ్చాననీ చెప్పింది ఇంతలో నువ్వు వచ్చావు

రవీ! ఇందూ, నేను అక్క చెల్లెళ్ల పిల్లలమయినా వొకేతల్లి సంతానంకంటే ఎక్కువ ఇదిగా వుండేవాళ్లం! నాన్న పట్టుదలవల్ల వాళ్లు మా యింటికి రాకపోయినా ఇందు, నేనూ వుత్తరాలు వ్రాసుకుంటూ వొకరి విషయాలు వొకరికి తెలుపుతుండేవాళ్లం!

నిజానికి పిన్నికి ఇందు ఒక్కర్తే! అమ్మకు నేనూ అంతే! అందువల్ల ఆమె అంటే మనసులో నాకెంతో అభిమానం! సొంత చెల్లెలు లేదని ఎప్పుడూ దిగులుపడేదాన్నికాదు సుమా! ఇందునే చెల్లెలు అనుకునేదాన్ని!

విధి విన్యాసాలు విచిత్రమైనవి మంజూ!

కబుర్లలో పడిపోయారు! భోజనం వడ్డించాను! లేవండి అని భూదేవి ఎలవడంతో రవి, మంజు డైనింగ్‌టేబిల్ దగ్గరకు వెళ్లారు

ఆవపెండికూరి కాకరగాయ వేపుడు చేసాను! ఇందుకు ఆ కూరంటె ఎంతో యిష్టం! ఇందాక వండుతూ కూడా ఆ విషయమే అనుకున్నాను! సాయంత్రం అయినా ఇందును ఇంటికి రమ్మనాలి అని భూదేవి అన్నం వడ్డిస్తూ అన్నది

అలాగేనమ్మా అంది మంజు

★ ★ ★ ★

మంజు వాళ్లింటి దగ్గర భోజనంచేసి ఇంటికి వెళ్లాడు రవి

అంకుల్! మొన్న మనింటికి వచ్చిన ఇందుగారు, రచయిత్రి యిందుగారు వొకరేనా?

అవును గీతా!

ఇందాక మన బజారులో వున్న నా క్లాస్‌మేట్సువచ్చి రచయిత్రి

# శుశ్రుత నర్సింగ్ హోమ్

ఇందుగారు మీ మామయ్యగారి ఆస్పత్రిలో వున్నారట. ఒకసారి ఆమెను మీ యింటికి పిలిపించవొద్దూ! ఆమెతో మాట్లాడాలని వుంది అన్నారు

'అవున్రా రవి' మన పక్కింటావిడ ఇందాక మనింటికి వచ్చింది. ఏమ్మా ఎప్పుడూ రానిదానివి వచ్చావు అంటే 'మీ ఆస్పత్రిలో రచయిత్రి ఇందు వున్నదని మా పక్కింటివాళ్ళు అంటున్నారు. డాక్టరుగారితో చెప్పి మీ ఇంటికి పిలిపించారంటే ఒకసారి ఆమెను చూచి మాట్లాడటానికి వీలవుతుంది అన్నది. ఆ అమ్మాయిని యీ రాత్రి భోజనానికి మన యింటికి రమ్మని చెప్పు అంది సావిత్రమ్మగారు

అలాగేనమ్మా! అంటూ రూమ్‌లోకి వెళ్ళి బట్టలు కూడా మార్చుకోకుండా అలానే మంచంమీదపడి నిద్రపోయాడు రవి. ఇన్ని రోజులుగా దూరమయిన నిద్రాదేవికి పూర్తిగా వశమయి పోయాడతను

డాక్టరుగారూ!

ఉలిక్కిపడిలేచాడు రవి

నమస్తే డాక్టరుగారూ! రెండు చేతుల నిండుగా బంగారుగాజులు తొడుక్కుని నుదుటన నయాపైసంత కుంకుమబొట్టు పెట్టుకుని బొడ్డుకింద బెత్తెడు పొట్ట కనబడేటట్లు ఎర్రని నైలాన్ చీరకట్టుకుని, వాలుజడలో మల్లెచెండు తురుముకుని వున్నదామె. ఆమె వెంట నుల్చునివున్న అతను వయసులో ఆమెకంటే పది సంవత్సరాలు పెద్దవాడులా వున్నాడు. శుభ్రంగా తోమి బోర్లించిన రాగి చెంబులా బట్టతల, మోకాళ్ళ కిందకు వచ్చిన షర్టు, వదులుపాంటు, దుబ్బు మీసాలు- చేతిలో లేడీస్ హాండ్‌బాగ్- బహుశ భార్యదేమో!

వాళ్ళు అలా సరాసరి తన రూమ్‌లోకి ఎలా వచ్చారో అర్థంకాలేదు రవికి! ఏమయితేనే నిద్రాభంగమయింది

ఏమిటమ్మా! ఏమయింది?' అంటూ మంచం మీదలేచి కూర్చున్నాడు.

డాక్టరుగారూ! క్షమించండి! నిద్రపోయే వాళ్ళనులేపాము! కాని భరించలేని బాధతో ప్రాణంపోయేట్టు అనిపిస్తే మీ ఆస్పత్రికి వచ్చాము. మీరు ఆస్పత్రికి రావటానికి ఇంకా రెండుగంటల టైము వుంటుందన్నారు! అందుకని సరాసరి మీ యింటికవచ్చాను

ఏమిటమ్మా బాధ? మీవారికి ఏమయినా సుస్తీనా?' అంటూ డ్రాయింగ్‌రూమ్‌లోకి దారితీసాడు రవి

అయ్యో ఆయనకేం రోగం! శుభ్రంగా తిని గుర్రుపెట్టి నిద్రపోతారు! ప్రపంచంలో వున్న బాధలన్నీ నన్నే వేధిస్తున్నాయనుకోండి

రవి తన మాటలు శ్రద్ధగా వింటున్నాడో లేదో గమనించాక మరలా మొదలెట్టిందామె




పొద్దున్నే ఏడుగంటలకు వార్తలు చెబుతుండగా నిద్రలేస్తాను 'ఎందుకే వరం! అప్పుడే లేచావు! అసలే అనారోగ్యం మనిషివి, అంటారాయన. అయినాసరే లేని ఓపిక తెచ్చుకుని మంచం మీద కూర్చుంటాను. వెయ్యి రోకళ్ళతో మోదినట్లు తలంతా నొప్పి పుట్టిపోతుంది. ఈ చెవిలోంచి ఆ చెవిలోకి కరెంటు ప్రవహించినట్లు మంటలు పోట్లు నొప్పి బాధ తప్ప సలుపు! రెండు కళ్ళల్లో రెండు పలుగులు దిగబొడిచినట్లు విపరీతమైన మంట పుడుతుంది. తల వెయ్యి ముక్కలయి ఆకాశంలోకి ఒక్కొముక్కా ఎగిరిపోయినట్లు అనిపిస్తుంది. రెండు చేతులతోనూ బుర్ర అదిమి పట్టుకుని ఎగిరిపోయే ముక్కల్ని ఆపుతాను. కళ్ళు మూసుకుని రెండు చెవులలోనూ దూదిపెట్టుకొంటాను. అలా పదింటిదాకా బాధపడతాను. పదింటికి ఆయన ఆఫీసుకు వెళ్ళగానే ఎక్కడలేని ఓపిక తెచ్చుకుని లేచి ముఖం కడుక్కుని కొంచెం కాఫీ తాగుతాను

అలాగా! అయితే మీరు న్యూరో సర్జనుకు చూపించుకోవాలి అన్నాడు రవి

అయ్యో! ఒక్క న్యూరో సర్జను ఏంఖర్మ దేశంలో వున్న న్యూరో సర్జన్లకందరకూ చూపించాను. ఎవరికీ నా జబ్బు అంతుబట్టలేదు! నా బాధలు నాకు మిగిలిపోయాయి! అట్లా మొద్దులా నుల్చుంటావేం? డాక్టరుగారికి నాజబ్బు సంగతి చెప్పు అంటూ మొగుడ్ని మోచేత్తో పొడిచింది

అవున్సార్ డాక్టరుగారూ! వరం తలనొప్పి గురించి మద్రాసు డాక్టర్లకి, హైదరాబాదు డాక్టర్లకి, వెల్లూరి డాక్టర్లకి చూపించాం! ఎవరికి చూపెట్టినా జబ్బేం లేదంటారు అన్నాడు ఆమెభర్త

ఇదా నువ్వు చెప్పేది? అసలు నీకు చెప్పటం చేతనయితే ఇకనాకు దిగులెందుకు!

డాక్టరుబాబూ! తలనొప్పి వున్నంతసేపూ నరకం అనుభవిస్తానంటే నమ్మండి!

అలాగా! అని డాక్టరు రవి అనగానే ఎక్కడలేని వుత్సాహంతో విజృంభించింది

అంతేనా! తలనొప్పి బాధ కొంచెం తగ్గి కాస్త వూపిరి తీసుకునేసరికి గుండెల్లో మంట మొదలవుతుంది! సరిగా పన్నెండు గంటలయేసరికి గుండెల్లో తాటాకు మంటలా భగ్గుమంటుంది. వెయ్యి నిప్పుల కొలిమిలు మండినట్లు సెగ తుకతుకలాడ పోతుంది. కాల్చిన ఇనప సమ్మెట్లు గుచ్చితే బాధకలిగినట్లు బాధతో కుతకుతలాడిపోతాను! ఏ నిముషాని కానిమిషం ప్రాణం పోతుందనిపిస్తుంది. వారికి ఫోనుచేసి పిలుద్దాం అంటే ఫోనుదాకా వెళ్ళేలోపల చచ్చిపోతానేమో అని భయం కలుగుతుంది. ఎలాగో లేని ఓపిక తెచ్చుకుని వంటవాడిని కేకవేసి అన్నం పట్టించమని రెండు మెతుకులు తింటాను

డాక్టరుగారూ! మా వరం గుండెనొప్పిగూర్చి హార్టు స్పెషలిస్టులకు చాలామందికి చూపించాను. ఎవరికి చూపినా ఈ జబ్బు నయంగాదు అనేవాళ్ళుగాని పరవాలేదు! నీ జబ్బు నయం చేస్తాం అని ధైర్యం చెప్పేవాళ్ళు కనపడలా. ఈసారి భర్తమాటలు నచ్చినట్లు తలూపింది వరం!

నిర్ఘాంతపోయి చూస్తున్న డాక్టరు రవితో రెట్టించిన వుత్సాహంతో చెప్పుకుపోసాగింది

వంటవాడు వడ్డిస్తే రెండు మెతుకులు తింటానా ఇక ఆ తర్వాత కడుపులో నొప్పి బయల్దేరుతుంది! వెయ్యి కవ్వాలతో చిలికినట్లు కడుపంతా అతలాకుతలం అయిపోతుంది. ఆ బాధ భరించలేక వెర్రికేకలు పెడతాను. ఇంటిల్లిపాదీ పరిగెత్తుకువస్తారు? కత్తిపీటతో దోసకాయను ముక్కలుగా తరిగినట్లు కడుపంతా ముక్కలయిపోయినట్లవుతుంది! ముక్కలయిపోతున్న కడుపును రెండు చేతుల్తో అదిమి పట్టుకొని పోయే ప్రాణాలను నిలుపుతాను

ఇట్లాగే అవస్థలు పడుతుంటే సాయంత్రం అయిదుదాటేకగాని ఈయన ఆఫీసునుండి ఇంటికిరారు! ఇంటి దగ్గర నేనేమయి పోయానో ఏమో అని దిగులు పడేవాడయితే వెంటనే పరిగెత్తుకురాడూ?

మొగుడి వంక గుర్రుగా చూచింది వరం! ఆమె చూపులకు తట్టుకోలేనట్లు

# మీ పళ్ల మీద చిగుళ్ల పట్టు సడలనివ్వకండి!

## కేవలం ఫోర్‌హాన్స్ మాత్రమే
## చిగుళ్లను గట్టి పర్చగల ప్రత్యేక అస్ట్రింజంట్ కల్గివున్నది.
## చిగళ్లు గట్టిగా వుంటే
## పళ్లు ఎక్కువ కాలం నిలుస్తాయి.




అమెరికాదేశపు ప్రఖ్యాత దంత వైద్యుడు డా. ఆర్.జె. ఫోర్‌హాన్ తాను తయారుచేసిన టూత్‌పేస్టులో ఒక ప్రత్యేక అస్ట్రింజంట్ చేర్చాడు.

1. ఇది నేరుగా చిగుళ్ల మీద పనిచేసి, వాటిని బిగుతు చేసే ఒక విశిష్ట పదార్థము.
2. చిగుళ్లను బలపర్చి, పళ్ల మీద వాటికి మంచి పట్టునిస్తుంది.
3. ఇలా మీ పళ్లకు దృఢమైన ఆధారం, దీర్ఘ ఆయుస్సు ఇస్తుంది.







## ఫోర్‌హాన్స్ — ఇది పళ్ల డాక్టరు సృష్టించిన టూత్ పేస్టు.

339F 234

# సుభాషితాలు

సింహః శిశురపి నిపతతి
మదమలిన కపోలభిత్తిషు గజేషు
ప్రకృతిరి యం సత్వవతాం
న ఖలు వయస్తేజసాం హేతుః




సింహం బాల్యావస్థలో యున్నప్పటికి మదజలంతో మలినమైన చెక్కిళ్ళు గల ఏనుగుల మీదికే దూకుతుంది ఇది పరాక్రమవంతులకు సహజసిద్ధమైన స్వభావం పరాక్రమానికి వయసు కారణం కానోపదు గదా!

(బలవంతుడు బలహీనులతో తలపడుట కిష్టపడడని భావం)

కుసుమస్తబకస్యేవ
ద్వయీ వృత్తిర్మనస్వినః
మూర్ధ్ని వా సర్వలోకస్య
శీర్యతే వనఏవ వా




ఆత్మాభిమానం గల వారిక పుష్పులగుత్తి వలె అందరి చేత శిరసావహింపబడుట లేక వనంలో (ఏకాంతంలో) మడిసి పోవుటయును ఈ రెండు పరిస్థితులే తప్ప వేరొకటి లేదు

(ఆత్మాభిమానం గలవాడేపనైనా చేయడానికి ఒడిగట్టడని భావం)

—ఆయుర్వేద శిరోమణి రాజరాజేశ్వరశర్మ

## శుశ్రుత నర్సింగ్ హోమ్

తలదించుకుని డాక్టరుగారూ మీరు వరాన్ని బాగా పరీక్షచేసి మంచి మందులివ్వండి' మీకు ఎంత ఫీజు కావాలంటే అంత ఫీజు నేనిచ్చుకుంటాను అన్నాడు

వరం చెప్పిన కంప్లెయింట్సన్నీ విన్నాక యిదేదో డాక్టర్లకు అంతుచిక్కని, మందులకు తగ్గని జబ్బులా వుంది అనుకుని ఆమెను బల్లమీద పడుకోబెట్టి పరీక్షచేసి చూసాడు జబ్బేమీలేదని తెలుసు' ఆ మాటంటే నువ్వేం డాక్టరువయ్యా' నా జబ్బు కనుక్కోలేక పోయావు" అని అంటుంది'

చూడమ్మా' నీకు నరాల బలహీనతవల్ల యిలా బాధలు కలుగుతున్నాయి కొన్నాళ్లపాటు దేశం నాలుగు మూలలు తిరిగిరండి క్రమంగా బాధలు తగ్గవచ్చు అన్నాడు రవి

చూసావా డాక్టరుగారేమంటున్నారో? ఎన్ని బాధలున్నా ఇంట్లోనే పడేసి చంపుతున్నావు? పెళ్లయ్యాక నన్ను కాశ్మీరమో కన్యాకుమారో తీసుకెళ్తాం అని అనుకున్నావా" మనకేం తక్కువయిందని" పిల్లాపాపలేరు కట్టుకు పోయినంత ఆస్తి వుంది డాక్టరుగారి సలహా ప్రకారం చెద్దాం' పద' ఇంకా చూస్తూ నిలబడ్డావేం అంటూ బయల్దేరింది వరం డాక్టరు రవికి నమస్కరించి పెంపుడుకుక్కలా భార్యవెంట బయల్దేరి వెళ్లాడు వరం భర్త!

అమ్మయ్య' గాలివానవచ్చి వెలసినట్లయింది' పాపం మానవుడు ఇన్ని బాధలు పడే పెళ్లాంతో ఎలా కాపురం చేస్తున్నాడో అనుకుంటుంటే అప్రయత్నంగా నవ్వువచ్చింది డాక్టరు రవికి

ఏం రవీ' నీలో నువ్వే నవ్వుకుంటున్నావు' అలా నవ్వుకోవడం ఆరోగ్య లక్షణం కాదుసుమా' అంటూ వచ్చింది మంజు

నవ్వక ఏం చేయమంటావు" అంటూ వరం సంగతి చెప్పుకొచ్చాడు రవి

రవీ' నువ్వయితే అలా ఓర్పుగా ఆమె కంప్లెయింట్సు విన్నావేమోగాని నేనయితే వెంటనే 'అమ్మా నీ వ్యాధికి సరయిన వైద్యం జరిగే చోటు ఇది అని వాల్తేరు మెంటల్ హాస్పిటల్ ఎడ్రసు యిచ్చేదాన్ని

అమ్మయ్యో' ఇంకేమయినా వుందా' తిట్లవర్షం కురిపించి వుండేది'

తిట్ల వర్షం కురిపించినా ఇక జన్మలో నీవద్దకు వచ్చేదిగాదు' నీకు చాలా పెద్ద తలనొప్పి తగ్గివుండేది

ఆ మాట మాత్రం నిజం మంజూ' ఇలాంటి కేసుల్ని పక్క డాక్టరుగారి దగ్గరకు పంపితే మనశ్శాంతి దక్కుతుందని మన సైకియాట్రీ ప్రొఫెసరుగారనేవారు గుర్తుందా"

అవును' వరంకూడా ఆ బాపతుకేసే' అంది మంజు

కాఫీ టిఫిన్ కానిచ్చి నర్సింగ్‌హోమ్‌కు బయల్దేరారిద్దరూ సావిత్రమ్మగారు వాకిలిదాకావచ్చి మంజూ' రాత్రికి భోజనానికి మా ఇంటికి రావాలి' మర్చిపోకేం'

అలాగే ఇందుని కూడా తీసుకురండి' మూడ్రోజుల నుండి బిడ్డ ఆస్పత్రిలో వుండిపోయింది పాపం ఎంత డస్సిపోయిందో"

ఇందు మంజు ఎంతల్లి కూతురని తెలియగానే ఆమెకు ఇందు మీద అబిమానం ఎక్కువయింది'

ఎలాగండీ' అమ్మ ఇందూని మా యింటికి తీసుకు రమ్మని మరి మరి చెప్పింది అంది మంజు

మీ యింటికి రేపు వుదయం వస్తుందిలే' ఈపూటకు మా యింటికి తీసుకురండి అని ఆమె అనగానే మాట్లాడకుండా వెళ్లిపోయారు మంజు, రవి

కన్సల్టింగ్ రూమ్ ముందు కూర్చున్న అవుట్‌పేషంట్సును చూడగానే బాప్‌రే' వాళ్లందరినీ చూసేసరికి తెల్లవారి పోదుగదా అంది మంజు రవితో

చూద్దాం' అంటూ కుర్చీలో కూర్చుని వొక్కొక్కర్ని పంపమని సరోజకు చెప్పాడు ఇన్‌పేషంట్లందరూ బాగున్నారని సరోజ చెప్పాక అతనికి మనసులో కొంత ధైర్యం వచ్చింది'

(ఇంకా ఉంది)

# వారఫలం

## 26–7–1985 శుక్రవారం మొదలు 1–8–1985 గురువారం వరకు

★ **మేషం.** గ్రహమండల మండలి మార్పులు మీకు అనుకూలమై సత్ఫలదాయకాలు కాగలవు నూతన వ్యాపారాలోచనలు, నూతన వ్యక్తుల పరిచయానికి అవకాశమివ్వగలవు దనలబ్ధికి, మంచి వ్యాపారం జరుగుటకు అనుకూలం స్త్రీలకు యత్న కార్యసిద్ధి, దనలబ్ధి నూతనోత్సాహం

★ **వృషభం** చాలమందికి దైవకార్యానుకూలత, దైవబల సాదన శుభకార్యాచరణ యోగ్యత ఉద్యోగ వృత్తులందు కలసి రావటం, శతృత్వం తగ్గి యుండటం, వారమంతా ఉత్సాహజనకంగా ఉండటం గ్రహింపగలుగుతారు స్త్రీలకు సుఖ శాంతులు మనోభీష్టసిద్ధి

★ **మిధునం** వ్యాపారరీత్యా మీరు చేయు ఆలోచనలు కలసి రాగలవు ఆనందదాయకంగా వారమంతా జరుగుట గమనింప గలుగుతారు ప్రత్యేకాంశం రాబడయందు పెంపు కనిపిస్తుంది నట గాయక కళాకులకు సదవకాశాలు లభ్యం కాగలవు ప్రతిబ వికసించుటకు అనుకూలం స్త్రీలకు కళాప్రయత్నం వృత్తియందు వికాసం

★ **కర్కాటకం** గ్రామంలోగాని, పట్నంలో గాని పేరు అభివృద్ధి నొందుట గమనింపగలరు రాజకీయవాదుల పరిచయం ఏర్పడుతుంది మీరు గ్రంథకర్తలైనా, పత్రికా నిర్వహణ బాధ్యత గలవారైనా, విలేఖరులైనా మీకు అభివృద్ధి చెప్పదగిన వారం స్త్రీలకు: ఉత్సాహజనకమై దనాదాయ యుతమై వారమంతా జరుగుతుంది

★ **సింహం.** ఇరుగు పొరుగు వారితోగాని, దాయాది వర్గంతోగాని, కొనివారితో గాని తగాదా లుండగలవు ఆదాయమందు స్వల్పంగా తగ్గుదల గమనింపగలుగుతారు. మీ స్థితియందు మెరుగు కనిపించకపోవటం గమనించి తీవ్ర కృషి ఆరంభించగలరు స్త్రీలకు కుటుంబమునకు అవసరమైన వస్తు సేకరణ, బంధువర్గీయులతో శుభ ప్రస్తావనలతో, తర్జనభర్జనలతో వారం గడుస్తుంది

★ **కన్య** మీరు సేకరించిన నల్లని వస్తువులకు' గిరాకి హెచ్చుతుంది మంచి వ్యాపారం చేయనున్నారు అయినా అత్యాశకు పోరాదు గదా! ప్రభుత్వాదాయం కూడా లబ్యం కావటం గమనింపదగిన అంశం వారమంతా ప్రోత్సాహజనకంగా ఉంటుంది సత్సాంగత్యం, కళాకులకు, గాయకులకు, కళారంగానుభవం గలవారికి అనుకూల కాలం పత్రికా విలేఖరులకు సదవకాశాలు లభ్యం కాగలవు స్త్రీలకు సత్కార్యాచరణము. సజ్జన సాంగత్యం, వృత్తియందు పెంపు

★ **తుల.** మున్ముందు దన రాబడికి, వ్యాపార వికాసానికి, ఉద్యోగ పెంపునకు తగిన చిహ్నముల గ్రహింపగల వారం శక్తివంచన లేక, వ్యాపార వృత్తులందు పాటుపడటం న్యాయం ప్రభుత్వ సంబంధం మీకుంటే జాగ్రత్తగా, ఆలోచనతో సంచరించుట ఎంతయినా అవసరం 'కృషితో నాస్తి దుర్భిక్షం' అని గ్రహింపగుల్గుతారు స్త్రీలకు: ఆదాయం, కార్యానుకూలం

★ **వృశ్చికం** శుభ కార్యానుకూల కాలం వ్యాపారరీత్యా ఉత్తమకాలం మిత్ర బృందం ఒకానొక విషయంలో మీకు సాయపడనున్నారు క్రితం జరుగని ఒకటి రెండు కార్యములందు మీకు అనుకూలత చేకూరగలదు ఇంట శుభ ప్రస్తావన లుండగలవు స్త్రీలకు ఉద్యోగరీత్యా మేలు, నూతన వస్తుసేకరణకు అనుకూల వారం

★ **ధనుస్సు:** ఉత్తమ మిత్రులు లభ్యం కావడంతో ఒకానొక వ్యవహారంలో మీకు అనుకూలత చేకూరుతుంది కొందరకు రాజకీయ రంగంలో ఏదో మేలు జరగనున్నది గమనించి సంచరించండి ఉన్నత విద్యయందు పెంపు చెప్పదగిన కాలం రచనయందు, పత్రికా నిర్వహణమందు కొందరకు మేలు చెప్పదగిన సమయం స్త్రీలకు ఉన్నత విద్యయందు పెంపు, వృత్తియందు వికాసం

★ **మకరం:** గృహ నిర్మాణ కార్యక్రమం సానుకూలం గావింపగలరు అధిక విద్యార్జనకు గావించే యత్నాలు ఫలింపగలవు ధనవంతుల ప్రాపకం లభ్యం కాగల అవకాశాలున్నాయి బిడ్డల కొరకు యత్నించిన ఉద్యోగ వ్యవహారాలు సానుకూలం కాగలవు విలువగల వస్తువులు సాదించుకోగలుగుతారు స్త్రీలకు యత్న కార్యసిద్ధి, సర్వత్రా అభివృద్ధి

★ **కుంభం:** రాజకీయంగా మీకు అనుకూలత చెప్పరాని సమయం సంఘానికి, రాజకీయ వ్యక్తులకు ఎంత దూరంగా ఉంటె అంత మంచిది అనుకొన్న విధంగా దనాదాయం, కార్యసాధన కలసిరాదు చిత్ర నిర్మాతలు, పత్రికా ప్రచురణ కర్తలు జాగరూకత వహించి మెలగటం మేలు స్త్రీలకు బంధువుల రాక, శుభకార్య ప్రస్తావనల కవకాశం

★ **మీనం:** మాటకు విలువ పెరుగుతుంది దానితో దనాదాయం కూడా పెరుగుతుంది నట గాయక చిత్రలేఖకులకు సదవకాశాలు లభ్యం కాగలవు కొందరకు నూతన వస్తువులతోపాటు వాహనం కూడా సంపాదించుకోగలుగుతారు కొందరకు అనుకూల ప్రయాణాలకు అవకాశమున్నది స్త్రీలకు వస్తు సేకరణ, ఉద్యోగరీత్యా 'ప్రమోషన్' లభ్యమగుటకు అవకాశం, సత్సాంగత్యం చెప్పదగిన ముఖ్యాంశాలు, గ్రహించండి

—విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

# వ్యక్తిగతం



ఇంతవరకూ సోవియట్ విదేశాంగమంత్రిగా ఉన్న శ్రీ ఆండ్రియ్ గ్రోమికోని జూలై 2 న సోవియట్ అధ్యక్షుడిగా సుప్రీమ్ సోవియట్ ఎన్నిక చేసింది. 75 సంవత్సరాల వయసు గల శ్రీ గ్రోమికో 28 సంవత్సరాలపాటు విదేశాంగ మంత్రిగా అనుభవం గడించారు మంచి రాజనీతిజ్ఞుడిగా అంతర్జాతీయంగా అందరి ప్రశంసలని అందుకున్నారు ఆయన సేవలని పార్టీ వర్గాలలో నివారు, ప్రజలు ఎంతగానో మెచ్చుకున్నారు ఈయన పేరుని సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ ప్రదాన కార్యదర్శి శ్రీ మిఖయిల్ గోర్బచెవ్ ప్రతిపాదించారు శ్రీ గ్రోమికో అధ్యక్షుడిగా ఎన్నిక కావడం రాజకీయ పరిశీలకులకి విస్మయాన్ని కలిగించింది 1977 తర్వాత 'క్రెమ్లిన్'కి నాయకత్వం రావడం అన్నది ఇదే మొదటిసారి పార్టీ అధినేతగా శ్రీ గోర్బచెవ్, దేశాధ్యక్షుడిగా శ్రీ గ్రోమికో, అధికార వ్యవస్థలో మూడవది అయిన మంత్రి మండలి అధినేతగా ప్రదానమంత్రి శ్రీ నికొలాయ్ టిఖనోవ్ బాధ్యతలని నిర్వహిస్తారు విశేషమైన అనుభవం ఉన్న శ్రీ గ్రోమికో దీక్ష దక్షతలతో తమ కొత్త బాధ్యతలని సమర్థవంతంగా నిర్వహించి జాతీయ, అంతర్జాతీయ రంగాలలో నెలకొని ఉన్న ఎన్నో సమస్యల పరిష్కారానికి తమ శక్తియుక్తులని వినియోగించ గలరని ఆశించవచ్చు ☐



గణితశాస్త్రంలో మేధావిగా పరిగణిస్తున్న శకుంతలాదేవిని హేతువాదులు కొందరు కాన్పూర్‌లో ప్రదర్శన ఇవ్వకుండా అడ్డుపడ్డారు ఆమె విడిది చేసిన హోటల్ వద్ద పెద్ద పోలీసు బందోబస్తు ఏర్పాటు చేయవలసి వచ్చింది శకుంతలాదేవి తనకున్న ప్రతిభని దుర్వినియోగ పరుస్తున్నారని పెద్ద-ఎత్తున మొత్తాలు పుచ్చుకుని జాతక చక్రాలు గీసి పెడుతున్నారనీ హేతువాదులు చెబుతున్నారు ఆ మొత్తాలను ఉపయోగించి ప్రజల కోసం గణితశాస్త్ర వికాస సంస్థ ని ఒక దానిని నెలకొల్పదలచినట్లు ఆమె అంటున్నా-హేతువాదులు శాస్త్రం పేరిట ఇలా దగా చేయడం సహించమని స్పష్టం చేస్తూ – శకుంతలాదేవి ప్రదర్శనకి తీవ్ర నిరసన తెలిపారు ఫలితంగా ఆ ప్రదర్శన రద్దు అయింది ☐

# చన్నీళ్ళ సముద్రంలో వేణ్ణీళ్ళ బొట్టు




కవనశర్మ

విశాఖపట్నపు ఆకాశాన్ని పొద్దు పొడిచింది చీకటిని చీల్చుకొని సముద్రపుటంచున బయటపడ్డ సూర్యకిరణం, ఎత్తైన ఇళ్లమధ్యన ఇరుక్కున్న సన్నని వీధుల్లో అడ్డంగా నిలబెట్టిన లారీల్ని నిలబడ్డ గేదెల్ని తప్పుకుంటూ ప్రయాణంచేసి అల్లీపురంలో అద్దెకుంటున్న కనకమహాలక్ష్మి కంట్లో పొడిచింది కనకమహాలక్ష్మి ఇంటి పనుల్లో పడటానికి అయిన ఆలస్యం గురించి కంగారుపడూ, పక్కమీదనుంచి లేచింది అల్లా లేస్తూ మంచం పక్కనే ఉన్న స్టూల్ని కాలితో అలవోకగా తన్నింది తన్ని తను కింద పడింది స్టూలుమీద నున్న పాన్ కాసేపు అటూ ఇటూ ఊగిసలాడి ఓ నిర్ణయం తీసుకొన్నదానిలా కనక మహాలక్ష్మిమీద పడింది తను పడూ స్టూల్నితో డెచ్చుకొంది

'ఎన్టీ రామారావుని మళ్లీ గవర్నర్ బర్తరఫ్ చేసెసాడా? ఊళ్లో కాలేజీ కుర్రాళ్లు అన్యాయాన్ని అరకట్టాలంటూ ఆలజడి మొదలు పెట్టారా? ఎవరైనా ఈ సందట్లో ఇంట్లో దూరి అన్నీ సవరిస్తున్నారా? అని నరసరాజు పక్క'మీద నుంచి లేవకుండా కళ్లు తెరవకుండా జనాంతికంగా ప్రశ్నలు కురిపించాడు అక్కడ బార్య ఉండి జవాబుచెప్తే సరేసరి, ఆమె అక్కడ లేకపోయి, ఎన్టీ రామారావుగాని, గవర్నరుగాని, కాలేజీ కుర్రాళ్ళుగాని, కనీసం ఇంట్లో దూరిన వాళ్ళు కాని అక్కడఉంటే జవాబు చెప్పాలన్న దోరణిలో

మీ తెలివి తెల్లారింది గాని లెండి అని కనక మహాలక్ష్మి విసుక్కొంది ప్రేమించి పెళ్లి చేసుకొన్న నరసరాజు దగ్గర ఒకటి రెండు మాటలనదగ్గ చనువు ఆపిల్ల పెళ్లి కాకముందే పొంది ఉంది

నరసరాజు, ప్రమాదం తనూహించిన దానికంటే భిన్నమైనదీ, సన్నిహితమైనదీ అని పెళ్లాం విసుగునుబట్టీ పోల్చుకొన్నాడు పోల్చుకొని ఒక్క ఉదుటున లేచి కూర్చుని పరిస్థితిని ఆకళింపు జేసుకొన్నాడు కనక మహాలక్ష్మిమీద నుంచి పాన్ని తప్పించి స్విచ్ ఆప్ చేసాడు. కనక మహాలక్ష్మి ఈసారి కోరి స్టూల్ని కాల్తో తన్ని దూరం చేసింది

'నువ్వు రోజూ రాత్రి గాలికెంత ఇబ్బంది పడుతున్నావో నిన్ననే నాకు చిలక్కి చెప్పినట్టు చెప్పావు నాకు నువ్వు గోలెడుతున్న విషయం అర్థమైందని నీతో చెప్పటం మర్చిపోయాను కామోసు! దాన్ని నువ్వపార్థం చెసుకొని నా కెల్లాగయినా అర్థమయ్యేలాగా చెప్పాలనుకొని, పాన్ డైరెక్టుగా నీవంటిమీద పెట్టుకొని పడుక్కొని, అంత దగ్గరగా ఉంటేగాని పాన్ గాలి తగల్దని సూచించడానికి పూనుకోవడం ఏం బాగా లేదు తాయారూ! అని తను నొచ్చుకొన్నట్టు అభినయిస్తూ అన్నాడు నరసరాజు

ఈ జానా బెత్తెడు కొంపలో మనకి, మన సామానుకె చోటు లేదని అందుకనే మీరు మరో రెండంగుళాల పెద్ద పాను కొనలేదని నాకు తెలియదా రాజుగారూ! పొద్దున్నే లేస్తూ ఇంకోరిదీ ఇంకోరిదీ ఎందుకు, పతిదేవుల మొహమే, మోహన రూపమే చూస్తూ లేస్తే పోలేదా అని మీకోసె చూస్తూ లేచి అడుగు వెయ్యబోతే అది మంచపు కోడుకి, స్టూలుకి మధ్య నున్న అడుగుజాగాలో పడక, పక్కనున్న స్టూలుకి తగిలి నేను ముందు, ఫాన్ తరువాత పడ్డంతో నేను దాని అడుగున పడ్డాను. అడుగున పడిన తెలుగు ఆడపడుచుని ఆ విదంగా ఆట పట్టించడం

ఛ చ అడుగున పడ్డ బార్యకి, ఈ బర్త చెయూత ఎప్పుడూ ఉంటుంది అంటూ నరసరాజు, కనక మహాలక్ష్మి కుడి చేతిని తన కుడి చేతిలోను, నడుమును ఎడం చేతిలోను పొదివి పట్టుకొని లెవదీశాడు లెవదీస్తూ, 'పైకిలే! పైకిలే! ఆంధ్ర మహిళా! అని రోజూ రేడియోలో వచ్చె తెలుగు పడతి భక్తిగీతం పాడాడు

ఇంతకంటే పెద్దబాగానికి మీ జీతంలో నోచుకోము కదా! అంది కనకమహాలక్ష్మి వ్యథను కంఠంలో పలికిస్తూ

విశాఖపట్నంలో అద్దె సర్వ దుస్టులు ఇంటి భ్రష్టసంపాతకులై ఉన్నదానికంటే చిన్నదాంట్లోకి అక్కడ నుంచి మరింత చిన్నదాంట్లోకి మారకుండా ఉండ గలగటమె ఇన్‌ఫవ్‌జెంట్స్ సంపాదించినంత బాగ్యం అని నరసరాజు అనునయించబోయాడు

నేనుకూడా సంపాదిస్తానంటే వినరుకదా! పెద్ద ఇంట్లోకి పోగలం దాపురించనివారు బార్యమాట వినరని కదా పెద్ద నాయకమ్మగారు మెత్తు

కుంటారు' అని సణుక్కొంది కనక మహాలక్ష్మి

2

మళ్ళీ నాకోసం తపించి పెళ్ళాడానంటారు కనక మహాలక్ష్మి ఆ మాటలు తనకి నమ్మశక్యం కానట్టు ఉంది

తపించడమా! ఒంటి కాలుమీద తపస్సు చేసాను కావాలంటే మా పక్కింటి గుంట నర్సమ్మ నీ స్నేహితురాలేకదా! అడుగు చెప్తుంది'

ఆ చెప్పింది, 'కనకా లొసే! ఆ గుంటడెప్పుడూ ఈ మధ్య వంటి కాలు మీద నిలబడి అగుపిస్తున్నాడు రెండో కాల్నిగాని మనూరి సిటీ బస్సు మట్టేసిందిగాని ఏమో! అని ఆ రోజుల్లో అందుకేకదా నేను తమ నడతమీదో కన్నేసి ఉంచానా రోజుల్లో!

అదా కథా! నా డియరెస్టు ఫ్రెండు మీ వీధి అపల్నరసింహం, 'నరస రాజొలేదు! నీ లవ్వు రెండో కన్నోసారి కె జి హెచ్‌లో చూపించుగ్గాని పెళ్ళాడకురా!' అని సలహా పారేసాడు

'మీ తెలివి తెల్లారింది మీ ఫ్రెండు తెలివి తెల్లారింది సంతోషించాం

తెల్లారిందా! మర్చెప్పవేం! అయితే కాఫీ తొందరగిచ్చెయ్

కనకమహాలక్ష్మి, అతనికి కాఫీ గ్లాసందించింది అందించి మురిపెంగా చూసింది నేనుకూడా ఏదైనా ఉద్యోగం చేస్తాను డబ్బు సంపాదించి మీకు సాయం చేస్తాను చన్నీళ్ళకి కాస్త వేణ్ణీళ్ళు సాయం అంది

తప్పుసామెత అందామనుకొన్నాడు కాఫీ గుటక పడక మాటలు బయటికి రాలేదు

ప్రేమించి పెళ్ళాడినవాళ్ళు పెళ్ళాం మాటలు నెత్తినెట్టుకోవాలి! అంతేకాని గొంతుకలో పెట్టు కొని గుటకవెయ్యకపోడానికి అవేం కాలకూట విష ప్రాయాలా! నాకు పెద్దింట్లో ఉండాలని, మొగుడికి కాఫీ గ్లాసులో కాక కప్పులో ఇవ్వాలని, పనిమనిషిని పెట్టుకోవాలని, గుండుగాడ్ని మంచి స్కూల్లో చదివించాలని ఏవో ఇలాంటివే కొద్ది చిన్న కోరికలున్నాయి అవి తీరే ఉపాయం చూడండి

నరసరాజు ఆలోచనలో పడ్డాడు

బార్యా భర్తలన్నాక పాలునీళ్ళులాగా, ఇసుక సిమెంటుల్లాగా, వేణ్ణీళ్ళూ, చన్నీళ్ళలాగా, వాళ్ల అభిప్రాయాలు కలిసిపోవాలి కదా!'

నరసరాజు అతి కష్టంమీద కాఫీ మింగి, అవును బి జె పి, జనతావాళ్ల అభిప్రాయాల్లాగా కలిసిపోకుండా ఉండరాదు అని ఒప్పుకొని, అందుకని నేను చెప్పినట్టు నువ్వు ఉద్యోగం చెయ్యకుండా ఉండటానికి ఒప్పుకో! అని సూచించాడు

మీ మాట ఎప్పుడూ వింటూనే ఉంటాను కదా! వెరైటీకీ సారి, మీరు నా మాటవిని, ఒప్పుకోండి ఇద్దరు ఏకాభిప్రాయానికి రావాలన్న విషయంలో ఏకాభిప్రాయానికి వచ్చారు ఆ ఏకాబిప్రాయం ఏదన్న విషయంలో బేదాబిప్రాయపడ్డారు

నిన్ను వీదిలోకి పంపనా! ఆడదీరోజుల్లో వీదిలోకి వెళ్లటం ఎంత ప్రమాదం! క్షేమంగా ఇంటికిరాదు తిరిగి

అన్న అదికారంలోకి వచ్చాక ఆడపడుచులు అర్ధరాత్రికూడా రోడ్లమీద క్షేమంగా తిర గల్గుతున్నారు కదా!

క్షేమంగా తిరగ గల్గటం మంచిదె అయినా అన్న అదికారంలోకి వచ్చాడుకదా అని ఆడవాళ్లిల్లా అర్ధరాత్రిపూట రోడ్లమీద తిరగటం నాకు నచ్చదు అయినా అన్నెప్పుడూ అదికారంలోనే ఉంటాడని ఏముంది! ఏ తమ్ముడో ఎప్పుడో ఎసరు పెట్టిస్తాడు కదా! అందుకని నేను చెప్తున్న దేమిటంటే నువ్వు వదిలోక వెళ్ళవద్దు నేనే మరింత సంపాదించి నిన్ను సుఖపెడ్తాను ఆ మార్గాలు నేను అన్వేషిస్తాను కనకం! కనకాన్ని అన్వేషిస్తాను అని నరసరాజు కాఫీగ్లాసు పుచ్చుకొని అక్కడ్నుంచి పోయాడు బార్యకు చర్చను పొడిగించె అవకాశం లేకుండా

నరసరాజు ఊళ్లో ఏకారు కెళ్లాడు అయిడి యాలకోసం ఏదైనా కొట్లో పద్దులురాస్తే సాయంత్రాలు? పోనీ సినిమాహాల్లో గేట్లు కాస్తే? చ అయిడియాలు బాగాలేవు పోనీ రిక్షా తొక్కితే? బావుంది అది స్వతంత్ర జీవనం! గొప్ప సినిమా టిక్‌గా ఉంటుంది బర్త సుఖంకోసం సినీ కష్టాలుపడ్డ పతివ్రతల పేర్లలాగా తన పేరు అజరామరంగా నిలుస్తుంది ముందు తరాలవారు షాజహాన్ బార్యకోసం తాజమహల్ కట్టించాడు కాని సైకల్‌రిక్షా తొక్కలేదు కదా! నరసరాజె షాజహాన్ చక్రవర్తికంటె గొప్పవాడు అని చెప్పుకొంటారు ఏకారు పూర్తి చెసుకొనివచ్చి కనకమహాలక్ష్మికి తను డబ్బు సంపాదించబోయె మార్గం చెప్పేసాడు

కనకమహాలక్ష్మి కన్నీరు పెట్టుకొంది తనకల కంఠంతో, నాకు పెద్ద ఇల్లంటె అసహ్యం ఉన్న పాన్ అమ్మేద్దాం మీరు సైకల్‌రిక్షా తొక్కలేరు తొక్క వద్దు అని బతిమాలుకొంది తనమాట వినమంటూ

ఎన్టీఆర్, ఎమ్జిఆర్ ఏఎన్నార్‌లు రిక్షా ల్లాగగా లేంది నేను తొక్కలేనా! నీ మాట నే వినను సుబ్బులూ! వినను నాకాకీర్తి కావలసిందే?

నరసరాజు మాట నిలబెట్టుకొన్నాడు ఒక ఆదివారం సైకిల్‌రిక్షా అద్దెకి తీసుకొని తొక్కాడు స్నేహితులు నవ్విపోయారు నాకెటి సిగ్గు అని అతను పట్టించుకోలేదు ఆ సాయంత్రానికి అగ్గె పోనూ మిగిలిన నాలుగు రూపాయలు పెళ్ళాం దోసిట్లో పోసాడు

ఆ మర్నాడు వళ్ళు పులిసిపోతె సినిమాల్లో హీరోలు అవ్వల్లో రిక్షా తొక్కేసిన్లలో డూపుల్ని పెట్టుకొంటారని నువ్వెందుకు నాకు గుర్తు చెయ్యలేదు అంటూ బార్యను మంచంమీద నుంచి చెడామడా కెకలు వెసాడు

ఆ పైన మూడు రోజులు కాజువల్ లీవ్‌పెట్టి రెస్టు తీసుకొన్నాడు

గుండు ఈ రోజు బడెగ్గొట్టాడా?

గుండు స్కూల్ నుంచి రాగానే పుస్తకాలు వీది గుమ్మం దగ్గర పారేసి, చెప్పులు వంటింటి దగ్గర విడుస్తాడు అవికనక మహాలక్ష్మి ఆ తరువాతెప్పుడో వాటిస్థానాల్లో పెడుతుంది నరసరాజు ఆఫీసునుంచి వచ్చేసరికి పుస్తకాలు వీధి గుమ్మం దగ్గర ఎదురవ్వాలి మామూలుగా అయితే ఆ రోజు అవలేదు అందుకని అడిగాడు

అవును కనకమహాలక్ష్మి ముభావంగా జవా బిచ్చింది

ఎందుకుట?

నాకేం తెలుసు! వాడ్నే అడగండి

గుండూ!' గుండు వచ్చాడు

ఏరా స్కూల్లేదా?

నేను వెళ్లను అన్నాడు గుండు, స్కూలు

ఉండటానికి లేకపోవడానికి తను వెళ్ళక పోడానికి ఏమీ సంబంధం లేదన్న విషయం స్పష్టం చేస్తూ

ఎందుకు వెళ్ళవురా?

మా మేష్టారు దొంగ నంజికొడుకు నన్ను కొట్టాడు

ఏమిట్రా ఆ బాష! నరసరాజు కొడుకు భాషకి షాక్‌తిన్నాడు

మీ పుత్ర రత్నం ఆ దుంపల బళ్ళో అంతకంటే ఏం నేర్చేసుకోవాలని కోరుకుని వాడిని పంపుతున్నారో ఆ స్కూలుకి

నువ్వు మరీని కనకాలు! అన్న, మధ్యాహ్నభోజన పథకం అమలులో పెట్టాక దుంపల బళ్ళెక్కడున్నాయి అన్నీ అన్న పారశాలలై పోయాయి కదా! అన్నం పెట్టే బళ్ళు దుంపలిచ్చే బళ్ళకంటే గొప్పవికదా! అందుచేత మనవాడికి అస్మదీయులెవరో, దొంగ నంజికొడుకులెవరో తెలుసుకో గల్గటానికి మించిన చదువు అక్కడ చెప్పాలని ఆశించటంలో తప్పులేదు కదా!

బళ్ళల్లో స్టాండర్డు,, పెట్టే తిండిబట్టీ మార్తుందని తమరన్నారు నేను విన్నాను

అన్యాయం అమ్మాడీ! నువ్వేకదా దుంపలబడీ అంటూ వాడిస్కూలిలిని ఈసడించి పారేసావు వాళ్ళు దుంపలు ఇంకా ఇస్తున్నారన్న అభిప్రాయంలో ఉన్నావని కరెక్టు చేశాను

'దుంపలు పెట్టడం మానేసినా పెడుతున్నది అన్నం కాదుకదా ఆ పథకంలో'

మీ స్కూల్లో ఏం పెడ్తార్రా గుండూ! నరసరాజు ఇన్నాళ్ళకి అవసరంకల్గి తెలుసుకో గోరాడు ఏం పెడుతున్నారో తెలుసుకోకుండా భార్యతో వాదించ దలుచుకోలేదు

మా స్కూల్లో ఏం పెడ్తారో నాకేం తెల్సు! నేను చూడకముందే నంజికొడుకులందురు మీదపడి లాక్కుంటారు కదా!

నరసరాజు గుండు, గుండు మీద టింకిజెల్లో పుచ్చుకున్నాడు

మర్నాడు అతను కొడుకు స్కూలుకి వెళ్ళాడు, కొడుకు స్కూల్లో నేర్చుకొన్న నాలుగు ముక్కల్లోను ఒకటి నంజికొడుకైనందుకు సంతోషించలేక మేష్టార్తో తనకొడుకు 'నంజికొడుకు' పదం వాడుతున్నట్టు అది తనకి నచ్చలేదన్నట్టు చెప్పాడు

'నాకూ నచ్చదండి స్కూల్నిండా అలాగా గుంటల్ళు ఓ ర్లంజకొడుకుల్లారా! నంజి కొడుకనరాదర్రా అంటూ మొత్తుకొంటూనే ఉంటాను వినరు" అన్నాడా పంతులు అతను ల,న లకి అభేదం అన్న సూత్రం తెలుగులో లేదని గుంటల్ళకి చాలాసార్లు చెప్పాడు వాళ్ళు, నేదా! అంటూ ఆశ్చర్యపోయారు అన్నిసార్లు పంతులు తన బాధ వెళ్ళబోసుకున్నాడు నరసరాజుకి అసలు సమస్య అర్ధమైంది

మర్నాడే గుండుని, నెలకి యాభై రూపాయల జీతం పుచ్చుకొనే స్కూల్లో జేర్పాడు అప్పుచేసి

# చన్నీళ్ల సముద్రంలో వేణ్ణీళ్ల బొట్టు.

చేసిన అప్పు వాయిదాలమీద తీర్చటం మొదలవగానే పొద్దున్న కాఫీ అరగ్లాసుకి పడిపోయింది ఆఫీసుకి వెళ్ళేటప్పుడు మాత్రం బస్సులో వెళ్ళి తిరిగి రావటం నడిచి నెమ్మదిగా వస్తున్నాడు

కనకమహాలక్ష్మి వానపడుతున్న ఓ రోజున స్నానానికి చన్నీళ్ళు పెట్టింది

వేన్నీళ్ళంటే బావుండును అన్నాడు నరసరాజు

చన్నీళ్ళలో కొద్దే అయినా వేన్నీళ్ళు పొయ్యగలిగితే ఎందుకు బావుండదు అంది కనకమహాలక్ష్మి భావగర్భితంగా

ఆ ముచ్చటా తీర్చుకో నరసరాజు తెల్లబెండా ఊపాడు

కనకమహాలక్ష్మి ఉద్యోగం చెయ్యాలని నిశ్చయించుకొంది కాని ఆ మహాపట్నంలో తన అర్హతలకి ఏం ఉద్యోగం వస్తుందో ఆమెకి తెలియలేదు ఎన్నో ఆఫీసుల అరుగు లెక్కింది కాయితాలు ఖరాబు అయ్యాయి చెప్పులరిగాయి ప్రయోజనం కనిపించలేదు ఒక రోజు పక్కింటి నుంచి అరువుతెచ్చి చదువుతున్న దినపత్రికలో ఓ ప్రకటన ఆ ఉద్యోగార్ధిని కళ్ళబడింది అది ఇల్లా ఉంది

గోళ్ళు గిల్లుకోనక్కర్లేదు!

మీ భర్తలు ఆఫీసుల్లోను పిల్లలు స్కూళ్ళల్లోను, బిజిగా ఉన్న సమయంలో మీరు గోళ్ళు గిల్లుకుంటూ ఇంట్లో కూర్చోవాల్సిన అవసరం మీకిక లేదు మా నమ్మకమైన ఎరువులు, తెగుళ్ళ మందులువాడి పెరట్లో పూల మొక్కలు పెంచండి మీరు కొన దలచుకోక పోయినా, మీకు తెలిసిన వారికి (తెలియని వారికి కూడా!) వాటిని మీరు అమ్మగలమని నమ్మినా చాలు వచ్చి మాతో సంప్రదించండి మంచితనం చిందించే అందం, ఇంటింటికివెళ్ళి అమ్మగలిగే ఓర్పు, దానికి కావలసిన ఆరోగ్యం మీకుంటే అమ్మకాల అమ్మాయి ఉద్యోగం మీదే!

అప్పారావు, బాగస్వాములు

ఓర్పు ఆరోగ్యం తనకన్నట్టు కనకమహాలక్ష్మికి తెలుసు

నువ్వెంత మంచిదానివె అంటుందామె స్నేహితురాలు నర్సమ్మ ఎప్పుడూ

అందాలు చిందించె అంగనామణీ! నా బార్యామణీ అని మెచ్చుకొంటాడు భర్త ఎప్పుడైన మూడ్‌లో ఉన్న మల్లెలవేళ

సాయంత్రం భర్తకు ఆ ప్రకటన చూపించింది ప్రయత్నించి చూడు మొక్కల చీడలు వదిలినా వదలక పోయినా, దీంతో మనింట్లో గోల వదుల్తుంది అంతకే మురిసి పోయింది కనకమహాలక్ష్మి

ఆ రాత్రి ఎప్పుడు తెల్లార్తుందా అని ఆత్రంగా ఎదురుచూస్తూ ఆత్రంగా గడిపింది పొద్దున్నే ఫాన్‌ని ఉంచిన స్టూల్ని తన్ని, తను కిందపడ్డా ఆ దోసెడు కొంపని విసుక్కోలేదు ఆ యింట్లో ఇంక తనుండ బోయేది కొద్ది రోజులే కదా! దాన్ని విసుక్కొని దాన్ని, భర్తని చిన్నబుచ్చకూడదు! నిజానికది చిన్నదే కాని తనని ఇన్ని సంవత్సరాల పాటు కడుపులో పెట్టుకుని ఆదుకొంది ఇప్పుడు తన తాహతు పెరగబోతోందికదా అని చిన్న చూపు చూస్తే పాపం చిన్నది బాధపడుతుంది, అని కనకమహాలక్ష్మి బొలెడు సెంటిమెంటల్‌గా ఆలోచించింది

తొమ్మిది గంటలకు అందంగా తయారై, భుజానికి సంచీ తగుల్చుకొని, గుండూ! రా! నీతో నీ స్కూలుదాకావస్తాను అంది

అమ్మా! ఆ జోలెందుకూ? అనడిగాడు గుండు

ఉద్యోగం ఇస్తే వాళ్ళిచ్చిన సరుకులు వేసుకోవద్దూ! అని శాంతంగా జవాబు చెప్పింది కొడుకు తన సంచిని జోలె అన్నందుకు్ళ కొంకించుక బాధపడినా

ఇవ్వకపోతే గుండు కీడెంచాడు, అమ్మేల్లాగూ మేలెంచింది కదా అని

ఏదో అల్లా కాలక్షేపంగా నాలుగు వీధులు తిరిగితేసరి, జోలెనిండకపోదు నరసరాజు చివరి బాణం వేసి చూసాడు

నేను ముష్టిదాన్లా కన్పిస్తున్నానా! అని కనక మహాలక్ష్మి ముక్కెగ చీల్చింది

వెర్రి వెంకమ్మా! ముష్టెత్తడాన్ని అల్లా తీసి పారెయ్యకు ఉద్యోగాన్ని అర్ధించడం ఏమిటి? ముష్టెత్తడమే కదా! అభ్యర్ధి అంటే ముష్టివాడు అని అర్ధం ఐ బెగ్ టు సబ్మిట్ మై అప్లికేషన్‌తో ముష్టి మొదలై, ఐ బెగ్ యు టూ గ్రాంట్ మీ టూ డేస్ కాజువల్ లీవ్ అంటూ కొనసాగి, ఐ బెగ్ యు టూ నాట్ టు రిటైర్ మి ఎట్ ఫిఫ్టీ ఫైవ్ అంటూ ముగుస్తుంది అందుకని చింతించకు పోయిరా!

సిగిరెట్ ముట్టించుకోడానికి వెలిగించిన అగ్గిపుల్లతో హారతిచ్చి బార్యని దీవించి పంపాడు

అప్పారావు ఎసోసియేట్స్‌లో అప్పారావు ఒకడే కూర్చుని ఉన్నాడు అతను కనక మహాలక్ష్మిని చూసి ఉద్యోగం ఇస్తానన్నాడు అయితే దానికి జీతం అంటూ ఉండదు అమ్మిన దానిమీద పది శాతం కమీషన్ మాత్రం ఉంటుంది మీరు సరుకెంత బేగమ్మేస్తే మీ కంత లాభం అని ప్రోత్సహించాడు కనక మహాలక్ష్మి ఉత్సాహంగా రంగంలోకి ఉరికింది

ఏమండీ! మీ ఇంట్లో పూల మొక్కలున్నాయా?

ఏం? నువ్వు పీక్కుపోతావా?

మీ మొక్కలకి తెగుళ్ళు పట్టకుండా

# పెరిగే పిల్లలకి కావాలి కాంప్లాన్

## కేవలం కాంప్లాన్ లోనే వాళ్ళకు ప్రతి రోజూ అవసరమయ్యే 23 కీలక ఆహార పదార్థాలున్నాయి.

పిల్లల పెరుగుదల సామాన్యంగా వాళ్ళకి 15, 16 ఏళ్ళొచ్చేసరికి రమారమి పూర్తవుతుంది.

ప్రోటీన్లు, పెరుగుదలకు నేరుగా తోడ్పడే పోషక పదార్థాలు. అందుకే, మీ పిల్లలకు అవసరం, కాంప్లాన్—యిప్పుడు. కాంప్లాన్‌లో అత్యుత్తమమైన ప్రోటీన్లు-పాల ప్రోటీన్లు (20%) ఉన్నాయి. దాంతోబాటే దాన్లో 22 యితర కీలక అహారపదార్థాలు ఉన్నాయి.

కాంప్లాన్ రుచికరమైన సువాసనల్లో దొరుకుతుంది.




**23**

**కీలక ఆహార పదార్థాలు ఆరోగ్యబద్ధమైన పాళ్ళలో**

| | |
|---|---|
| ప్రొటీన్ | రిబొఫ్లావిన్ |
| కొవ్వు పదార్థాలు | నికోటినమైడ్ |
| కార్బోహైడ్రేట్ | కాల్షియమ్ |
| కేల్షియమ్ | పాంటొథెనేట్ |
| ఫాస్ఫరస్ | కోలిన్ |
| సోడియం, క్లోరైడ్ | పైరిడాక్సిన్ (బి6) |
| (సిఎల్ రూపంలో) | విటమిన్ బి12 |
| పొటాషియమ్ | ఫోలిక్ ఏసిడ్ |
| ఐరన్ | విటమిన్ సి |
| అయోడిన్ | విటమిన్ డి |
| విటమిన్ ఎ | విటమిన్ ఇ |
| విటమిన్ బి1 | విటమిన్ కె |

పాలు కలపనవసరం లేదు.



**కాంప్లాన్®** – సంపూర్ణంగా ఆరోగ్యబద్ధమైన ఆహారం

B84 GLC 120 Tg

[illegible]
[illegible] పాత వాలు

రెండ్రోజులు కాళ్లరిగేలాగా తిరిగినా ఫలితం లేకపోవటంతో మూడో రోజు వ్యూహం మార్చేసింది

ఎన్నిగారూ! మీ పెరడు కళకళ్లాడ్తోంది మీకు మొక్కలంటే చాలా ఇష్టం అని మీరు చెప్పకుండానే తెలుస్తోంది నన్నడిగితే అహఁ నన్ను అడగక పోయినా సరే మీ తోటలో ఒక మల్లె మొక్క లేకపోవటం ఒకటే లోటు అది వేసి చూడండి ఈ జిల్లాలో నే మీ తోటకి పోటీ ఉండదు మల్లె అంటు పక్క వీదిలో నాకు తెలిసిన వాళ్లింటినుంచి తెచ్చి పెడ్తాను అయితే అది ఏపుగా పెరగటానికి దానికి చీడలు పట్టకుండా ఉండటానికి ఎరువులు మందులు కొంచెం కొనుక్కోండి అవ్వే ఎంతో అవ[illegible]డీ మహా అయితే పది రూపాయలు నెల నెల వచి[illegible]వలసినవి ఇచ్చిపోతూ ఉంటాను మీ కే శ్రమ [illegible]డదు అని ఒకర్ని ఉబ్బేసింది

ఈ చీర ఎక్కడ కొన్నారూ? ఇక్కడే దొరుకుతుందా! ఎంత కొనుక్కొన్నారూ? అమ్మ బాబోయ్ **అంత** చవకగానే! నాకు కొనుక్కోవాలని ఉంది కాని ఎల్లా? నా దగ్గర డబ్బు లేదే! సరకులు అమ్మాలి కమిషన్ రావాలి? ఇంట్లో ఖర్చులు గడపాలి? ఇంకా అప్పుడు డబ్బు మిగిల్తే చూడాలి!మీరు పెద్ద మనసుతో ఓ పాతిక రూపాయల సరుకులెల్లాగో కొంటారనుకోండి కాని మీలాంటి వారు అరుదుకదా! అంటూ మరొకర్ని కరగేసింది

కంకటాలవారి షాపులో రిబేటుంది ఇంకో రెండు రోజుల్దాకా వేగిరం వెళ్లండి

జ్యోతి హాల్లో జయసుధ సినిమా ఆడ్తోంది

ఫలానా ఎంపోరియంలో విస్కీ గిస్కీ అమ్ముతారు ఫలానా క్లబ్బులో డబ్బెట్టి పేకాడ్తారు పొర పాట్న కూడా మీ శ్రీవారిని అటుకేసి వెళ్లనీయకు చెల్లీ!

కావలసిన వారికి కావలసిన బోగట్టా ఇచ్చింది నానా తిప్పలు పడింది మొదటి నెల రెండు వందల యాభై సంపాదించింది

నీ సంపాదన రెండు వందల యాభై నువ్వు కొత్తగా పెట్టుకొన్న పనిమనిషి సింహాచలానికి నువ్విచ్చే జీతం పాతిక పెరిగిన చాకలి ఖర్చు పాతిక నీ బస్సు ఛార్జీలు, అయిసు సోడాలు, కాఫీ, టీ ఖర్చులు యాభై ఎరువులు కొనిపించబోయి కొనుక్కున్న చీర, అవసరమై కొనుక్కొన్న చెప్పులు ఎనభై వెరసి రెండు వందలు మిగులు యాభై నరసరాజు ఆ నెల లెక్కలు కనక మహాలక్ష్మికి వివ రించాడు

వచ్చే నెల చీర ఖర్చు చెప్పుల ఖర్చు ఉండదు కదా! గుండు చదువుకి యాభై ఇవ్వగలి గానుకదా! కొంచెం చలి తీరిందికదా! వచ్చే నెల మరిన్ని వేణ్ణీళ్ళు పోసి చూడండి!

6

ఏం సింహాచలం! నిన్న పన్లోకి రాలేదేం!

# చన్నీళ్ల సముద్రంలో వేణ్ణీళ్ల బొట్టు

రానేదు!

అదేం జవాబు?

ఏటమ్మా! నానొచ్చానక అబద్ధమాడే నేటమ్మా! నువ్వు' దెబ్బలాడి దానికి సత్తె మొప్పేసు కొన్నానుకదా!

ఎందుకు రానేదు? చ నాక్కూడా అలవాటై పోతోంది నీ. నా ఎందుకు రాలేదని అడుగుతున్నాను క్రితం రోజు వీదిలో తిప్పటతో పాటు ఇంట్లో పని కూడా చేసుకోడంవల్ల జనించిన కోపాన్ని బిగించేస్తూ అడిగింది కనక మహాలక్ష్మి

తల్లీ! ఈదిలో నిలబడిపోయి నీతో తీరుబడిగా ఊసులాడుకోడానికి టయాం నేదు అయిదింటల పనిసెయ్యాల నాను నీపనైపోతుందని పారొచ్చి నాను అంట్లు బెగి పడీ తల్లీ! బేగితో మీసి పోతాను అంది సింహాచలం పనిపట్ల తనకుగల శ్రద్ధను వ్యక్తం చేస్తూ తన నిల్లా వీదిలో నిలబెట్టి కనక మహాలక్ష్మి కబుర్లాడటం ఎదురిం టామె, పక్కింటామెల పని దృష్టి చెస్తున్న సంప్రదాయ విద్రోహచర్య అన్న విషయం సింహాచలం **అతి** వినయంగా కనక మహాలక్ష్మి దృష్టికి తీసుకువచ్చింది సింహాచలం

కనక మహాలక్ష్మి ఓడిపోయి లోపలికి నడిచి అంట్లు వేసింది

నా గుండీ లివరు కుట్టారోచ్ నరసరాజు **ఆ** చాన్సుపోతే దొరకదన్న దోరణిలో అడిగాడు

అమ్మ అన్నాడు గుండు

అన్నం తినడం ఎవరెవరు మానేస్తారోచ్! అంది వంట చేస్తున్న గుండు తల్లి ఎవరు చెతు లెత్తలేదు

గుండుచేత కుట్టించుకోండి వాడికి వచ్చును అంది కనక మహాలక్ష్మి

నేను కుట్టను నేను నా హోమ్ వర్కు చెసు కొంటున్నాను చెసి స్కూలుకి తీసుకోకపోతే బ్లడీ బగ్గర్సు తంతారు నన్ను ఇది నీ హోమ్ వర్కు

## ప్రవృత్తి

గమ్మత్తైన ప్రకృతి శక్తుల్ని
వశం చేసుకోవాలనే ప్రయత్నంలో
కొంతవరకు కృత కృత్యులౌతున్న
కొందరిది ఆటమిక్ విజ్ఞాన ప్రవృత్తి
ప్రకృతి మత్తులో పడి ఉన్మత్తులై
ప్రవర్తిస్తున్న
కొందరిది ఆటవిక ప్రవృత్తి!

—ఎన్.వి ఆర్ సత్యనారాయణమూర్తి

నువ్వే చెయ్యి! అని గుండు [illegible] వీలవదని చెప్పాడు కనక మహాలక్ష్మి కొడుకు చెయ్యనందుకు బాదపడలేదు మేష్టర్లని బ్లడీ బగ్గర్సని కొడుకు తిట్టినందుకు సంతోషించింది లేక దొంగ నంజి కొడుకులని తిట్టనందుకు సంతోషించింది తన శ్రమ వృదా పోనట్టు కొడుకు ఇడ్లీ కొబ్బరి పచ్చడి చెయ్యమని అడగకుండా, రైస్ పుడ్డింగ్ అండ్ కోకోనట్ సాస్ చెయ్యమని కోరిన రోజునే గ్రహించింది

అన్నట్టు మా ఆఫీసులో తణుకు నుంచి వచ్చి చేరిందే తరళాక్షి, ఆ పిల్లకి నా గుండీలు కుట్టడం అంటె బోలెడు ముచ్చట కుట్టించుకోనా? నరసరాజు అమాయకంగా అడిగాడు

తప్పేముంది కుట్టించుకోండి! రేపెప్పుడైనా నేను మా బాస్ అప్పారావుగారికి గుండీ కుట్టాల్సివస్తే కుట్టడానికి సంకోచపడక్కర్లేదు నేను ధైర్యంగా కుట్టేస్తాను మీరూ ఏమీ అనుకోరు

నరసరాజు **ఉడికించబోయి**, వంటింట్లోని వంకాయలతో పాటు **ఉడికాడు**, చొక్కాకి బొత్తాలు కుట్టుకుంటూ

కొత్త బిచ్చగాడు పొద్దెరగక పోవచ్చుకాని పాత బిడ్డ అమ్మకాల అమ్మాయికి పెంచలేలే పోదు వాలదా! రెండునెలలు గడిచేసరికి కనక మహాలక్ష్మి మొదట్లో **అంత** **ఉత్సాహంగా** అమ్మకాలు చేయలేకపోతోంది కొనేవాళ్లల్లో కొందరు, నువ్వు కిందటిన్లో ఇచ్చివెళ్ళిన సరుకే ఖర్చవలేదు అమ్మాయీ అని విసుగ్గాను,

మరికొందరు కొళాయిలో మాకే నీళ్ళు రావటంలేదు మొక్కలకేం పొయ్యగలం వద్దండి అని నిస్పృహతోను,

మిగిలిన మొహమాటస్తులు, మరోసారి కనిపించండి అని నొచ్చుకొంటూను అంటున్నారు

కనక మహాలక్ష్మి కొనుగోలుదార్లకోసం సుదూర ప్రాంతాల్లో వలవెయాల్సి వస్తోంది దాంతో బస్సు చార్జీలు తడిసి మోపెడవుతున్నాయి ఇంత దురాచారాలవల్ల వేణ్ణీళ్లు చల్లబడిపోతున్నాయని చన్నీళ్లలో చన్నీళ్లు పోస్తే వెడెక్కవని, నీళ్లలో నీళ్లు పోస్తే రాములవారి కాలంలో నె కాక, కలికాలం కూడ పాలవవని నరసరాజు చెప్పకుండా కనక మహాలక్ష్మి గ్రహించగల్గింది

వానపడ్డ రోజులు, గుండుకి జ్వరం వచ్చిన రోజులు వీలవక అమ్మకానికి పోవటంలేదు నెల చివర్లో వెళ్లినా కొనే బార్యలు కనిపించక వెళ్లటం మానేస్తోంది ఆవిధంగా నెలకి పది రోజులు సంపాదన ఉండటంలేదు ఇంట్లో చూస్తే సింహాచలం అడపా తడపా నాగాలు పెట్టేస్తోంది అటువంటి రోజుల్లో ఇంటి పనితోను, వీదిలో తిరుగుడుతోను కనక మహాలక్ష్మి సతమతమై పోతోంది పని మనిషిని పని మానిపిస్తే అన్ని




రోజులు తనే చేసుకోవాల్సి వస్తుందన్న దారుణమైన సత్యం భయపెట్టడంవల్ల కనక మహాలక్ష్మి సర్దుకుపోతోంది

అప్పారావే కాకుండా అతని ఎసోసియేట్స్ అందరూ ఒకళ్లొకళ్ళుగా ఏటమ్మా' అమ్మకాలంత చేటు తగ్గించెసావు ఇంటరెస్టు, లేదేటి? పోని ఇంటరెస్టు తీసుకో పనిమానేసి అనసాగారు

కనక మహాలక్ష్మి అసలే మూలుగుతూ ఉంటే ఇంటాయన రూపంలో తాటిపండు పడింది

ఇంటి టాక్సు, నీటి టాక్సు ఏరాడ కొండెక్కేసాము బియ్యం దర, 'కిరసనాయిల్ దర, పెరిగిపోయాయి నేనీ యిళ్లమీద వచ్చే అద్దెలమీద బతకాల్సినవాడిని మీరేమో ఆలు మగలు ఆర్జిం చెస్తున్నారు' మా ఇళ్లేమో మీకు అచ్చొచ్చింది అందుకని ఇంటికి వచ్చెనెలనుంచి ఓ పాతిక అద్దె పెంచుతున్నాను ఇష్టంలేకపోతే ఖాళీ చెయ్యండి ఇంకోళ్లు కళ్లకద్దుకొంటూ నేను పెంచిన పాతికకి మరో పాతిక వాళ్ళే పెంచి దిగుతారు అని దానం తప్పించి మిగిలిన మూడు విధాల ఉపాయాలు వాడాడు

తామి ఇంటికిస్తున్న రెండు వందల యాభైకి మరో పాతిక చేరిస్తే ఇంతకంటే మంచి ఇల్లు దొరకకపోదు పొద్దున్న లేచింది మొదలు తను చాలా వీధులు తిరుగుతుంది ఎన్నో అందమైన ఇళ్ళు, అనుకూలమైన ఇళ్లు చూస్తూ ఉంటుంది కదా' అందులో ఒకటి ఎవరో ఒకరు ఇవ్వక పోరు తను అడిగితే' అందుకని ఇల్లు వెతక దానికి నిశ్చయించుకొని ఆ మాటే భర్తకి చెప్పింది

ఏమిటి? మీ రిల్లు ఖాళీ చేస్తారా, మీకు వేరే ఇల్లు దొరికితే' ఎంత మంచి మాట చెప్పారు ఎప్పుడు ఖాళీ చేస్తారు? మా చెల్లెలు వాళ్ళు ఈ ఊరు బదిలీఅయి వచ్చారు వాళ్ల కింకా ఇల్లు దొరకలేదు మీరిస్తున్న అద్దెమీద మరో యాభై ఇస్తారు కాస్త మీ ఇంటి ఓనర్కి మా వాళ్లను రికమెండ్ చేసి పుణ్యం కట్టుకోండి' అన్నవారున్నారే గాని, ఇక్కడ ఇల్లుంది రా రమ్మన్నవారు లేకపోయారు

ఒకటి రెండు కనిపించినా తాముంటున్న ఇంటికంటే చిన్నవి అయినా ఎక్కువ అద్దె కలవి కనిపించాయి

సాయంత్రం చెమటోడ్తూ వచ్చిన కనక మహాలక్ష్మి, అంతకంటే ముందు వచ్చిన నరసరాజుతో దొరకలేదండీ అంది జాలిగొలుపుతూ

కనక మహాలక్ష్మిని ఆ స్థితిలో చూసిన నరసరాజు గుండె ద్రవించిపోయింది, నువ్వు కూర్చో లక్ష్మి' అంటూ ఆమెను కూర్చోబెట్టి ఫాన్వేసి కాఫీకి నీళ్ళు పడేసాడు స్టౌమీద మామూలుగా అయితే ఆమె వచ్చి స్టౌమీద నీళ్ళు పడేసే వరకు అతను నీరసంగా కుర్చీలో కూర్చుని ఆమె కష్టం పట్టించుకొనే స్థితిలో ఉండడు

నామీద మీకెంత ప్రేమండీ అంది ఆమె అతని కళ్లల్లోకి ఆపేక్షగాచూస్తూ

కాఫీ తాగి నరసరాజు ఇంటాయన దగ్గరకు వెళ్ళి మరో పది రూపాయలు అద్దె పెంచుతానని మాటిమాటికి తమని ఇల్లు ఖాళీ చెయ్యమని ఒత్తిడి చేయవద్దనిచెప్పి ఒప్పించి ఏనుగెక్కి వచ్చాడు గుమ్మం పట్టకుండా ఆనందతో పొంగిపోయిన నరసరాజు గుమ్మంలో పట్టడానికి అరగంట పట్టింది అతను చెప్పిన సంతోష వార్త విని కనక మహాలక్ష్మి గాల్లో తేలిపోయి మంచం పక్కనున్న స్టూలికి తగలకుండా వంటింట్లోకి వెళ్ళింది భోజనం ఏర్పాట్లు చెయ్యడానికి

గుండు, కొత్త స్కూల్లో సంపాదించుకొన్న కొత్త స్నేహితుడి ఇంటినుంచి కథల పత్రిక తెచ్చుకొని ముందేసుక్కూర్చున్నాడు చదవటానికి ఇంటికి వచ్చాక కథలదే అయినా పుస్తకం అంటూ ఒకటి పుచ్చుకొని కూర్చున్నందుకు సంతోషించి, అది అందులోను ఇంగ్లీషుది అయినందుకు మరింత సంతోషించింది కనక మహాలక్ష్మి

ఏదీ ఒకసారి చూడనీ అని ఆ పిల్లాడి చేతిలో పుస్తకం తీసుకొని పేజీలు తిరగ వేసింది ఆమెను అట్ట వెనుక బొమ్మ ఆకట్టుకొంది

బావి లోపల గోడమీద పెరిగిన తీగలో చిక్కుకొని ఒక మనిషి తల్లక్రిందులుగా వేళ్లాడుతున్నాడు బావిలో మొసలి అతను పట్టు తప్పి కిందపడితే కబళించాలని నోరు తెరుచుకొని ఎదురు చూస్తోంది అతను పట్టు చిక్కి గట్టుమీదకి చేరితే ఫలాహారం చేద్దామని ఓ పెద్ద పులి పెద్ద మనిషిలాగా ఓర్పు వహించివుంది. మధ్యలో ఒక కొండ చిలువ అతగాడిని తన చుట్టల్లో ఇరికించుకొని చుట్టరికం నెరుపుదామని చూస్తోంది బావి మీదకు వాలి బావిపక్కనో చెట్టుంది ఆ చెట్టుకో తేనె పట్టుంది ఆ పట్టు నుంచి ఉందుండి ఒక బొట్టు తేనె జారి ఆ మనిషి నోట్లో పడ్తోంది అతను తనున్న బయంకర పరిస్థితుల్ని పట్టించుకోకుండా ఆ తేనె బొట్లని తన్మయత్వంతో చప్పరిస్తున్నాడు

వరండాలో సిగిరెట్టు కాల్చుకొంటూ విశ్రాంతి తీసుకొంటున్న నరసరాజుకి ఆ బొమ్మ చూపించి, 'ఈ బొమ్మ చూసారా' మీకేమని పిస్తోంది? అని అడిగింది

వడ్డాది పాపయ్య దనిపిస్తోంది అన్నాడు దాన్ని పరిశీలించి చూసి

మీ తెలివి తెల్లారింది అదికాదండి ఆ పులి, పాము మొసళ్లని చూస్తుంటే మన మీద ఎప్పుడొచ్చి పడ్తాయో తెలియని ఖర్చుల్లాగాను, ఆ తేనె బొట్లు ఎప్పుడైనా పొరపాటున మనం చేయగలిగిన చిన్న మొత్తాల పొదుపుల్లాగాను అనిపించడం లేదూ' అంది కనక మహాలక్ష్మి

మరో చన్నీళ్ల సముద్రంలో ఎప్పుడైనా వేడినీళ్ల బొట్టు రాల్చగలగటమే మనం చేయగలిగిన నిర్వాకం దానికి నిరంతరం శ్రమించటమే మన జీవిత పరమార్థం ఇవాళ ఇంటద్దె పెంచడం విషయంలో పదిహేను రూపాయలు అదాం చేసాం చూడు అదన్న మాట అని వ్యాఖ్యానించాడు. ఆపైన సిగిరెట్టు, తుది ముక్కలోని సారాన్ని పొగ రూపంలో తృప్తిగా పీల్చాడు

విశాఖపట్నపు ఆకశాన చంద్రుడు ముఖాన్న తెచ్చిపెట్టుకొన్న కళతో ప్రకాశించడం మొదలు పెట్టాడు ☐

# నాకు నచ్చిన నా కార్టూన్





హైదరాబాదులో జరిగిన ప్రపంచ హాస్య మహాసభ (ఫిబ్రవరి 8-12) సందర్భంగా మన దేశంలోని కొందరు ప్రముఖ కార్టూనిస్టులను కలుసుకునే అవకాశం నాకు లభించింది

సభ గురించిన విశేషాలను కుంకుమం అనే తమిళ వార పత్రికలో, ప్రముఖ చిత్రకారులూ, కార్టూనిస్టూ అయిన శ్రీ జెయరాజ్‌గారు, వివరిస్తూ తోడి కార్టూనిస్టులనుండి సేకరించిన కార్టూనులను అందులో ప్రచురించారు 14-4-85 న వెలువడిన కుంకుమం ప్రత్యేక హాస్య సంచికలో నా యీ కార్టూను ప్రచురించబడింది నేను ఊహించినదానికన్నా తమిళ పాఠకులు యీ కార్టూన్ను ప్రశంసించడం నా కాశ్చర్యం కలిగించింది

గంగాదారలో చేపల వాసన భరించలేక శివుడు ముక్కు మూసుకోవడం వరకే నేనూహించిన హాస్యం తమిళ పాఠకులు దీనికి మరో అర్థం జోడించారు

తమిళులు శాకాహారులను శైవం అనీ, మాంసాహారులను అశైవం అని పిలుస్తారు

ఇవాళ మీ యింట్లో శైవమా? అని అంటే ఇవాళ మీయింట్లో వెజిటేరియన్ వండారా? అని వాళ్ళర్థం!

కార్టూన్‌లో శివుడు శైవం అంటే వెజిటేరియన్ కనుక ఆయనలా చేశాడని తమిళ పాఠకులు నేనూహించని అర్థాన్ని నాకు తెలియచెప్పారు ఈ కార్టూను ఆవిధంగా ప్రత్యేకంగా నన్నాకర్షించింది!

–జయదేవ్

## రోజులో రెండు మధురానుభూతులు మీరు మెచ్చుకొనేలా అందిస్తోంది...







# ఉదయం రివ్వురివ్వున తాజాదనపు అహ్లాదం కలిగించి, రాత్రి అంతా సూక్ష్మక్రిమికారకమైన దంతక్షయం బారినుంచి రక్షణ కల్పించే ఒకేఒక్క దంతరక్షణ ప్యాకేజీ.

మీరు ఆదమరచి నిద్రలో వున్నప్పుడు చిన్నచిన్న ఆహారపు అణువులు పళ్లలో చిక్కుకుని వుండి సూక్ష్మక్రిముల్ని సృష్టిస్తాయి అవి అతి వేగంగా రెట్టింపై నోరంతా వ్యాపించి గార పట్టిస్తాయి గార మూలంగా హానికరమైన ఆమ్లాలు ఉత్పత్తయి దంతక్షయానికి, పుప్పిపళ్లకు ప్రదాన కారణాలవుతాయి

ప్రతి రాత్రి నిద్రకుపక్రమించేముందు ట్రస్ట్ (నైట్) తో మీ పళ్లను బ్రష్ చేసుకోవడం అలవరచుకోండి నిద్రపోతున్నప్పుడు దంత సమస్యలు ఉత్పన్నంకావు ఒక్క ట్రస్ట్ (నైట్) లో మాత్రమే క్లోరెక్సిడిన్ అనే ప్రత్యేక రసాయనం వుండి, మీరు నిద్రిస్తున్న సమయంలో అనేక గంటలపాటు పళ్లపై గార పట్టకుండా నివారిస్తుంది




ఉదయాన్నే మళ్లీ ట్రస్ట్ (మార్నింగ్) తో మీ దినచర్యను ఆరంభించండి ట్రస్ట్ లో చురుకైన అంతర్గత ద్రవ్యాలు మీ పళ్లను పూర్తిగా శుభ్రపరచి, తళతళ లాడిస్తాయి ట్రస్ట్ లోని అద్భుతమైన సువాసన, దుర్గంధాన్ని నివారించి మీ శ్వాసను చల్లగా, తాజాగా వుంచుతుంది ట్రస్ట్ నమ్మకకు మరోపేరు ట్రస్ట్ ను అలవాటు చేసుకోండి మీ దినచర్యను ప్రారంబించేందుకు ట్రస్ట్ ఒక్కటే ఉత్తమ మార్గం




## ట్రస్ట్... మీకు అవసరం, రాత్రి-ఉదయం.

సీరియల్:

# జిగి-బిగి

## ఎమ్.హరా

(గతసంచిక తరువాయి)

జరిగిన కథ –7 సీనియర్ క్లర్క్స్ పరీక్ష రాయడానికి వెళుతున్న అమ్మాయి, అబ్బాయికి పరిచయం అవుతుంది 'ప్రజాసేవ కంపెనీ' నడిపే బ్రహ్మచారి ఉభయానందం తన ఎనతల్లి మనుమరాలు సౌభాగ్యవతిని చేరతీసాడు సౌభాగ్యానికి పెళ్లి చేసి ఆమె భర్తని దత్తత చేసుకోవాలని ఉభయం కోరిక సూర్యనారాయణ మనుమరాలు అమ్మాయి సౌభాగ్యం, చిరంజీవి ప్రేమించుకున్నారు అమ్మాయి, అబ్బాయి ప్రేమించుకున్నారు సౌభాగ్యవతి పేరుతో అబ్బాయి రూముకి వెళ్లిన అమ్మాయి అతనికి ఉభయానందం ప్లాను వివరించింది అంతా విన్న అబ్బాయి ఇదంతా తన తండ్రి ఆడుతున్న నాటకమేనని తన కథంతా చెప్పసాగాడు అబ్బాయి తండ్రి ప్రజాపతి దగ్గరకి వెళ్లి అబ్బాయి తన కోడలు సౌభాగ్యవతిని ప్రేమిస్తున్నాడని చెప్తాడు ఉభయం ఉభయం పెద్దఎత్తులో వ్యూహం పన్నుతున్నాడని పసిగట్టిన ప్రజాపతి తను వచ్చి అబ్బాయి ప్రేమను పరీక్ష చేసి పెళ్లి చేస్తానని చెప్తాడు అబ్బాయి, అమ్మాయి, చిరంజీవి, సౌభాగ్యం ఏదో ఒక సాకుతో హైదరాబాద్‌కి చెక్కెయ్యాలని ప్లాను వేస్తారు ప్రజాపతి కొడుకు దగ్గరకి వస్తాడు ఆయన అమ్మాయినే సౌభాగ్యవతిగా భావిస్తాడు నాటకం ప్రారంభమవుతుంది మాటలతో బురిడీ కొట్టించి ఉభయం ఆస్తిని తన పేర రాయించుకుంటాడు అబ్బాయి

ఆ ఫోన్‌కాల్ సత్రకాయదని, సంయుక్త రాగానే తల్లికి మంగళం పాడడానికి తన పోర్షన్ నెమరు వేసుకోసాగాడు చిరంజీవి

యువరాణి బొంబాయి నుంచి ఫోన్ చేశారు కారులో పెట్రోల్ అయిపోయిందని కువైట్ వెళ్తున్నారుట వచ్చే అమావాశ్యకి ఈ వూరు వస్తారుట మీకు సారీ చెప్పమన్నారు మారేజ్‌కి డేట్ ఫిక్స్ చేయమన్నారు అంది సౌభాగ్యం మామూలుగా

మీ యువరాణి కిదేం తెగులే తల్లీ నాకు చెప్పవలసిన సారీని నీ చెవులో వూదుతుందా? అయినా నేనిక్కడే చచ్చానుగా ఆ రిసీవర్‌ని నా చెవికి తగిలించ వచ్చునుగా నీకేం మాయరోగం గొంతు చించుకుంది సాధ్వి

సత్రకాయ వ్యవహారం బెడిసి కొట్టిందని వూహించిన చిరంజీవి తల్లివంక తీవ్రంగా చూస్తూ అన్నాడు

ఉప్పెనలాంటి యువరాణి మాటలకి అడ్డుపడే శక్తి గుమాస్తా పీనుగులకి వుండదు సౌభాగ్యవతి యువరాణి అజ్ఞని శిరసావహిస్తుందిగానీ ఎదురు మాట్లాడదు అందుకే నీకు ఫోన్ యివ్వలేదు నీకు కల్చర్ తెలీదమ్మా పెద్ద పెద్ద వాళ్ళ ముద్దు ముచ్చట్లన్నీ పి ఏ లే చూస్తారు సపోజ్ నాకు ముద్దులని యువరాణి ఫోన్‌ని చుంబించిందనుకో, సౌభాగ్యవతి వాటిని రిసీవ్ చేసుకుని నాకు తన నోటితో అందిస్తుంది

మిష్టర్ చిరంజీవి మీ అమ్మగారి కోపాన్ని ఆపడానికి ముద్దు కథలు వల్లించకండి యిప్పుడు కాకపోయినా అమావాశ్యనాడు ఈ శతాబ్దపు మహిళ అవార్డు అందుకోగానే, నా మంచితనం, యువరాణి గొప్ప గుణం బయటపడుతుంది అంది సౌభాగ్యం

సొర చేపలు కోయకు తల్లీ ఆ వాసన నాకుపడదు ఆ అవార్డు గురించి పేపర్లలో ఎక్కడా పడలేదేం? అనుమానం వ్యక్తపరించింది సాధ్వి

ఈ విషయం పేపర్లలో పడితే మననోట మట్టి పడుతుంది ఆ అవార్డు తన మరదల కిమ్మంటాడు మినిస్టర్ తన మేనకోడలి కిమ్మని సిఫార్సు చేస్తాడు కౌన్సిలర్ తనకి చెల్లెలుగాని అమ్మాయి కిమ్మని పట్టుబడతాడు ఛైర్మన్ తన కోడల కిమ్మని వత్తిడి చేస్తాడు కోవెల మేనేజింగ్ ట్రస్టీ తమ గరల్ ఫ్రెండ్స్‌కిమ్మని పలుకుబడిగల వాళ్ళు పోటీలు పడతారు ఆ బహుమానాన్ని ఎవరూ తన్నుకు పోకుండా వుండడానికే సంయుక్త పేపరు పబ్లిసిటీ యివ్వకుండా గుప్త రోగంలా దాచేసింది గుట్టు చప్పుడయెట్లు వచ్చే అమావాశ్యనాడు ఆ అవార్డు మీ తలుపు తడుతుంది తాటికాయంత అక్షరాలతో మీ చిరునామా పేపరులో పడుతుంది

నమ్మమంటవా సౌభాగ్యం అసలు ఆవిడకి అనుమానం లేదు తనకి నచ్చిన వ్యక్తి లేక విషయం నమ్మడమనేది ఓ గొప్ప జబ్బు ఆ జబ్బు వస్తే తొందరగా వదలదు మనిషిని ముంచుతుంది లేదా తేలుస్తుంది'

నమ్మి మోసపోవడానికి మీరేం గుమాస్తా పిల్లకాదు పరుల మోచేతి నీళ్ళు తాగె బీదవారు కాదు మా యువరాణికి సమ ఉజ్జీ నేనే మోసపోయాను నయాపైసంత ముఖంతో అలిగింది సౌభాగ్యం

నువ్వు మోసపోయావా కలవర పడిందావిడ తన కొడుకు ఆ పిల్ల కొంగు లాగాడెమోని కంగారుపడింది

అవును యువరాణితో తన వివాహం సెటిల్‌కాగానే, మీకు అవార్డు వచ్చే ఏర్పాట్లు పూర్తి చేయగానే, నాకు హైదరాబాద్ చూపిస్తానన్నారు మిష్టర్ చిరంజీవి నా పని పూర్తి అయింది తన దగ్గర పైకం లేదంటూ మీ అబ్బాయిగారు ఆంధ్రప్రదేశ్ మాప్‌లో హైదరాబాద్‌ని చూపిస్తున్నారు యిది మోసం కాదా అంటూ ఆమె ముక్కుపుట ఎగరేసింది

'యిదెక్కడి సంతరా బాబూ అని చీదరించుకుంటున్న తల్లిని గబగబా గది గుమ్మం దగ్గరకి లాక్కెళ్ళి రహస్యంగా అన్నాడు చిరంజీవి

'నేనేదో ఎర్రగా బుర్రగా, పొడుగ్గా వున్నానని మోజుపడుతోంది ఈ పిల్ల మాట ఎందుక్కాదనాలి? యిటువంటి వ్యవహారాల్లో మొగవాడేమీ నష్టపోడు పైగా సంఘంలో పలుకుబడి పెరుగుతుంది నేనిప్పుడు కాదంటే యువరాణి ఆస్తి మన చేతుల్లోకి రాదు నీపేరు పేపరులో పడదు అందుకని నువ్వు మూడు వేలు యిస్తే చాలు మేం హైదరాబాద్ వెళ్తాం సౌభాగ్యం ముచ్చట తీరుస్తాను యిదేం తప్పు పని కాదు అవసరానికి మించి ఆస్తిపాస్తులున్న ఫామిలీస్‌లో యిటువంటివన్నీ సర్వసాధారణ విషయాలు

కొడుకు మాటలు సబబుగా అనిపించాయి సాధ్వికి అందుకే అయిదు వేలిచ్చి, ఆరోగ్యం జాగ్రత్తని హెచ్చరించి, హాండ్‌బాగ్ వూపుకుంటూ హోటల్లోంచి బయటపడింది సాధ్వి

తల్లి కనుమరుగై పోగానే రూం తలుపులు వేసి సౌభాగ్యవతిని కౌగలించుకోబోయాడు చిరంజీవి

అంతలో చిటపట లాడింది కాలింగ్ బెల్ దాని సొదని వినకుండా తన పనిని పూర్తి చేసి తాపీగా తలుపులు తెరిచాడు చిరంజీవి

ఎంతసేపు వెయిట్ చేయాలి గంట వాయిస్తూ నిల్చోడానికి నాకేం పనులు లేవనుకున్నారా? ఏమిటలా చూస్తారు అయామ్ రాణి ది గ్రేట్ రేడియో, టి వి స్టేజ్ అండ్ సినీ అర్టిస్టుని సత్రకాయ పంపాడు నా పోర్షన్ చెప్పండి యింతకీ యువరాణి సంయుక్తకి కిరీటం వుంటుందా వుండదా? ముందు ఫోన్ చేసి అయిస్‌క్రీమ్ తెప్పించండి అంటూ సత్రకాయ పంపిన నటీమణి దాష్టికంగా రూంలోకి అడుగుపెట్టింది

## 18

కొడుకూ, కోడలు యింట్లో కాలుబెట్టగానే ప్రజాపతిని ఆనందం

మట్టుముట్టింది యింత త్వరగా గబాలున అబ్బాయి తన మార్గం తొక్కుతాడని ఆయన ఏమరుపాటుగా కూడా వూహించ లేదు

అమ్మడు ఆ రోజంతా ఆ యింటిని గబగబా చదివేసింది చూడడానికి పాత కొంపలా వున్నా ఆ బంగళాలో ఆదునిక సౌకర్యాలన్నీ వున్నాయి కార్పట్ పరిచిన గది మూలల్లో ఫ్లవర్‌వాజు లున్నాయి బ్రాందీ బాటిల్స్‌తో నిండిన ఫ్రిజ్ వుంది రోజుకి రెండు గంటలు పని చేసె టి వి వుంది లెక్కకి అందని కౌసెట్స్ గుట్టపైటు యిన్ వన్, టేప్ రికార్డర్ క్షణం తీరిక లేకుండా వాగుతున్నాయి అటాచ్డ్ బాత్ రూమ్స్‌గల విశాలమైన రెండు బెడ్‌రూమ్స్‌ని ఎయిర్‌కూలర్స్ చల్ల బరుస్తున్నాయి

ప్రజాపతి సంపాదనలో అతి తక్కువ బాగం బాంక్‌లో బందించబడి వుంది ఎక్కువ బ్లాక్‌మనీ మాయలపకీర్ ప్రాణంలా రహస్యంగా దాచబడి వుంది

బోజనాలు చేసిన తరువాత అబ్బాయీ అమ్మడు గుసగుసలాడుతూ మైన్ హాల్లోకి వచ్చారు ఆమె టేబుల్ దగ్గర నిల్చుంది

ఆ టేబుల్‌కి కొంచం ముందుగా వున్న నరసరావుపేట పడక కుర్చీలో వెనక్కి చారగిర్లబడి పడుకున్నాడు ప్రజాపతి ఆయనకి అమ్మడు కనబడదు ఆమెకి ఆయన ముఖం మాత్రం కనబడటం లేదు ఎత్తైన కొండలాంటి ఆయన పొట్టా, పడగవిప్పిన పాములా కుర్చీరెస్టుపై నిటారుగా నిల్చున్న ఎడమచెయ్యా, వుత్రిత్రాడులా క్రిందకి వ్రేలాడుతున్న కుడిచెయి ఆమెకి కనబడుతున్నాయి

ఆయనకి కాళ్లవైపున పాతకాలపు చెక్క కుర్చీలో కూర్చున్నాడు అబ్బాయి అతనికి ఆమె కనబడుతున్నది

చిక్కని చిరునవ్వు చిందించింది టేబిల్‌పై వున్న టేప్‌రికార్డర్ ఆన్‌చేస్తూ సన్న సన్నగా అంది అమ్మడు రావణుడు రాముడికి చెప్పిన రాజనీతి రెడీ త్రి టు వన్

తండ్రివంక చూస్తున్న అబ్బాయి గొంతు సవరించుకుని డైలాగ్ వదిలాడు

నాన్నా మీరీ సర్పంచ్ పదవి లేకుండా బ్రతకలేరా

ఏమిటా చచ్చు ప్రశ్న ఖుషీగా హాయిగా జల్సాగా, ఈ దేశాన్ని ఏలేస్తూ బ్రతకమని బహుకొద్దిమందిని ఈ భూమ్మిదకి పంపిస్తాడు బగవంతుడు ప్రజల్ని పాలించె అదికారం మనకి వంశపారంపర్యంగా వస్తోంది పుట్టుకతో వచ్చిన ఈ అదికారం పుడకలతోగాని పోదు కష్టపడ ఏడుస్తూ బ్రతకమని చాలామందిని సృష్టిస్తాడు బగవంతుడు వాళ్ల కష్టాలకీ కన్నీళ్లకి కారణం మనంకాదు మన డబ్బుకాదు వాళ్ల పూర్వ జన్మ పాపఫలం'

మీకైతే బీద ప్రజల అండవుంది నేను ఎల్లకాకని ప్రజాసేవ ఎలాచేయాలో



## జిగిబిగి

తెలియదు నేను సర్పంచ్‌గా ఎదగగలనా? నన్నీ వూరి ప్రజలు ఎన్నుకుంటారా? అబ్బాయి సందేహం

నా మెళ్లో పడుతున్న పూలదండలు చూసి నాకేదో ప్రజల అండవుందని శంకిస్తున్నావు కడుపునిండా తిండిలేని సగటు ప్రజకి దండలుకొనే ఆర్థికశక్తి ఎక్కడుంది? నా ఉప్పుతిన్న దళారులే నాకు దండలువేస్తారు నోట్లు వెదజల్లితే ఓట్లు పండుతాయి ఆ పంటని కుప్పేస్తే పదవి చేతికివస్తుంది పదవి చేతికి అందగానే ప్రజాసేవ కరతలామలకమవుతుంది అంటూ ప్రజాపతి ఉపదేశించసాగాడు

ఎలక్షన్స్‌లో నన్ను గెలిపించేంత డబ్బుందా నాన్నా

నీ కెందుకా అనుమానం బ్లాక్‌మనీ బోలెడంత వుంది నువ్వు గెలుస్తావు ఈ వూరిని ఏలుతావు

బోలెడంత డబ్బు ఎలా సంపాదించారు నాన్నా

అబ్బాయి మాటలు పూర్తి కాలేదు క్లర్క్ దానయ్య వచ్చాడు

పొరపాటయింది ప్రసిడెంట్‌గారూ ఇనస్పెక్షన్ స్టాఫ్ ఎల్లుండి వస్తారనే కంగారులో నిన్న దొంగ వోచర్లు తయారు చేశాను అంతా మీరు చెప్పినట్లే చేశాను కాకపోతే చిన్న పొరపాటు జరిగింది దొంగ సంతకాలు చేయడానికి అలవాటుపడి, నాకు జీతం ముట్టినట్లు అక్విటెన్స్ రిజిస్టర్‌లో నా సంతకం చేయకుండా ఏమరుపాటుగా వల్లకాట్లో రామలింగయ్య చేవ్రాలు చేశానండి అంతకన్నా ఘోరం మన స్వంత స్కూల్ టీచర్ల జీతాలు చెల్లించినట్లు వేలిముద్రల వోచర్లు తయారు చేశాను ఈ తప్పు కాయండి సార్ మీ ఆర్డర్ ప్రకారం ఒక పనికి రెండు ఖర్చులు రాశాను చెరువుకి పూడిక తీయించి (లోతుగా తవ్వించి) ఆ మట్టితో రోడ్డు వెయించాం అంతా వొక పనైనా చెరువు ఖర్చూ, రోడ్డు ఖర్చు విడివిడిగా రాశాను నా మామూళ్ళు పోను మిగతా పైకం యిదిగో సార్ ఎల్లుండి ఇనస్పెక్షన్ ఖర్చులుంటాయి అంటూ ప్రజాపతికి డబ్బు యిచ్చి పంచాయితి రికార్డులు వున్న అల్మారా దగ్గరకి వెళ్ళాడు దానయ్య

దానయ్యా యిప్పుడు అయ్యగారు అర్జంట్ పనిలో వున్నారు రేపు తీరిగ్గా దొంగ లెక్కలు వ్రాయవచ్చు ఎల్లుండిగా ఇనస్పెక్షన్ యిప్పుడు వెళ్ళు అంటూ అతన్ని బయటికి తరిమేశాడు అబ్బాయి

అవినీతిగా అన్యాయంగా డబ్బు సంపాదించడానికి సవాలక్ష మార్గాలున్నాయి తిన్నవాళ్ళకి తిన్నంత పంచాయితిది కాలిబాట ఈ బాట దాటితే సమితి మట్టి రోడ్డు వస్తుంది యింకొంచెం ముందు కెళ్తే పురపాలక సంఘ జెడ్డీ గ్రావెల్ రోడ్డు వస్తుంది అది దాటితే రాజదాని తారు రోడ్డు వస్తుంది ధైర్యం చేసి ముందుకు గేస్తే సెంట్రల్ సిమెంట్ రోడ్డు స్వాగతం పలుకుతుంది పబ్లిగ్గా దోచుకోవడానికి పుష్కలంగా అవకాశాలున్నాయి అలాని అంతా ఆబగా మూట గట్టుకో కూడదు క్రిందివాడికీ, పైవాడికి నాలుగైదు మెతుకులు వెదజల్లాలి అప్పుడు మన డబ్బు ఎటువంటి అపోజిషన్ లేకుండా బిసబిసమంటూ పెరుగుతుంది

మీరీ డబ్బు సంపాదనలో పడి అమ్మకి దూరమై దుర్వ్యసనాలకి దగ్గరైనారు అందుకే మీరంటే నాకు కోపం మనసులోని మాటని చెప్పాడు అబ్బాయి

స్త్రీ వ్యసనం కన్నా గొప్పది పదవీ వ్యామోహం నన్ను అపార్థం చేసుకుని అనారోగ్యంతో కన్ను మూసింది మీ అమ్మ దుర్వ్యసనాల తోడు లేకుండా మనిషి ఏ రంగంలోనూ ఎదగలేడు

మీరు చాలా చాలా గొప్ప విషయాలు చెప్పారు నాన్నా అంటూ తన ఇంటర్వ్యూకి హారతి యిచ్చాడు అబ్బాయి

యిప్పటికి గ్రహించావు నా గొప్పతనం యిదంతా సౌభాగ్యవతి చేతి చలువ ఆ అమ్మాయి చేయి పట్టుకోగానే యిట్టే మారిపోయావు సౌభాగ్యవతి

నిజంగా మనింటి బాగ్యం ఎలక్షన్లు దగ్గరకి పడుతున్నాయి మనం వూర్లోకి వెళ్దామా?'

యిప్పుడు రాలేను నాన్నా మీ కోడలు ఎక్కువ కాలం యిక్కడ వుంటే లోకం చెవులు కొరుక్కుంటుంది మేమలా హైదరాబాద్ దాకా వెళ్ళి వస్తాం నాన్నా అంటూ గారాలు బోయాడు

శుభం ఎం ఎల్ ఏ మీద గాలి మళ్ళిందా? ఖర్చులకి ఈ పైకం తీసుకో– అంటూ బిగ్గరగా నవ్వేసి కొడుక్కి ఢబ్బిచ్చాడు ప్రజాపతి

అబ్బాయి గబగబా టేబుల్ దగ్గరకి వచ్చి అమ్మడితో చేతులు కలిపాడు వాళ్ళిద్దరూ చప్పుడు చెయకుండా నవ్వుకుంటూ టేప్ రికార్డర్ తీసుకుని వేరే గదిలోకి వెళ్ళారు

తన తల దగ్గర జరుగుతున్న సవ్వడి గమనించినా ప్రజాపతి తల పైకెత్తలేదు కొడుకూ, కోడలు ప్రేమాయణం చూడకూడదని గట్టిగా కళ్ళేగాక చెవులు కూడా మూసుకున్నాడు

19

చీకటిని చిమ్మివేస్తూ హైదరాబాద్ దిక్కుకి ఆదరా బదరా పరిగెడుతున్నది బస్

ఆ బస్‌లో కూర్చున్న అమ్మడూ, అబ్బాయి కునికిపాట్లు పడుతూ కబుర్లు చెప్పుకుంటున్నారు వారి వెనుక సీట్లో కూర్చున్న బడుద్ధాయి బుద్ధిమంతుడిలా లేడు అతని చేతులు, ముందుసీటు బాక్‌ని పట్టుకున్నట్లు నటిస్తూ అడపా దడపా అమ్మడి తలని, జడని తాకుతున్నాయి ఆమె రెండు మూడుసార్లు వెనక్కి తిరిగి అతని వంక తీవ్రంగా చూసింది అతని పోకిరీ వేషాలు అబ్బాయిక్కూడా పిర్యాదు చేసింది

వొక్క కుదుపుతో ఆగింది బస్ యిటువంటి సదవకాశం కోసమే ఎదురు చూస్తున్న బడుద్ధాయి చేతులు అమ్మడి బుజాలపై వ్రాలి క్రిందికి జారాయి ఆమె పక్కనే పొంచివున్న అబ్బాయి ఆ బడుద్ధాయి కుడిచేతిని గట్టిగా కొరికాడు అంతలో గుప్పుమని లైట్లు వెలిగాయి

అబ్బో మనిషి కాటుకి గుండు కొట్టించుకుని గుండు చుట్టూ నలభై ఆరు ఇంజక్షన్లు చేయించుకోవాలి లేకపోతే ప్రాణం పోవడం ఖాయం అంటూ తన నవ్వుల పువ్వులు క్రిందపడకుండా అబ్బాయి గుండెలపై తలని ఆన్చింది అమ్మడు

సారీ సార్ ఆనందంగా వున్నప్పుడు మా ఆడవాళ్ళ చేతులు కొరకడం నా హాబీ మా అమ్మిచేయి అనుకుని పొరపాటున మీ చేతిని బలంగా కొరికాను క్షమించండి కండ బయటికి వస్తున్నది చేతి రుమాలు చుట్టుకుని కన్నీళ్ళు చల్లుకోండి అన్నాడు అబ్బాయి సీరియస్‌గా బడుద్ధాయి వంక చూస్తూ

బడుద్ధాయి ఏదో అనబోయి, బాధతో మెలికలు తిరుగుతూ కన్నీటితో చేతికాటుని కడుక్కుంటున్నాడు బస్‌లోంచి దిగేవాళ్ళు దిగుతున్నారు ఎక్కేవాళ్ళు ఎక్కుతున్నారు బస్ డోర్ దగ్గర కండక్టర్ పాట బిగ్గరగా వినబడుతున్నది

"అయ్యలూ అమ్మలు పిల్లలు మీ దగ్గర చిల్లరుంటేనే బస్సెక్కండి తరువాత పేచీలకి దిగితేకుదరదు చిల్లరుంటేనే బస్సెక్కండి

మరీ చిల్లర డబ్బులతో మమ్మల్ని హైదరాబాద్ తీసుకెళ్తే ఎలా బాబూ ఆర్.టి సి కి నష్టం వస్తుందంటే రాదూ మరీ– అంటూ గడుసుగానే ఎకసెక్కాలాడుతూ బస్సెక్కుతున్నాడు చిరంజీవి

హాయ్ చిరంజీవి' అంటూ అరిచాడు అబ్బాయి

సౌభాగ్యం యిటురావే యిక్కడ సీటు ఖాళీగా వుంది' అంటూ సీటులోంచి లేచి అరిచింది అమ్మడు

అబ్బాయితో ఘర్షణకి దిగాలని ఆలోచిస్తున్న బడుద్ధాయి చిరంజీవి పర్సనాలిటీ చూడగానే చికాకుగా భయపడ్డాడు అబ్బాయి వ్యవహారం హైదరాబాద్‌లో తేల్చుకోవాలని బుద్ధిమంతుడిలా బస్ దిగి వైద్యానికై వూళ్ళోకి వెళ్ళాడు

వాటీసర్‌ప్రైజ్ కమాన్ భాగ్యం యిక్కడ కూర్చో. మీ కోసం బెజవాడ




బస్‌స్టాండ్‌లో వెయిట్ చేసి వెయిట్ చేసి, విసుగెత్తి, ఏం చేయాలో పాలుపోక హోల్‌సేల్‌గా రెండు కిలోల వేరుశనక్కాయలు కొన్నాం తినగలిగినన్ని తినేసి మిగతా కాయల్ని రిటేల్‌గా అమ్మేసి రెండు రూపాయల లాభం సంపాదించాం అప్పటికీ మీరు రాలేదు బోర్ పుట్టి బస్సెక్కేశాం అంటూ చివాల్న నవ్వేసింది అమ్మడు

చిరంజీవీ, సౌభాగ్యం కూర్చున్నారు బస్ కదిలింది బడుద్ధాయి మాత్రం బస్సెక్క లేదు

మేమీ బస్సెక్కడానికి ఎన్ని తంటాలు పడ్డామో చెప్తే మీరు నిలువెల్లా వొణికి పోతారు అయినా చెప్పక తప్పదు వేరుశనక్కాయలు కొనడానికి మీరు కాళేశ్వరరావు మార్కెట్‌కి వెళ్ళినప్పుడు మేం బస్‌స్టాండ్‌కి చేరివుంటాం మీకోసం వెతికి వెతికి వేసారి బెజవాడ రోడ్లు చూద్దామని బయలు దేరాం ఇరుకు సందుల మురికి చూడలేక కృష్ణా బారేజీకి షికారెళ్ళాం వెనకా ముందు చూడకుండా ప్రేమ కబుర్లు చెప్పుకుంటూ నడవసాగాం గుంటూరు ఎల్లలు కనబడగానే మా ప్రేమ నిషా తొలిగి పోయింది కాళ్ళ నెప్పి నసాళానికి అంటింది కింకర్తవ్యం అనుకుంటూ బెజవాడకి నడిచి వెళ్ళే శక్తిలేక దొంగ సరుకుల లారీ ఎక్కేసి అద్దదోవన ఈ బస్‌ని కాచ్ చేశాం అంది సౌభాగ్యం తన పక్కనున్న చిరంజీవి భుజంపై సేద తీర్చుకుంటూ

మీ మమ్మీని దారి మళ్ళించారా బావా' అబ్బాయి ప్రశ్న

రేపు అవార్డు అందగానే మారిపోతుంది మా మమ్మీ మీ నాన్నగారింకా పంచాయితిలోనే వున్నారా?'

ప్రశ్నకి ప్రశ్న సమాధానంగా చెప్పాడు చిరంజీవి

నా లెక్క ప్రకారం రేపీ పాటికి మా వూరి పొలి మేరలు దాటుతారు

'సత్రకాయ చేతిలో చిక్కిన మా బాబయ్య ఎలా వున్నాడో సాలోచనగా అంది సౌభాగ్యం

అంతవరకు పేపరు చూస్తున్న అమ్మడు కళ్ళల్లో మెరుపులు కురిపిస్తూ ఆనందంగా అరిచింది

మీకందరికీ ఓ శుభవార్త సత్రకాయ అక్కయ్య సుందరి యిప్పుడు మన దగ్గరే వుంది.

రేపు మనం చేరబోయే యింటి, యజమానురాలు యిక్కడే వుందా? ఎక్కడా అంటూ లేచి నిల్చుని బస్సంతా కలియజూడసాగింది సౌభాగ్యవతి

'బస్‌లో కాదు యిక్కడ చూడండి అంటూ పేపరులో అడ్వర్‌టైజ్‌మెంట్ చూపింది అమ్మడు

నాలుగు తలలు కలిశాయి ఆరు కళ్ళు గబగబా చదివాయి

అడ్వర్‌టైజ్‌మెంట్‌లో సుందరి పోటో క్రింద ఈ క్రింది విధంగా వుంది.

అయిదు అడుగుల నాలుగు అంగుళాల పొడవూ, యనభై కేజీల బరువుతో, బొద్దుగా, ప్రబంధ కవులు వర్ణించిన అందం సంపూర్ణంగా వున్న నా పోటో ని

# నోటి దుర్వాసన పోగొట్టుకోండి. దంతక్షయాన్ని ఎదుర్కోండి.



# మీ కుటుంబంలోని వారికి కోల్గేట్ రక్షణ చక్రాన్ని ఇవ్వండి!

క్రమం తప్పకుండా కోల్గేట్ ని వాడటంతో మీ కుటుంబంలోని వారి నోటి శ్వాస శుభ్రంగా, తాజాగా ఉంటుంది, వారి పళ్ళు యిక దృఢంగా, ఆరోగ్యంగా ఉంటాయి. కోల్గేట్ రక్షణ చక్రం చేసేది అదే, వారికది యివ్వడం అందుకే.

మీరు పళ్ళు తోముకున్న ప్రతిసారి, కోల్గేట్ యొక్క నమ్మకమైన ఫార్ములా చేసేదిది-చూడండెలాగో



మీ పళ్ళలో యిరుక్కుపోయిన ఆహారపు తునకల్లో దుర్వాసన, దంతక్షయం కలిగించే సూక్ష్మజీవులు పెరుగుతాయి



కోల్గేట్ లోని అద్వితీయమైన శక్తిగల నురగ లోపలికి చొచ్చుకుపోయి, అక్కడ గల దుర్వాసన కలిగించే ఆహారపు తునకల్ని, దంతక్షయాన్ని కలిగించే సూక్ష్మజీవుల్ని తొలగిస్తుంది



క్రమం తప్పకుండా కోల్గేట్ తో పళ్ళు తోముకుంటే, దాంతో యిక మీకు శుభ్రమైన, తాజా శ్వాస, దాంతోటే దృఢమైన, ఆరోగ్యమైన పళ్ళూను

**భోజనం చేసిన తర్వాత ప్రతిసారి మీ కుటుంబంలో వారంతా కోల్గేట్ తో పళ్ళు తోముకుంటున్నారని ధృవపరచుకోండి నోటి దుర్వాసన పోగొట్టుకోండి దంతక్షయాన్ని ఎదుర్కోండి. వారికి కోల్గేట్ రక్షణ చక్రాన్ని యివ్వండి.**




GK&E B84 55 Tel

*దీని తాజా పిప్పరమెంట్ రుచి మీకెంతో నచ్చుతుంది!*

# జిగిబిగి

మీరు చూస్తున్నారు నాపేరు సుందరి చదువు బి ఏ (గ్రూప్ లెఫ్ట్)

నాకు వెంటనే ఉద్యోగం కావాలి ఈ క్రింది అర్హతలు గల గుమాస్తా మీ ఆఫీసుకు కావాలనుకుంటే నాకు ఉద్యోగం వచ్చినట్లే

అ పూర్వానుభవం అవసరంలేదు

ఆ చదువులో వెనకబడ్డ వర్గానికి కనీస విద్యార్హత సడలింపబడుతుంది

ఇ తెలుగులో నవలలు రాయడమే గాక ఇంగ్లీషు నవలలు చదవడం ప్రత్యేక అర్హతగా పరిగణించబడుతుంది

ఈ కరక్టు టైంకి ఆఫీసుకి రావలసిన పనిలేదు మాట్నీ టైంకి యింటికి వెళ్ళడానికి పర్మిషన్ యివ్వబడుతుంది

ఉ ఆఫీసు పనిలో పూర్వానుభవం లేకపోయినా, అవివాహిత స్త్రీలు కాని వారికే ప్రాధాన్యత యివ్వబడుతుంది

ఊ జీతమే గాక, ఓవర్ టైమ్ అలివెన్స్ కూడా యివ్వబడుతుంది

పై అర్హతలు గల గుమాస్తా మీకు కావాలనుకుంటున్నారా? అయితే నాకు ఉద్యోగం వచ్చినట్లే (దయచేసి నా ఫోటో చూడండి) ఉద్యోగం వచ్చిన విషయం నాకు తెలియాలి కాబట్టి, ఈ ప్రకటన వెలువడిన పదమూడు రోజుల్లోగా వంద రూపాయలు జతపరచిన అపాయింట్‌మెంట్ ఆర్డర్ ప్లస్ తగిన పోస్టేజి అతికించిన మీ ఆఫీసు చిరునామా గల కవరు పంపాలి (మరొక్కసారి నా ఫోటో చూడండి థాంక్యూ) నేను మీ ఆఫీసుని సెలెక్టు చేసుకొనే పక్షంలో చిరునామా కవరు వుపయోగపడుతుంది మీరు పంపిన వంద రూపాయలు ఎటువంటి పరిస్థితుల్లోనూ వాపసు యివ్వబడవు యితరత్రా ఉత్తర ప్రత్యుత్తరాలు జరపబడవు గ్రహించగలరు

నా చిరునామా
సుందర సుందరి బి ఏ (గ్రూప్ లెఫ్ట్),
యింటి నెంబర్ 2-ఇ/3/4-1004,
మలక్‌పేట చివర బెజవాడ రోడ్డు మొదలు
హైదరాబాద్

సూచన ఎటువంటి బాదరాబందీ లేని అవివాహిత కాని నన్ను అపాయింట్ చెసుకుంటె మీకు పూర్తి సంతృప్తి లబిస్తుందని హామీ యిస్తున్నాను

ప్రకటన చదవడం పూర్తిచేసిన ప్రెమికుల ముఖాలు ఆశ్చర్యపు గుర్తుల్లా వున్నాయి

ఈ సుదరే సత్రకాయ అక్కయ్యని నీకెలా తెలుసు సౌబాగ్యం సందేహం

యింటి అడ్రస్ టాలీ అయింది అంటూ సత్రకాయ యిచ్చిన ఎడ్రెస్ కాగితాన్ని హేండ్ బాగ్‌లోంచి తీసి యిచ్చింది అమ్మడు

సుందరి సత్రకాయ పిన్నతల్లి కూతురు ఈ పిల్లది ఓ పెద్ద కథ సత్రకాయ చెప్పాడు ' అన్నాడు చిరంజీవి

ఎవరీ సుందరి? ఏమా కథ అన్నాడు అబ్బాయి

సుందరి కాదు సుందర సుందరి ఆ బార్యాబర్తలది విషాద మధుర గాథ చెప్పడానికి నాకిప్పుడు వోపిక లేదు అతని మాట పూర్తికాలేదు కోడి కూసింది కాకి అరిచింది

అప్పుడె తెల్లారిందా? పట్టపగల్లాగా గడిచింది రాత్రి సౌబాగ్యం వువాచ

ప్రెమికులకి రాత్రి కూడా పట్టపగలే ఏడ్చాడు చిరంజీవి

పెళ్ళైన వాళ్ళకి పట్టపగలు కూడా రాత్రే

అబ్బాయి ఈర్ష్య

చెతకాని వాళ్ళకి ఏదైనా ఒకటె

అమ్మడి సిగ్గు

హైదరాబాదు వచ్చింది దిగండి దిగండి అని గోల చెశాడు కండక్టర్

బస్ దిగి నలుగురూ తమతమ సూట్‌కేసులు తామే మోసుకుంటూ సుందరి యింటికి దారితీశారు

అప్పటికింకా బాగా తెల్లారలేదు మంచు కురుస్తూనే వుంది నగరం యింకా నిద్రపోతూనే వుంది చలిగా చేమనచాయగా వుంది వాతావరణం యింటి నెంబర్లు తడుముకుంటూ చివరికెలాగైతేనేం సుందర సుందరి యింటిని పట్టుకున్నారు నలుగురు ప్రెమికులు

ఆ యింటి మైన్ గేటుకి రెండు వైపులా అట్ట బోర్డులు వ్రేలాడుతున్నాయి సుందరం బి ఏ ఉద్యోగి (తాత్కాలికం) అని వొక బోర్డులో వుంది యింకో వైపు సుందరి బి ఏ గ్రూప్ లెఫ్ట్ అనెంప్లాయి అని వుంది

మైన్ గేటు తెరిచి నలుగురూ యింటి ఆవరణలోకి ప్రవేశించారు చేతిగాజులు వెనక్కు లాక్కుని అమ్మడు వీధి తలుపుని బాదింది

'వస్తున్నాను వస్తున్నాను అని వురుమతూ, మెరుపులా తలుపు తెరిచి 'ఎవరు కావాలమ్మా లోపల పనిలో వున్నాం వేళకాని వేళ దొంగల్లా తలుపులు బాదితే ఎలా అంటూ కసిరి పమిటిని నిండుగా కప్పుకుంది సుందరి

సుందరిగారు కావాలండి నసిగింది అమ్మడు

ఏమేవ్ రావే తెల్లారిపోతున్నది' అంటూ లోపలి గదిలోంచి మొగ ఆర్తనాదం వినపడింది

మాయ సంత మాయ సంత వస్తున్నాను వుండండి నేనే సుందరిని ఏం కావాలి' అంటూ గబాల్న తలుపు చాటుకి తప్పుకుంది సుందరి

'మేం అడవూరి నుంచి వస్తున్నాం సత్రకాయ పంపాడు

ఓ మీరా ఈ రోజు ఉదయానికే మీరు వస్తున్నట్టు సత్రకాయ బేరింగ్ కవరు రాశాడు మీ కథంతా తెలుసు మా దొడ్లో వున్న రేకుల షెడ్డే మీ వసతి గృహం అయినా యింత ఆలస్యం అయిందే బెజవాడ నుంచి పరిగెత్తుకుంటూ వచ్చినా నిన్న సాయంకాలానికి వచ్చేవారు రైలు మీద వచ్చారా? రిక్షాల మీద వచ్చారా అంటూ ఆమె వూపిరి తీసుకోలేదు అమ్మడు సమాదానం చెప్పేలోగా మళ్ళీ మొగ ఆర్తనాదం వినపడింది

ఏమేవ్ రావె

'మీరెలా వస్తే నాకెందుకు మా తమ్ముడు జాబులో రాసినట్టు యింటికి అవసరమైన సామాన్లన్నీ ఇన్‌స్టాల్‌మెంట్స్ పద్ధతిలో తీసుకున్నాను వెళ్ళి చూసుకోండి రేపు తీరిగ్గా మాట్లాడుకుందాం వెలుగు ఇంకా చిక్కబడలేదు పలుచగానే వుంది నాకు అర్జంట్ పని వుంది వెళ్లాలి అన్నట్టు మరిచాను దొడ్లోకి వెళ్తూ కిటికీలోంచి మా యింట్లోకి మాత్రం తొంగి చూడకండి మీకే ప్రమాదం యింకా పెళ్ళికానివాళ్ళు అంటూ ఆమె చివాల్న తలుపులు వేసింది మళ్ళీ వినబడింది మొగ ఆర్తనాదం ఆ ఆర్తనాదం ఆమె బర్త సుదరానిది'

ఆమె మాటలకీ, ఆర్తనాదాలకీ దడుచుకున్న అబ్బాయి బయం భయంగా అమ్మడి చేతిని గట్టిగా పట్టుకున్నాడు బళ్ళున తలుపు వేసి ఆమె ఎందుకు పరిగెత్తిందో సౌబాగ్యానికి వివరించడానికి ఉపోద్ఘాతంలా ఆమె బుజంపై చేయి వేశాడు చిరంజీవి

నలుగురు ప్రెమికులు కళ్ళు మూసుకుని ఆ యింటి పక్కనున్న సందులోంచి పెరట్లోకి వెళ్లారు రేకుల షెడ్‌లాంటి యింటిని చూశారు యింట్లో అమర్చివున్న అన్ని వస్తువుల్ని ఏకముహూర్తంలో చూశారు

అమ్మడు స్టౌ రాజేసింది సౌభాగ్యం కాఫీకి నీళ్ళు పెట్టింది అబ్బాయి బియ్యంలో రాళ్ళు ఏరసాగాడు చిరంజీవి కూరలు తరగసాగాడు కుటుంబరావు గారింటికి వీలైనంత త్వరలో వెళ్ళి ఉద్యోగాలు సంపాదించుకోవాలని కబుర్లు చెప్పుకోసాగారు

వివిదబారతిలో తెలుగు పాటలు పూర్తి అయిన తరువాత సుందరీ, సుందరం ఆ యింటికి వచ్చారు అన్నీ సక్రమంగా అమిరాయాని మర్యాదపూర్వకంగా అడిగారు

అందరూ సమవయస్కులు కావడంతో వారి స్నేహం పెరిగింది' శుభం'

**(ఇంకా ఉంది)**

**కొత్తగా మెరుగుపరచబడిన**

# జాస్మిన్

## పూలపరిమళాలతో ప్రతిసారీ స్నానం...




ఇప్పుడు మీరు మెచ్చిన టాయిలెట్
సోప్ మునుపెన్నడూ లేనంత
మెరుగయింది—మీ మనసుకు
మరింత దగ్గరయే ఘుమఘుమలతో.

జాస్మిన్—హాయిగా, ఉద్యానవన
విహారం చేసిన తాజా అనుభూతికి,
స్నానం చేసాక చాలా సేపటిదాకా
మీ శరీరమంతా మిలమిలలాడేందుకు.




# జాస్మిన్

## లగ్జరీ సోప్

బొంబే సోప్ ఫ్యాక్టరీ బొంబాయి 400 008.

1904 నాటి నుంచీ నాణ్యమైన సబ్బులను తయారుచేస్తున్నవారు

Sai-J-2 Tel

## పె యు పర్లాకిమిడి

★ మా ప్రశ్నలకు మీ జవాబులు లేడీస్‌కి పేవరబుల్‌గా ఉంటాయి మీరు ఈక్వల్ జస్టిస్ యివ్వవలసినదిగా కోరుతున్నాను

● దర్మ దేవత గుడ్డిది! న్యాయం ఎటుంటే అటే ఆమె కాటా మొగ్గుతుందని వినలేదా నాకు న్యాయం అనిపిస్తే రాస్తాను మగాళ్లని తిట్టటం – నా హాబీకాదు

## బి ఎమ్ కె పెదగొన్నూరు

★ వరకట్నానికి బలి అయిపోతున్న ఈ సమాజం ఎన్నడు మారుతుంది?

● బాగుపడదు – మనుషుల తత్వాలు, ఆలోచనా సరళి మారనంత వరకు వరకట్నానికి సమాజంకాదు బలి అయిపోతున్నది – ఆడపిల్లలు సమాజంలో మెజారిటీ వర్గం చచ్చి చస్తూ బ్రతుకుతూంటే – యీ సమాజం మారాలనుకోవడం అత్యాసే అవుతుంది

## బి వి ఆర్ కాకినాడ

★ రామలక్ష్మిగారూ శాంతిదూత గాంది విగ్రహం కింద హింసాత్మకమైన పోరాటాలు చిత్రీకరిస్తున్నారు కొందరు నిర్మాతలు – కారణం ఏమిటి?

● అంత కారణం ఆలోచించి చిత్రీకరిస్తారంటారా నిర్మాతలు? మనమే చెప్పుకోవాలి కారణాలు ఆ పోరాటం అహింసా స్థాపనకోసమే జరుగుతుందంటారు కోర్టులో న్యాయ దేవత బొమ్మలాగే గాంది అహింసావాది కదా చూసి ఆనందిస్తారని – హింసతోనైనా అహింస గెలవడం!




## ఎ వి బి ఆర్ కాకినాడ

★ కె రా గారూ మగజాతిపై దుమ్ము వేసి దులపటం మీకు అలవాటా?

● దుమ్ము వెయడం అలవాటు కాదే!

## ఆనారా, ఖర్గపూరు

★ సినిమాలో హీరోలు చిన్న పిల్లల నుంచి ఒక్కసారి పెద్దవారై పోయినట్టు నా కవల పిల్లలు కూడా ఒక్కసారి పెద్దవారైపోతే బాగుండునని ఒక తల్లి ఆలాపన ఎవరు తీరుస్తారు

● ఎవరూ తీర్చక్కరలేదు ఏ తల్లీ ఆలపించదు కోరుకుంటుందేమో నవమాసాలు మోసిన తల్లికి తెలుసు – ఇకపై ప్రతి క్షణం – పిల్లల పెంపకానికై వెచ్చించాలని

## కె వి ఆర్. ఖర్గపూరు

★ వృత్తికి ప్రవృత్తికి తేడా ఏమిటి?

● వృత్తి – దొరికినది చేయడం అయితే ప్రవృత్తి కోరుకున్నది చేయకల్గడం

## మనోహర్, బాపట్ల

★ నేటి రాజకీయ వ్యవస్థపై మీ అభిప్రాయం ఏమిటి?

● మానింది మందన్నట్టు – అధికారంలో ఉన్నదే రాజకీయం ఇతరమైనదంతా ఒర్వలేనితనం

## ఎమ్. వి ఆర్ విజయవాడ

★ అంతరాత్మకి వ్యతిరేకంగా పనులు చేయడం కష్టం కదా? మరి రాజకీయవేత్తలెలా చేస్తారో?

● అంతరాత్మకి - గౌరవ ప్రదర్శనతో ఎలా పనిలేదో రాజకీయాలతోనూ అలాగే పనిలేదు పదవిలో వున్నవారు మెదడుతో ఆలోచిస్తారు అంతే

## జె. ఎస్. వరంగల్లు

★ పూర్వం సినిమాలలో చివర జాతీయ గీతం ప్రదర్శించేవారు ఇప్పుడు ఉండడంలేదు కారణం

● సినిమా చూడ వచ్చినవారు దేశభక్తి ప్రదర్శించలేరని – ప్రభుత్వం అక్కరలేదంది అసలీ రోజుల్లో సినిమాలలో బయం వేస్తే పారిపోదలచిన వారికై పక్క తలుపులు తెరిచి వున్నాయి అని స్లయిడ్ వేస్తే చాలు అలాగే సిగ్గేస్తే వెళ్లిపోవాలనుకున్న వారికోసం కూడ

## పి ఆర్ ఇల్లెందు

★ ఆ రోజు నెహ్రూ నోట్లతో కాచాడంటారు మరీనాడు మనదేశం ఇంత అప్పు చేయడానికి కారణం?

● నెహ్రూ నోట్లతో కాపీ కాల్చడం వల్ల మటుకు కాదు! వ్యక్తుల ఆస్థిపాస్తులు వారి వారి యిష్టం దేశపు ఆస్థిపాస్తులు అధికారంలో ఉన్నవారి స్వంతం అంచేత అప్పుంటుంది అలాంటి అప్పు మనం దేశానికని ఖర్చుపెడుతున్న దానికి చిహ్నంగాని మన లేమితనానికి నిదర్శన కాదు

## గణేశ్వర్, టిట్లాఘర్

★ ఉప్పల లక్ష్మణరావుగారి గూర్చి మీ అభిప్రాయం?

● వారితో వ్యక్తిగతంగా పరిచయం లేనందుకు విచారంగా వుంది వారి బ్రతుకు పుస్తకం – నిజంగా అద్భుతంగా వుంది ఉపన్యాసాలు, పుస్తకాలు, వ్యక్తులు వ్యవస్థలు – ఎవరూ నేర్పలేని పాఠాలు చెప్పే చెప్పనట్టు జీవించి చెప్పారా ఆయన అన్పించింది వారి అతడు – ఆమె కూడా యీ శతాబ్దపు సాహిత్యంలో నిలచే నవల □

# నీలో దీపం వెలిగించు

## "మిర్రర్"




సుజాత-

ఆపీసులో అడుగు పెట్టగానే-

మేనేజరు పిలుస్తున్నారు అని చెప్పాడు మెసేంజరు వచ్చి

తన సీటులో హేండ్‌బేగ్ సర్దుకుని మరు నిముషంలో మేనెజరు కేబిన్‌లో ప్రవేశించి విష్ చేసింది

హెడ్డాపీసుకి వెళ్ళవలసిన రిపోర్టు ఈ సాయంకాలానికి రడీ అయిపోవాలి అన్నాడు ఆయన ఆమె వంక చూడకుండానే

యస్ సార్ అని జవాబు చెప్పి తన సీటుకి తిరిగి వచ్చింది

తన సీటులో ఈ మధ్య వర్క్‌లోడ్ చాలా పెరిగి పోయింది అంతకు ముందు ఇదే పనికి ఇద్దరు వుండేవారు ఒక అసిస్టెంటును ప్రొవైడ్ చెయ్యమని ఎన్నిసార్లు అడిగినా ఆ విషయం పట్టించుకోని మేనేజరు, వర్క్ డిలే అయినప్పుడు మాత్రం కఠినంగా వ్యవహరిస్తుంటాడు

వర్క్ విషయంలో తనకున్న ఇబ్బందులు అతనితో చెప్పుకుని ప్రయోజనం లేదన్న విషయం గ్రహించి ప్రతిసారీ తనే సర్దుకు పోతూంది

అందులో ఇప్పుడు తను ప్రమోషన్ జోన్‌లో వుంది ఈ సమయంలో మేనేజరుతో వివాదం తనకే మంచిది కాదు

అందువల్ల రిపోర్టుకి సంబందించిన కాగితాలు ముందు వేసుకుని మరుక్షణం పనిలో బిజి అయిపోయింది సుజాత

సాయంత్రానికి రిపోర్టు తయారు అయింది

కానీ అప్పటికి సుజాతకి జ్వరం వచ్చినట్టుగా వుంది గొంతు ఎండి పోతూంది వెంటనే పడుకుని విశ్రాంతి తీసుకోవాలన్నంత నీరసంగా వుంది

రెండు నెలల కిందట తనకి ఎబార్షన్ అయింది అప్పటి నుంచి ఆరోగ్యం బాగుండటం లేదు సాయంత్రం అయ్యేసరికి దాదాపు ప్రతిరోజూ జ్వరం వస్తూంది ఒక నెల రోజులు సెలవుపెట్టి విశ్రాంతి తీసుకోవాలని వుంది కానీ తను ఇప్పుడు ప్రమోషన్ జోన్‌లో వున్నందువల్ల విదిగా ఆఫీసుకి రావలసి వస్తూంది

ఎంతకీ రాని బస్సుకోసం ఎదురు చూసి విసిగిపోయి ఆటోలో ఇల్లు చేరుకుంది ఈ పని తను ముందే చేసివుంటే బాగుండేది అనుకుంది మనసులో

కాళ్ళు కడుక్కుని వచ్చి ముందు రూములో సోఫాలో కూర్చుంది అప్పటికి ఇంకా రమణమూర్తి రాలేదు

రమణమూర్తితో తనకి పెళ్ళి అయి రెండు సంవత్సరాలు అయింది పెళ్ళికి ముందు నుంచీ తను ఉద్యోగం చేస్తూంది తను సంపాదించి కూడబెట్టిన డబ్బుతో తండ్రి తన పెళ్ళి జరిపించాడు

పెళ్ళికి ముందు తన వైవాహిక జీవితంపై కొన్ని ఆశలు పెంచుకుంది

చిన్న ఇల్లు, చిన్న సంసారం లాంటి చిన్న చిన్న కోర్కెలు మాత్రమే పెంచుకున్న తనకి అవి అందని పళ్ళు అయిపోయాయి

పనిమనిషి రాలేదు తల్లీ అంట్లు గిన్నెలు అలాగే పేరుకు పోయాయి లేచి వాటి పని చూడు మీ మామగారి భోజనానికి ఆలస్యం అయిపోతూంది అంది అత్తగారు వచ్చి

తనకి నీరసంగా వుందని ఆ పని తన వల్ల కాదని చెప్పలేక పోయింది సుజాత ఒకవేళ తను ఆ పని చెయ్యలేకపోతే ఆ తరువాత జరిగే యుద్ధం తను భరించ లేదు

అందువల్ల లేచి అంట్లు గిన్నెల ముందు కూర్చుంది

అందరి భోజనాలు అయింతరువాత వంట ఇల్లు సర్ది బయటపడేసరికి రాత్రి పదకొండు అయింది

రమణమూర్తి అప్పటికే నిద్రపోతున్నాడు

తను భోజనం చేయలేదన్న విషయం ఎవరూ పట్టించుకో లేదు అందుకూ బాధ లేదు కానీ తన ఆరోగ్యం గురించి పరామర్శించి, తన చేత్తో ఒక మందు బిళ్ళ అందించితే ఎంతో రిలీఫ్‌గా వుండేది కానీ అతనికి తన స్నేహితులతో గటపటంలో వున్న ఆనందం భార్య ప్రక్కన వున్నప్పుడు రాదు

అసలు భార్యతో అంటి పెట్టుకుని తిరిగితే తను అలుసు అయిపోతానన్న భావం అతనికుంది

అసలే గ్రాడ్యుయేట్ అందులో తనతో సమానంగా సంపాదిస్తూంది కాబట్టి ఏ క్షణంలోనైనా తనని గడ్డిపోచగా తీసి పారెయ్యవచ్చు అందువల్ల భార్య ముందు తను రిజర్వ్‌డుగా వుండటం మంచిది అనే ధోరణి అతనిది

మరునాడు జ్వర తీవ్రత హెచ్చింది రాత్రి భోజనం చేయనందువల్ల నీరసంగా వుంది

రమణమూర్తి లేచి బేడ్మింటన్ ఆడుకోవటానికి వెళ్ళి పోయాడు ఇంట్లో ఇతర సభ్యులు ఎవరి

పనిలో వారున్నారు.

ఈ రోజుకి సెలవు పెట్టి ఇంట్లో కళ్ళు మూసుకు పడుకోవాలని వుంది. కానీ సెలవుపెట్టి ఇంట్లో వుంటే అత్తగారు క్షణంసేపు కాళీగా వుండనీయదు. మంచం నవ్వారు పట్టీలు బిగించటం మొదలు వంటింటి డబ్బాలు శుభ్రం చేయటం లాంటి అర్థమైన పనులూ పురమాయిస్తుంది. ఈ బాధ కంటె ఆఫీసు నయం.

సుజాత ఆఫీసు చేరుకునే సరికి ఆమె తండ్రి ఆమె కోసం ఎదురు చూస్తున్నాడు.

ఆయన వుండేది కూడా హైదరాబాదులోనే అయినా ఆ మధ్య వచ్చిన ఏవో గొడవల వల్ల, సుజాతని చూడటానికి ఆయన ఇంటికి రాకుండా ఆఫీసుకే వచ్చి కూతురుని పరామర్శించి వెళ్ళటం అలవాటు చేసుకున్నాడు.

తండ్రిని చూసేసరికి సుజాతకి దుఃఖం పొంగుకు వచ్చింది.

తన కష్టాలు తండ్రికి చెప్పుకోవాలనిపించింది. కానీ ఈ వయసులో ఆయనకి మనస్తాపం కలిగించటం తప్ప మరో ప్రయోజనం వుండదని వూరుకుంది.

"నీ తమ్ముడు గోపాలంకి ఓ ప్రైవేటు సంస్థలో ఉద్యోగం వచ్చింది. కానీ రెండు వేల రూపాయిలు సెక్యూరిటీగా డిపాజిట్ చెయ్యమన్నారు. నా పరిస్థితి నీకు తెలియంది కాదు. ఈ సమయంలో నువ్వు డబ్బు సర్దితే వాడి జీవితం ఒక మార్గాన పడుతుంది. నెమ్మదిగా అప్పు తీర్చుకుంటాడు." అన్నాడు ఆయన తను వచ్చిన విషయం ప్రస్తావిస్తూ.

సుజాత మీమాంసలో పడిపోయింది.

తన వద్ద రడీగా డబ్బులేదు. అసలు తనదంటూ తన ఎక్కవుంట్‌లో డబ్బు ఏనాడూ లేదు. జీతం రాగానే తెచ్చి భర్తకి ఇవ్వటం అలవాటు. అందులోంచి కొంత ఖర్చులకి తీసి తనకి ఇస్తుంటాడు. మిగిలినది ఆయన తన స్వంత ఎక్కవుంట్‌లో దాస్తుంటాడు.

గతంలో ఒకసారి ఏదో అవసరానికి తండ్రికి డబ్బు సర్దింది. ఆ విషయంలో ఇంటి వద్ద పెద్ద గొడవే అయింది. ఆ సంగతులేవీ తను తండ్రికి తెలియనీయ లేదు.

అలా అని చెప్పి ఇప్పుడూ తండ్రికి డబ్బు లేదని చెప్పలేకుండా వుంది. తన చదువు కోసం తండ్రి ఎంత కష్టపడవలసి వచ్చిందో తనకి బాగా తెలుసు. ఈ రోజున తన తమ్ముడికి జీవిత సమస్యలో సహాయం చేయలేక పోవటం తనకే తలవంపులుగా వుంది.

తన పరిస్థితి తనకే అసహ్యాకరంగా వుంది.

ఈ రోజున తనకి అన్నీ వున్నాయి.

తను బియే పాసు అయింది.

గవర్నమెంటు ఉద్యోగం వుంది.

హోదా వుంది.

సమాజంలో పరువు వుంది.

ఆదాయం వుంది.

అందమైన భర్త వున్నాడు.

కానీ ఎన్ని వున్నా –

తనని అర్థం చేసుకునేవారు లేరు.

తన పట్ల సానుభూతి చూపేవారు లేరు.

తనకి స్వాతంత్ర్యం లేదు.

భర్తకి తను సంపాదించే డబ్బుమీద వున్న ఆసక్తి తనమీద లేదు.

ఎందుకీ బ్రతుకు?

చనిపోవటం మేలు అనుకుంది.

ఆడవాళ్ళు ఆత్మహత్య చేసుకున్న ఉదంతాలు వార్తాపత్రికల్లో చదివినప్పుడు అలా వాళ్ళెందుకు చనిపోతుంటారో చిన్నప్పుడు అర్థం అయేది కాదు.

కానీ ఇప్పుడు తనున్న పరిస్థితులలో, ఆడవాళ్ళు ఆత్మహత్య ఎందుకు చేసుకుంటారో అర్థం అయిపోయింది.

తనకి అనారోగ్యంగా వున్నా ఆఫీసులో పని తప్పదు. పని చేసినా ప్రోత్సాహం లేదు.

అనారోగ్యం కారణంగా ఉద్యోగానికి రాజీనామా చేయాలనుకుంటే అందుకు భర్త అంగీకరించ లేదు.

సంపాదించే డబ్బుమీద తనకి అధికారం లేదు. తన తల్లిదండ్రులకి ఆర్థిక సహాయం చేసే స్వాతంత్ర్యం లేదు.




తన ఈ బాధలు చెప్పుకునేందుకు మనిషి తోడు లేదు.

ఇలాంటి వ్యర్థ జీవితం గడిపే కంటే మరణించటం మంచిదని నిర్ణయించుకుంది.

సుజాత నుంచి ఎంతకీ జవాబు రాకపోయే సరికి, ఆమె అశక్తతను గ్రహించిన ఆమె తండ్రి–

"పోనీలే తల్లీ. నీకు వీలుపడక పోతే బాధపడకు. మరో మార్గంలో ప్రయత్నిస్తాను. నువ్వు సంతోషంగా వుంటే అంతే చాలు. నువ్వు బాధపడుతుంటే నేను చూడలేను" అన్నాడు.

ఆ సమయంలో తండ్రి ముఖం చూడలేక తల అటు తిప్పుకుంది.

"నువ్వు బాధపడుతుంటే నేను చూడలేను" అన్న ఆయన మాటలు పదే పదే ఆమె మనసులో మారు మ్రోగసాగాయి.

"చనిపోవటం మంచిది" అని క్షణం ముందు తను తీసుకున్న నిర్ణయం ఎంత అర్థరహిత మైనదో తెలిసింది.

చనిపోవటం వల్ల సాధించేది ఏమీ లేకపోగా, కన్న తండ్రికి, ఇతరులకు దుఃఖం కలిగించిన దవుతుంది తను.

అంత చదువుకుని, తెలివి తేటలు వుండి ఆత్మహత్య అనే ఆలోచనలో పడిపోయినందుకు సిగ్గు పడింది.

తన చదువుకి, వివేకానికి సార్థకత చేకూరేలా తను చేయవలసింది ఏదో వుందని ఆమె క్షణకాలం మనసులో మెదిలింది.

వెంటనే లేచి ఎక్కవుంట్స్ సెక్షనుకి వెళ్ళి "లోన్" తీసుకుని డబ్బు తండ్రికి ఇచ్చి పంపించింది.

అంతేకాక –

ఆ రాత్రి తన పరిస్థితి, ఇబ్బందులు, అభిరుచులు, ఆశయాలు, అవసరాలు అన్నీ స్పష్టంగా భర్తకి వివరంగా చెప్పింది.

అతను ఎప్పటిలా ఉదాసీనత ప్రదర్శించాడు.

వారం రోజులు తరువాత ఆమె తన నిర్ణయం అమలు జరిపింది.

"నేను సంపాదించే డబ్బుమీద కాక నామీద మీకు అభిమానం కలిగిన రోజున కబురు పంపండి. తిరిగివస్తాను"–

అని కాగితం వ్రాసి వుంచి,

తను ఆ ఇంటి నుంచి విడిపోయి వర్కింగ్ వుమెన్సు హాస్టలులో చేరిపోయింది.

తనని ఎవరో బాధ పెడుతున్నారని చింతిస్తూ, జీవచ్ఛవంలా బ్రతకకుండా, తన జీవితంపై తానొక నిర్ణయం తీసుకుని, తన బ్రతుకు బాటను సరిదిద్దుకుని తన వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకుంటూ స్వేచ్ఛగా బ్రతక గలుగు తున్నందుకు, ఇప్పుడు సుజాతకి ఎంతో తృప్తిగా వుంది. □

## జూలై 12న "దొంగల్లో దొర"

"సుమన్ తొలిసారిగా ద్విపాత్రలు నిర్వహించడం ఈ చిత్రంలో విశేషాకర్షణ," అన్నారు నాగార్జున ఆర్ట్ పిక్చర్స్ అధినేత ఎ. సారథి. ఈయన నవరసభరితంగా నిర్మించిన పై చిత్రం జూలై 12న విడుదలవుతుంది. విజయశాంతి, ముచ్చెర్ల అరుణ నాయికలు. సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, నూతన్‌ప్రసాద్, రమణమూర్తి, వేలు, చలపతిరావు, నళినీకాంత్, పల్లం నరసింహారావు, శుభ, కాకినాడ శ్యామల, యూనిస్ తక్కిన పాత్రలు పోషించారు. సత్యానంద్ సంభాషణాకర్త. ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం స్వరకల్పనలో వేటూరి, గోపి గీతాలు రాశారు. ఎం. వి. రఘు ఛాయ, తోట యాదు శిల్పం. ధనుష్ నృత్యాలు, వి. ఎస్. వి. నరసింహారావు నిర్వహణ, నాయని మహేశ్వరరావు కూర్పుతో బత్తుల వెంకటనారాయణ సమర్పించే ఈ చిత్రానికి స్క్రీన్‌ప్లే, దర్శకత్వం: విజయబాపినీడు.

## విజయలక్ష్మి ఆర్ట్ మూవీస్ "దొంగ" శతదినోత్సవం

"ఈ నూర్రోజుల పండుగ భారీ చిత్రాలు రూపొందించేవారికి నూతనోత్సాహం ఇస్తోంది. మార్కెట్‌లో అప్పుడప్పుడు స్లమ్ రావడం సహజమే. కొనుగోలుదారులు ఒక్కొక్కప్పుడు ముందుకు రాకపోవచ్చు. అంతమాత్రాన నిరుత్సాహ పడనక్కర్లేదు. వాళ్ళు వస్తుంటారు పోతుంటారు. చిత్ర పరిశ్రమ ఎక్కడికీ పోదు. విజయాలను చవిచూస్తున్న హీరో చిరంజీవిని, డైరెక్టర్ ఎ. కోదండరామిరెడ్డిని, క్రమశిక్షణకు మారు పేరైన నిర్మాత టి. త్రివిక్రమరావును మనసారా అభినందిస్తున్నాను." అన్నారు పై చిత్రం శతదినోత్సవ సందర్భంలో దాసరి నారాయణరావు. ఈ వేడుకలకు డైరెక్టర్ కె. రాఘవేంద్రరావు ముఖ్య అతిథిగా విచ్చేశారు. ఈయన సాంకేతిక నిపుణులకు, శ్రీదేవి నటీనటులకు మెమెంటోలు అందజేశారు. చక్రవర్తి స్వాగత వచనాలు పలికిన అనంతరం

"కల్యాణ తిలకం"లో జయసుధ





"జయం

"మనదే"లో కృష్ణ, శ్రీదేవి

పరుచూరి సోదరులు, రావుగోపాలరావు ఈ చిత్ర విజయానికి కారణాలను విశదీకరించారు. విజయలక్ష్మి ఆర్ట్ మూవీస్ సిబ్బందికి నిర్మాత రెండు నెలల బోనస్‌ను ప్రకటించారు. వివరణ వ్యాఖ్యాత ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం వందన సమర్పణ చేశారు.

## "పులి" లో సలహా

రాధ (రాధ) వద్దకు లక్ష్మి (సంయుక్త) పరుగున వచ్చింది. "రాధా! నీకో శుభ వార్త చెబుతాను. నాకేమిస్తావ్?"

"సరిగా చెప్పకపోతే నెత్తి మీద ఒకటిస్తాను." అంది రాధ ముసి ముసి నవ్వులతో.

"అది తర్వాత ఇప్పుడుగాని ముందు విను ... నువ్వు నాకు వదినమ్మవు కాబోతున్నావ్. నీకు ఒక సలహా ఇస్తా ... మా అన్నయ్య మనస్సు ఎంత స్వచ్ఛమైందో – అతను ఉండే ఇల్లు, అతని పద్ధతి, అలవాట్లు అంత భయంకరంగా ఉంటాయి. అడవిలో సింహంలాంటి మా అన్నయ్యను పూర్తిగా మార్చి దారిలో పెడితే, నీకు ఫ్లవర్స్ విన్స్ గృహిణి అవార్డు వచ్చే అవకాశం ఉంటుంది."

"చూస్తూ ఉండవే – మీ అన్నయ్యను, మీ అన్నయ్య ఉండే ఇంటిని ఎలా మార్చేస్తానో!"

లక్ష్మి ముఖం ప్రకాశవంతమైంది. "విష్ యు విన్స్ ఆఫ్ లక్!" అంటూ తుర్రుమంది.

చిరంజీవి హీరోగా రాజ్‌భరత్ దర్శకత్వంలో ఆనం గోపాలకృష్ణారెడ్డి నిర్మించిన శ్రీ వెంకటకృష్ణా ఫిలిమ్స్ "పులి" చిత్రం జూలైలో విడుదల.

## వల్లభనేని జనార్ధన్ దర్శకత్వంలో "చిరుతపులి"

"సైంటిఫిక్ సస్పెన్స్ థ్రిల్లర్...ఆగస్టు 15 నుంచి సెప్టెంబరు 15 వరకు నాగార్జునసాగర్, శ్రీశైలం ప్రాంతాలలో ఒకే షెడ్యూల్లో షూటింగ్ ముగుస్తుంది. భానుప్రియ, స్మితతో పాటు ఒక యువ హీరో, 'పారిపోయిన ఖైదీలు' చిత్రంలోని నలుగురు ఖైదీలు నటిస్తారు," అన్నారు వల్లభనేని జనార్ధన్. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ఆలపాటి నాగేశ్వరరావు, రాయపాటి నాగేశ్వరరావు నిర్మించే "చిరుతపులి" చిత్రానికి జూలై 6 న తొలి గీతం ధ్వని ముద్రితమైంది. కృష్ణచక్ర సంగీతం, నవకాంత్ ఛాయతో కొసరాజు రాజేంద్రబాబు నిర్మాణ సారథి.

## సంగీత కళాశాల ప్రిన్సిపాల్‌గా డాక్టర్ భానుమతీ రామకృష్ణ

బహుముఖ ప్రజ్ఞావంతురాలు పద్మశ్రీ భానుమతి రామకృష్ణను మద్రాసులోని ప్రభుత్వ సంగీత కళాశాల ప్రిన్సిపాల్‌గా తమిళనాడు ప్రభుత్వం నియమించింది. మూడు సంవత్సరాలపాటు ఈమె ఈ పదవిలో ఉంటారు.

ఇంగ్లీషు సినిమాని కాపీ కొట్టే బదులు ఎట్లాగో అట్లా దాన్నే "డబ్" చేసి విడుదల చేస్తే పోలా?





"ఉదయం"లో రజని

## విఖ్యాత దర్శకుడు పుట్టన్న అస్తమయం

నేను ఈవేళ ఉంటాను రేపు పోతాను కాని నా చిత్రాలు నాలుగు కాలాలపాటు ప్రజలకు గుర్తుండాలి అప్పుడే నా జన్మ దన్యమవుతుంది. అనే ఎస్ ఆర్ పుట్టన్న కనగాల్ జూన్ 5 న తన 52 వ ఏట హృద్రోగంతో నిదనులయ్యారు కన్నడ సినిమా రంగంలో కొత్త పుంతలు తొక్కి కొత్త మలుపు తిప్పిన ఈ కళా తపస్వి కన్నడంలోనే కాక తెలుగు, తమిళ, మలయాళ, హిందీ బాషల్లో కూడా తన పేరు శాశ్వతంగా నిలిచిపోయేంతటి ఉత్కృష్టమైన చిత్రాలను అందించారు తెలుగులో పక్కిలో బల్లెం పాలమనసులు ఇద్దరమ్మాయిలు చిత్రాలకు ప్రతిబావంతంగా దర్శకత్వం నెఱపారు ఈయన కన్నడంలో రూపొందించిన చిత్రాల తెలుగు పరివర్తనం కృష్ణవేణి (శరపంజర) కల్యాణ మండపం (గజ్జెపూజె) కోడెనాగు (నాగరహావు) మన ఊరి పాండవులు (పడువార హళ్ళియ పాండవరు) అమాయక చక్రవర్తి (మానస సరోవర) ఇంకా కన్నడంలో రంగనాయకి హణ్ణెలె చిగురిదాగ, బిళిహెండ్తి ఎడకల్లు గుడ్డదమేలె తమిళంలో టీచరమ్మ హిందీలో జహ్రీలా ఇన్సాన్ చిత్రాల ద్వారా ఎన్నో అవార్డులు అందుకున్నారు మూడు కథానికలతో కథా సంగమ్ ను రూపొందించిన ఘనత ఈయనదే జ్ఞానపీఠ బహుమతి పొందిన మాస్తి వెంకటేశ అయ్యంగార్ విరచిత చిక్క వీర రాజేంద్ర నవలను తెర కెక్కించడానికి సన్నాహాలు చేస్తూ తుది నిశ్వాస వదిలిన పుట్టన్నకు భార్య ముగ్గురు కుమార్తెలు ఇద్దరు కుమారులు ఉన్నారు

## "ముగ్గురు మిత్రులు"లో ముచ్చటైన దంపతులు

పడక గది చక్రవర్తి (శోభన్‌బాబు) నిరీక్షిస్తుండగా గీత (సుహాసిని) గ్లాసుతో ప్రవేశించింది పాలు తీసుకోండి అంది మృదువుగా

ఊఁ హుఁ, అన్నాడు చక్రవర్తి

వేడిగా ఉన్నాయి తీసుకోండి అంటూ దగ్గరగా కూర్చుని, అవునూ- మీరు రంజిత్‌గారిని వీరాంజనేయుడని ఎందుకు పిలుస్తారు? అడిగింది గీత

ఎందుకంటె మా వాడికి చిన్నప్పటి నుండి ఆంజనేయస్వామంటే భక్తి ఎక్కువ

అంటె – మీరంత సన్నిహితంగా ఉంటారా?

మామూలు సన్నిహితం కాదు వాడి మొదటి

## సినిమా

రాత్రి కబుర్లు కూడా నాకూ ప్రకాష్‌గాడికి చెప్పాడు, అన్నాడు చక్రవర్తి నవ్వుతూ

గీత తెల్లబోయింది అయ్యో కర్మ అంటే – మీ అనుభవాలు కూడా అలాగె మీ ఫ్రెండ్స్‌కి చెప్తారేంటి?

ఎందుకు చెప్పనూ వాడు నాకు చెప్పలా? నేనూ అలాగే చెప్తాను అ ( అంటూ గీతను దగ్గరికి తీసుకున్నాడు చక్రవర్తి

అయ్యో! వదలండి, అంటూ గీత వదిలించుకుని తుర్రుమంది

మురళీమోహన్ సమర్పించే జయభేరీ ఆర్ట్స్ ప్రొడక్షన్స్ ముగ్గురు మిత్రులు చిత్రాన్ని రాజాచంద్ర దర్శకత్వంలో మాగంటి వెంకటేశ్వరరావు నిర్మించారు నిర్వహణ కిశోర్ జూలై విడుదల



"ఇల్లాలికో పరీక్ష"లో అనూరాధ

ఆగస్టు 1 నుంచి హైదరాబాద్‌లో గాని విశాఖపట్టణంలో గాని షూటింగ్ ఉంటుంది అన్నారు వాసు ఈయన స్వీయ దర్శకత్వంలో నిర్మించె వినోదాత్మక చిత్రానిక ఈయన తండ్రి క ప్రత్యగాత్మ చక్కని కథను సమకూర్చారు సత్యానంద్ సంబాషణలకర్త చక్రవర్తి సంగీత దర్శకుడు

## డైరెక్టర్ తాతినేని ప్రసాద్ చిత్రాలు

మనకున్న ప్రతిబావంతులైన యువ దర్శకులలో తాతినేని ప్రసాద్ ఒకరు ఇల్లాలే దేవత ఇల్లాలికో పరీక్ష అనంతరం ఈయన దర్శకత్వంలో ఆగస్టు 1 న ప్రారంబమ్మై సెప్టెంబర్ మాసాంతానికి షూటింగ్ పూర్తి చేసుకునే ద్వారకానాద్‌బాబు నిర్మించె చిత్రంలో మోహన్‌బాబు హీరో ఎ ఆర్ ఆర్ ఎక్చర్స్ తదుపరి చిత్రం షూటింగ్ అక్టోబర్, నవంబర్ మాసాలలో జరుగుతుంది డిసెంబర్‌లో సి ఆర్ ఆర్ ప్రసాద్ ఎ కె ఆర్ ప్రసాద్ శుబ ముహూర్తం తర్వాత నిర్మించే సత్యశక్తి పిక్చర్స్ చిత్రం రామాయణంలో బాగవతం థర్వాత రజని, సరోజిని నిర్మించె లక్ష్మిదుర్గాసంస్థ నిర్మించే చిత్రం – ప్రారంబమవుతాయి

## కొత్త సంస్థ, కొత్త దర్శకునితో "మేనమామ"

జగ్గరాజా వద్ద డైరెక్షన్‌లో అనుబవం గడించిన పాండ్యరాజా కథ సమకూర్చి తొలిసారిగా దర్శకత్వం నెఱపిన 'కన్నెరాశి అనే హాస్యరస ప్రదాన తమిళ చిత్రం విజయవంతమ్మైంది ఆయన దర్శకత్వంలోనే

ఆ కథను తెలుగులో తీస్తున్నాం మద్రాసులో జూన్ 28 నుండి జూలై 12 వరకు, విశాఖపట్నంలో జూలై 25 నుండి ఆగస్టు 20 వరకు షూటింగ్ జరుగుతుంది, అన్నారు వాణజ్యవేత్త జి సాంబశివరావు ఈయన శివకృష్ణా మూవీస్ పతాకంలో నిర్మించే మేనమామ చిత్రంలో శుబాకర్, గొల్లపూడి మారుతీరావు, వేలు, వీరబద్రరావు,

శ్రీలక్ష్మి నిర్మల, నాయికగా ఓ నవనటి పాల్గొంటారు గణేష్ పాత్రో మాటలు ఇళయరాజా సంగీతం, అశోక్‌కుమార్ చాయ, కుదరవల్లి నాగేశ్వరరావు శిల్పం టి కృష్ణసుందరావు నిర్మాణత, ఓం ప్రకాష్ నిర్వహణతో మోహనరాం సమర్పిస్తారీ చిత్రాన్ని



ప్రఖ్యాత గాయని రావు బాలసరస్వతిదేవిని విజయవాడలో శ్రీ యిడ్పుగంటి లక్ష్మణరావు దంపతులు, పార్లమెంటు సభ్యుడు శ్రీ వడ్డె శోబనాద్రీశ్వరరావు ద్వారా సత్కరించినప్పటి చిత్రం



"ఫిలిమ్ స్టార్"లో రాధిక

## షూటింగ్ పూర్తయిన "ఎర్రమట్టి"

ఇది సినాదాల చిత్రం కాదు ఈ చిత్రకథలో సిద్ధాంతాలు చెప్పడం అనేది లేదు దృశ్యప్రధానమైన చిత్రం ఇందులో పాత్రలే కనిపిస్తాయి ఈ చిత్రంలోని పాటలన్ని నైట్ ఎఫెక్ట్స్‌తో తీశాం క్లయిమాక్స్ జతపడి ఉన్న 18 నిమిషాల వీధి భాగవతం ఈ చిత్రంలో విశేషాకర్షణ. అన్నారు మాదాల రంగారావు ఈయన ప్రధాన పాత్ర నిర్వహిస్తూ కథ సమకూర్చి నిర్మాణ సారథ్యం వహించే నవతరం ఎక్చర్స్ ఎర్రమట్టి చిత్రంలో రూప నాయిక పార్థసారధి సంగీతం ఆర్ రామారావు, ఛాయ హనుమంతరావు శిల్పం చౌదుల సుబ్బారావు కూర్పుతో దవళ సత్యం దర్శకుడు

## రాఘవేంద్రరావు, చిరంజీవి కాంబినేషన్‌లో షూటింగ్ పూర్తయిన "అడవి దొంగ"

వినూత్నమైన అంశాలు గల కథలతో వైవిధ్యమున్న కథనంతో తనకంటూ ప్రత్యేకమైన బాణీలో చిత్రీకరణ జరుపుతాయి గనుకే కె రాఘవేంద్రరావు చిత్రాలు వెండి తెరమీద విజయవిహారం చేస్తాయి ఈయన దర్శకత్వంలో మెట్రో ఐడల్ చిరంజీవి హీరోగా చలసాని గోపి నిర్మించిన గోపి ఆర్ట్స్ మూవీస్ అడవి దొంగ షూటింగ్ పూర్తయింది రాధ నాయిక రావుగోపాలరావు అన్నపూర్ణ అల్లు రామలింగయ్య ఆదిగాగల వారు ఇతర ముఖ్య భూమికలు నిర్వహించారు చక్రవర్తి సంగీతం కె ఎస్ ప్రకాష్ ఛాయ భాస్కరరాజు శిల్పం సలీం నృత్యాలు ఎస్ వెంకటరత్నం కూర్పు తెర వెనుక హంగులు □

మీరు పెట్టిన డబ్బు నీటిలో
కొట్టుకు పోవడం లేదు కదా?



# జై కిసాన్ సామ్రాట్ నీటిలో కొట్టుకుపోదు ఎరువులోని ప్రతి అణువూ మొక్కలకు అందుతుంది



జైకిసాన్ సామ్రాట్‌లోని నత్రజని అంతా అమోనియా రూపంలో వుండటం చేత ఎరువు కొట్టుకుపోయే ప్రమాదం లేదు. 18 శాతం నత్రజని, 46 శాతం ఫాస్ఫేటుతో సమృద్ధమైన జైకిసాన్ సామ్రాట్ మొక్క వేళ్లు బలంగా పెరిగేలా చేస్తుంది, మొక్క వేగంగా ఎదిగేలా చేస్తుంది. వర్షాధార పంటలకు ఇది అతి ఉత్తమమైన ఎరువు.

ప్రతి నేలకూ, ప్రతి పంటకూ అనువైన ఈ ఎరువు పప్పులు, నూనెగింజలు, వాణిజ్య పంటలు, తోట పంటలకు ఎంతో ఉత్తమమైనది.

భూమిని హెచ్చు సారవంతం చేయడానికి ఇందులో కాల్షియమ్, మెగ్నీషియమ్, గంధక తత్వాలు కూడా ఉన్నాయి.

మీ కష్టార్జితాన్ని సరైన ఎరువు మీద ఖర్చు పెట్టండి. జైకిసాన్ సామ్రాట్ తెచ్చుకొని పొలంలో బంగారం పండించండి!

---

సరైన సంతులిత ఎరువులు వాడితే అత్యధిక లాభాలు చేకూరుతాయి. జువారి వారి ఉచిత భూసార పరీక్ష సేవను వినియోగించుకొని ప్రయోజనం పొందండి.

---







## జై కిసాన్ రాజ్యం – ధాన్యలక్ష్మి సామ్రాజ్యం

జువారి అగ్రో కెమికల్స్ లిమిటెడ్, గోవా.

ప్రాంతీయ విక్రయ కార్యాలయాలు. సికింద్రాబాద్, విజయవాడ, బెంగుళూరు, హుబ్లి, నాగ్‌పూర్, పుణె, ఇందోర్, ఆగ్రా, జువారినగర్.

LINTAS ZUA 134 2317 TL

ANDHRA BHOOMI

# "నిజం నిలకడమీద తేలుతుంది !" సుమన్

"న్యాయం మీరే చెప్పాలి చిత్రంలో ప్రశంసనీయంగా నటించాడు సుమన్ దుష్ట శిక్షణ శిష్ట రక్షణకు కంకణం కట్టుకున్న పోలీస్ ఇన్‌స్పెక్టర్‌గా నేటి భారతం చిత్రంలో అద్వితీయంగా నటించి, బిజీ హీరోల జాబితాలో చేరిపోయాడు ప్రముఖ సంస్థలు నిర్మించే చిత్రాలలో 1987 వరకు బుక్ అయ్యాడు అతని అభ్యున్నతిని చూసి ఏ దుష్టశక్తో ఓర్వలేక పోయింది, అని సుమన్ అభిమానులలో ఒకరైన కుమారి వి పద్మ (తిరుపతి) అనడంలో అసహజమేమీ లేదనిపించవచ్చు కొందరికి

మే 19 వేకువఝామున కొందరు పోలీసు అధికారులు మద్రాసు సి ఐ టి నగర్‌లో ఉన్న సుమన్ బంగళాకు హఠాత్తుగా వచ్చారు మీ ఇంట్లో నాటు బాంబు ఉంచబడినట్లు మాకు వర్తమానం అందింది సోదా చెయడానికి వచ్చాం అన్నారు వాళ్ళు గాలించి, సుమన్ గదిలోని కొన్ని ఆంగ్ల, తెలుగు సినిమా విడియో కేసెట్లు వశపరచుకున్నారట ఆ తర్వాత సుమన్‌ను రిమాండ్‌లోకి తీసుకున్నారు

ఏమిటీ విపరీతం! అని ఎందరో విభ్రాంతులయ్యారు

అంతకు మూడు మాసాల క్రితం ఒక వాణిజ్యవేత్త కుమార్తె అదృశ్యమైంది ఆ యువతి దివాకర్ అనే విడియో షాపు యజమాని వద్ద ఉన్నట్లు పోలీసులకు తెలిసింది మహాబలిపురంలో ఒక హోటల్లో ఉన్న ఆ యువతిని పోలీసులు కనుగొని, ఆమె తండ్రికి అప్పగించి, దివాకర్‌ను ఖైదు చేశారు తను సుమన్ ప్రోత్సాహంతోనే యువతులను మోసగించి, బ్లూ ఫిల్ముల వలయంలో చిక్కుకున్నట్లు దివాకర్ వాంగ్మూలమిచ్చాడు

అదంతా అబద్ధం నాలుగేళ్ళ క్రితమే మా స్నేహం చెడిపోయింది అన్నాడు సుమన్ కాని, ఫలితం లేకపోయింది

మే 19న తమిళనాడు గూండా నిరోధక చట్టం కింద సుమన్ ఖైదు చేయబడినప్పట్నుంచి కొన్ని పత్రికలలో బ్లూ ఫిల్ముల వ్యవహారం, అంటూ కొన్ని వార్తలు వెలువడ్డాయి ఆ తర్వాత సుమన్ యువతులను మోసగించి వారికి మత్తు మందు ఇచ్చి నగ్నంగా ఫోటోలు తీసి అత్యాచారాలకు పాల్పడ్డాడు లాంటి వార్తలు వెలువడి, పలు సందేహాలకు ఆస్కారమయ్యాయి

## ఆరోపణలు

సైదాపేటకు చెందిన లక్ష్మి (17), కోడంబాకంలో నివసించే మీనా (21), పల్లావరం వాస్తవ్యురాలు షీలా(18)–ఈ ముగ్గురూ సుమన్ తమను మోసగించి, మానభంగం చేసి, నగ్నంగా ఫోటోలు తీసినట్లు ఫిర్యాదులు చేశారని పోలీసుల ఆరోపణ

లక్ష్మి ఏప్రిల్ 20 సాయంత్రం ఏడు గంటల ప్రాంతంలో కోడంబాకం పవర్ హౌస్ ఎదురుగా బస్‌స్టాండ్ వద్ద నిలుచోని ఉండగా– షూటింగ్ నుంచి తిరిగొస్తున్న సుమన్ కొన్ని అడుగుల దూరంలో కారును ఆపాడట కారు నుంచి దిగి సిగరెట్ పీలుస్తూ లక్ష్మి వంక అదే పనిగా చూస్తూండి పోయాడట మెల్లగా దగ్గరికి వెళ్ళి 'ఎక్కడికెళ్ళాలి? లిఫ్ట్ ఇవ్వనా? అని అడిగాడట సుమన్‌ను ఆమె సినిమా హీరోగా గుర్తుపట్టి అతని ద్వారా తను సినిమా నటి కాగలదనే ఆశాభావంతో అతని కారులో కూర్చుందట ఆమెను సుమన్ తన ఇంటికి తీసుకెళ్ళి ఏదో కూల్ డ్రింక్ ఇచ్చాడట ఆ తర్వాత ఏం జరిగిందో తనకు తెలీదట స్పృహ వచ్చేసరికి తను పడక మీద నగ్నంగా పడుండడం దిగ్భ్రాంతి కలిగించిందట తన మానం హరింపబడినట్లు గుర్తించిందట మే 10న సుమన్‌ను ఆమె కలుసుకుంటే, పెళ్ళి మాట్లాడినీ–లేకపోతే ఆమె నగ్న చిత్రాలను ప్రచురించేలా చేస్తానని అన్నాడట ఈ ఫిర్యాదు మే 15న సైదాపేట పోలీస్‌స్టేషన్‌లో నమోదు చేయబడింది

మీనా ఆమె చెల్లెలు అనిత ఏప్రిల్ 21 సాయంత్రం ఏడు గంటలప్పుడు బెసెంట్ నగర్‌లోని అష్టలక్ష్మి కోవెల వద్ద సుమన్‌ను చూశారట వాళ్ళను పరిచయం చేసుకున్నాక తన కారులో లిఫ్ట్ ఇస్తానని కె కె నగర్‌లో ఒక నిర్జన ప్రదేశం వద్దకు తీసుకెళ్ళి కారు ఆపాడట మీనా గొంతుమీద చెయ్యి వేసి, ఆమె చెల్లెలు తను చెప్పినట్లు వినకపోతే గొంతు నులిమి వేస్తానని బెదిరించాడట మీనాను వివస్త్రను చేసి అత్యాచారం చేశాక ఆమెను నగ్నంగా ఫోటోలు తీశాడట మే 14న ఈ ఫిర్యాదు కుమార నగర్ పోలీస్ స్టేషన్‌లో రికార్డయింది

పేద కుటుంబానికి చెందిన వనిత షీలా అగరవత్తులు సబ్బు బిళ్ళలు విక్రయించే సేల్స్‌గర్ల్ ఈమె కూడా సుమన్ మీద రిపోర్ట్ చేసినట్లు మే 17న సైదాపేట పోలీస్ స్టేషన్‌లో



"సుమన్"

రిజిస్టరైంది

## సుమన్ గురించి నిర్మాతలు

నిర్మాతలతో ఎంతగానో సహకరించే సహృదయుడు సుమన్ వినయ విధేయతలు గల విద్యాధికుడు నొప్పింపక తానొవ్వక మసలుకునే సద్గుణవంతుడు అన్యాయంగా సుమన్ పై లేనిపోని నేరాలు మోపబడ్డాయి, అంటారు నిర్మాతలలో సుమన్‌కు అత్యంత ఆప్తుడైన సారథి

దాదాపు ఆరు లక్షలు పిక్చర్‌కు తీసుకునే సుమన్ బస్‌స్టాప్‌ల వద్ద, రోడ్లలో తిరిగే అమ్మాయిల వెంట బడడమనేది నమ్మ శక్యం కాని విషయం, అన్నారు నిర్మాత జి జగదీశ్ చంద్రప్రసాద్

ఎందుకో ఇవన్నీ సుమన్ మీద బనాయింపబడిన కేసులని ఇట్టే తెలిసిపోతోంది సుమన్ తనపై అత్యాచారం చేశాడని ఒక యువతి కంప్లయింట్‌లో పేర్కొన్న సమయానికి సుమన్ మా చిత్రం షూటింగ్‌లో పాల్గొంటున్నాడు, అన్నారు నిర్మాత ప్రసాద్

## "సుమన్ అమాయకుడు" తల్లి ఆక్రందన

ఇదంతా ఏదో కుట్ర మా సుమన్ అన్నెం

పున్నెం ఎరుగని అమాయకుడు దైవచింత, పాపభీతి గలవాడు అన్యాయంగా లేనిపోనివి ఆరోపింప బడ్డాయి' అని సుమన్ తల్లి, యతిరాజ్ కాలేజ్ ప్రిన్సిపాల్ శ్రీమతి కేసరి చంద్రన్ మొరపెట్టుకుంది (ఈమె సుమన్ పెంపుడు తల్లి అని పోలీసువారికి ఇటీవల తెలిసిందట)

## "ఇదెక్కడి న్యాయం?"

## ఒక న్యాయ శాస్త్ర నిపుణుని అభిప్రాయం

'ఎవరో ముగ్గురు యువతులు చేశారన్న ఫిర్యాదుతో తయారు చేయబడ్డ ఎఫ్ ఐ ఆర్ ఆధారంగా దొంగసారా విక్రయం, రౌడీయిజం, అవినీతి వగైరా నేరాలమీద కస్టడీలోకి తీసుకునే గూండా నిరోధక చట్టం కింద సుమన్‌కు ఏడాది శిక్ష పడడమేమిటి? దారుణంగా ఉంది అని ఒక న్యాయశాస్త్రజ్ఞుడు అన్నారు

## "నేను నిర్దోషిని" సుమన్

సినిమాలలో చేరాలని ఉబలాటపడే యువతులకు ఆ వ్యామోహాన్ని వదులుకోమని సలహా ఇచ్చే నా మీద, సెట్‌లో తోటి నటీమణుల పట్ల ఎంతో గౌరవంగా ప్రవర్తించే నా మీద ఇన్ని అబాండాలా? నేను నిర్దోషినన్న నిజం ఏనాటికైనా తెలియక తప్పదు అన్యాయాన్ని న్యాయం జయించి తీరుతుంది నా మీద అన్యాయంగా మోపబడిన ఈ ఆరోపణల విషవలయంలోంచి త్వరలోనే బయటపడి తీరుతాను

తాను నిర్దోషినంటూ, తనను విడుదల చేయాలని విజ్ఞప్తి చేస్తూ సుమన్ మద్రాసు హైకోర్టులో 'హెబియస్ కార్పస్ రిట్'ను దాఖలు చేశాడు

## "సుమన్ నిరపరాధి"

## సుమన్ తరఫు న్యాయవాది

సుమన్ ముమ్మాటికీ నిరపరాధి ఆయన్ని జైలులో కలుసుకుని వివరాలు తెలుసుకున్న తర్వాత నాకు తేలింది ఒక్కటే- సుమన్ మీద అన్యాయంగా ఈ ఆరోపణలు జరిగాయి ఆ నమ్మకం కలిగాకే సుమన్ తరఫున వాదించడానికి అంగీకరించాను, అన్నారు సుమన్ తరఫున నియమితులైన ప్రముఖ న్యాయవాది జి రామస్వామి

ఈ కేసు అనూహ్యమైన మలుపులు తిరిగి, నిరపరాధిగా సుమన్ నిరూపించబడే రోజు అట్టే దూరంలో లేదని పలువురి విశ్వాసం

—జి.వి.జి.



"మాయదారి మరిది"లో సుమన్, మహాలక్ష్మి

సీరియల్

# మనసూ మెరిసింది

## కళ్యాణీ శ్యామరాజ్

(గత సంచిక తరువాయి)

**జరిగిన కథ :–5** కట్నం ప్రసక్తి లేకుండా మూర్తి, రమ రిజిష్టర్ మేరేజి చేసుకుంటారు రమని వెంట పెట్టుకొని వచ్చిన మూర్తిని తల్లి తండ్రి తూలనాడినా పెద్దన్న, వదిన సీత ఆదరిస్తారు రమని చూడటానికని వచ్చిన మూర్తి పెద్దక్కయ్య, చిన్నక్కయ్య రమని ఈటిలలాంటి మాటలతో బాధిస్తారు మర్నాడు మూర్తి చేత, రమ చేత సత్యన్నారాయణ వ్రతం చేయించి, ఆ పీటల మీదే మూర్తి చేత రమకి 'మూడుముళ్ళు' వేయించారు రమని తీసుకుని మూర్తి తన చిన్నన్నయ్య విశ్వనాథ్ ఇంటికి విజయవాడ వెళుతాడు విశ్వనాథ్ యశోద వీరిని చూడగానే ఎంతో ఆనందపడిపోతారు మూర్తి అన్న కూతురు సుమతి రమేష్ అనే అతన్ని ప్రేమిస్తుంది సుమతి వల్ల రమకి తమింటి స్థితిగతులు తెలుస్తాయి మూర్తి చెల్లెలు ప్రసూనకి, సుమతికి సంబంధాలు నిశ్చయమవుతాయి సుమతి ఇంట్లోంచి వెళ్ళిపోతుంది రమే సుమతిని రమేష్ దగ్గరకి పంపించి వుంటుందని ఇంటిల్లిపాదీ అనుమానిస్తారు సుమతి రమేష్‌ని పెళ్ళి చేసుకుంది రమ వేలు విడిచిన మేనత్త సహాయంతో గుంటూరులో ఉద్యోగం సంపాదించుకుంది మూర్తి ఒకసారి వచ్చి వెళతాడు

10

రమ గుంటూరు వచ్చి రెండు నెలలు గడిచాయి మూర్తి ఎప్పటిలా శనివారం సాయంకాలం వచ్చి ఆదివారం సాయంకాలమే వెళ్ళిపోయేవాడు రమ మూర్తి వచ్చి వెళ్ళిన మరుక్షణం నుంచి రాబోయే శనివారం కోసం ఎదురు చూస్తూ గడిపేస్తుంది ఒకసారి స్కూల్లో ఎక్కువ పని వుంది, చాలా చీకటి పడ్డాక ఒక్కతే నడచి వస్తోంది ఇంతలో కారు ఒకటి సర్రున దూసుకుంటూ కొంచెం ముందరకు పోయి, మళ్ళీ వెనక్కి వచ్చి రమ పక్కనే నిలచింది అందులోంచి ఖరీదైన చీర, మెడలో నగలతో సుమతి దిగింది

పిన్నీ' అంటూ సుమతి రమను చుట్టేసింది

సుమతీ' నువ్వా, నేను గమనించలేదు చాలా మారావ్'

ఔనేమో' జీవితంలో కూడ మార్పు కలిగింది కదా'

నాకు మాత్రం నిన్ను చూస్తుంటే చాలా తృప్తిగా వుంది

నీ ఆశీర్వాదం నాకెప్పుడు వుంటుందని తెలుసు పిన్ని రా పిన్ని కార్లో కూర్చుందాం ఇంటి అడ్రస్ చెబితే, వెళదాం రమ ఇంటి వైపు వెళ్ళే గుర్తులు చెప్పింది

పిన్ని' నే చేసిన పని నీ జీవితాన్ని ధ్వంసం చేసింది నిన్నిలా చూస్తుంటే నాకు చాలా సిగ్గుగా వుంది

ఫరవాలేదు సుమతీ' ఏది ఎలా వ్రాసుంటే అది అలా జరుగుతుంది మనం నిమిత్త మాత్రులం

నీ అంత తేలిగ్గా ఎవ్వరూ తీసుకోలేరు పిన్ని నీ విషయం విన్నాక వుండబట్టలేక ఒకసారి మన ఇంటికి వెళ్ళాను గుమ్మంలోనే నిలబెట్టి అంతా నానా మాటలని పంపారు నేను చెప్పేది ఎవ్వరు విన్పించుకోలేదు

అదేనమ్మా' ఆ ఇంట్లో మనుషుల్లో వున్న పెద్ద బలహీనత సరే ఆ విషయాలు వదిలెయ్యి నీ సంగతి చెప్పు

నేను బి కాం లో చేరాను పిన్ని తను ప్రస్తుతం వాళ్ళ నాన్నగారి బిజినెస్ చూస్తున్నారు ఈ రోజు రాత్రి వాళ్ళ బంధువులమ్మాయి పెళ్ళి అంటే అంతా వచ్చాం నేను మా అత్తగారు ఏదో కొనుక్కు రమ్మంటే బజారుకి వచ్చాను

నిన్ను అంతా ప్రేమగా చూసుకుంటారా' కట్నం ఇవ్వలేదని చిన్నచూపు చూస్తారా'

లేదు పిన్ని అందరూ నన్ను చాలా ఆపేక్షగానే చూస్తారు మా అత్తగారు నన్ను ఏ పని చేయనివ్వరు ఏ వంట చేసినా నా దగ్గరుండి, ఏం సుమతీ' నీకు సయిస్తోందా' మీ ఇళ్ళల్లో ఎలా చేస్తారో చెప్పు అలాగే చేయిస్తాను అంటూ ఎంతో అభిమానంగా నా విషయాలు దగ్గరుండి మరీ కనుక్కుంటారు

అదృష్టవంతురాలివి

సుమతి చాలా సేపు కూర్చుని రమ చేసి ఇచ్చిన 'టీ' తాగి వెళ్ళింది వెళుతూ వెళుతూ తమ ఇంటి అడ్రస్ ఇచ్చి గట్టిగా రమ్మని చెప్పింది సుమతిని చూసాక రమ మనసెంతో తృప్తిగా పీల్చింది

★ ★ ★ ★ ★ ★

మరునాడు మూర్తి వచ్చినప్పుడు సుమతి విషయాలు చెప్పింది మూర్తి అన్నిటికి ఊ కొడుతూ వూరుకున్నాడు రమ ఉత్సాహం నీరు కారింది సుమతి సంసారం చేసుకుంటూ ఎంతో ఆనందంగా వుందంటే మూర్తికేమి సంతోషం కలిగించలేదా' అతను కూడ ఇంకా సాంప్రదాయం పాడైందని బాధపడుతున్నాడా'

మూర్తి ఆసారి చాలా ముభావంగా వున్నాడు రమ అతన్ని తరచి తరచి అడిగినా సరైనా సమాధానం అతని నుండి రాలేదు రమ మనస్సు చిన్నబోయింది తనే నిజంగా ఆత్మీయురాలైతే అతని బాధను తనతో పంచుకోడా' ఏదో మోజు కొద్ది వస్తున్నాడు కాని తన మీద నిజమైన ప్రేమ వుండి కాదు

మూర్తి మరునాడు ఉదయమే బయల్దేరి వెళ్ళిపోతుంటే ఆమె ముభావంగా వీడ్కోలు ఇచ్చింది

రంగనాయకి పని మనిషి చేత కబురు చేసింది రమను రమ్మని రమకక్కడ ఇంట్లో వుండాలంటే చాలా విసుగ్గా అన్పించింది ఎన్నాళ్ళిలా వంటరి బ్రతుకు ప్రేమించి పెళ్ళి చేసుకున్నారన్న మాటేకాని ఇద్దర్లో ఎవ్వరూ సుఖంగా లేరు తను ఇలాంటి జీవితాన్ని ఆశించా తల్లిదండ్రుల మాటలు లక్ష్యపెట్టకుండా పెళ్ళి చేసుకుంది వైవాహిక జీవితం గురించి ఎన్ని కలలు కంది? నిముషం కూడ శాంతి లేకుండా అయిపోయింది ఆఖరికి రమ ధ్యాసలో లేనట్లు నడుస్తూ రంగనాయకి ఇంటికి వెళ్ళింది

గుమ్మంలోనే ఎదురైయ్యాడు సుందరం

ఏం బావ ఎప్పుడొచ్చావ్?

నిన్న రాత్రి నువ్వేమిటి చాలా చిక్కిపోయావు

'నేను మొదటి నుంచి ఇంతేలె' నువ్వు మాత్రం రాను రాను గుండ్రం చామ

ముంపలా తయారౌతున్నావ్' అంది వెక్కిరిస్తూ
నిజమేనేమో! నా స్నేహితులు కూడా అదే అంటున్నారు
రమ వచ్చిందా! నువ్వు మూర్తి ఈ రోజు ఇక్కడే భోం చెయాలి మళ్ళ వంట ప్రయత్నం చెయక
మూర్తి పొద్దునే వెళ్ళిపోయాడు అంటీ!
అదేం
ఏమో ఏవో పనులున్నాయి కాబోలు
రంగనాయకి వంట చేస్తున్నంత సేపు సుందరం రమ వంటింట్లోనే కూర్చుని కబుర్లు చెప్పుకున్నారు రమ 'ఏదైనా సహాయం చెయనా అంటి అంటూ పని అందుకోబోయినా రంగనాయకి ఒప్పుకోలేదు అందరూ మధ్య మధ్య కాఫీలు, టీలు తాగుతూ వంట అయ్యేవరకు అక్కడే కూర్చున్నారు. సుందరం మాటలతోను, అతని జోక్స్‌తోను ముభావంగా వున్న రమ మనస్సు చాలా కొంచెం సేపట్లోనే, ఉత్సాహంగా మారింది
ఆ సాయంకాలం అందరూ కలసి దిస్నే హా లవ్‌డ్ మి కి వెళ్ళి వచ్చారు ఆ రాత్రి రంగనాయకి బలవంతం మీద అక్కడే వుండిపోయింది
సుందరం వచ్చాక రమని ఒక్క నిముషం ఊరికె వుండనిచ్చేవాడు కాదు. ఒక్కొక్కసారి రంగనాయకి ఏదో పని వుందని వాళ్ళిద్దర్నే పంపేది రమ అలాంటప్పుడు వెళ్ళటం ఇష్టం లేకపోయినా మొహమాటానికి వెళ్ళవలసి వచ్చేది మూర్తి ఆ శనివారం రాలేదు సుందరం వచ్చి సినిమాకి వెళదాం రమా!' అని అడిగాడు
రమకి మూర్తి రాలేదని చాలా చికాగ్గావుంది
సరె పద నాకు బోర్‌గానే వుంది అంటూ సుందరం వెంట బయలుదేరింది
సినిమా చూస్తున్నా ఆమె ధ్యాస మూర్తి మీదే వుంది
మూర్తి ఎందుకు రాలేదో! పోయినసారి వచ్చినప్పుడు కూడా అతడెంతో ముభావంగా వున్నాడు ఏం జరిగిందో అతన్ని బ్రతిమిలాడి ఈసారైనా అసలు విషయం రాబట్టాలి అనుకుంటూ అన్యమనస్కంగా సినిమా చూస్తున్నదల్లా సుందరం చెయి వచ్చి ఆమె చెతి మీద పడటంతో ఉలిక్కిపడి చెయి తీసెసుకుంది
రమా? నేనొకటి అడుగుతాను నిజం చెబుతావా' అన్నాడు సుందరం
అడుగు బావ
నీ మెరిడ్ లైఫ్ అంత హాపీగా లేదని విన్నాను
అత్తయ్య చెప్పిందా!

సగం మాత్రమే నిజం
అంటే
నేను, మూర్తి సంతోషంగానె వున్నాం ఎటొచ్చి మేము కలిసి లేము అంతే!
కలిసి బ్రతుకనప్పుడు ఇంక సంసారానికి అర్థం ఏముంది
రమ సమాధానం చెప్పలేదు
మూర్తి చాలా ఫూల్ అన్పిస్తోంది నాకు
రమ కోపంగా చూసింది సుందరం వంక
ఇంత అందమైన భార్యను వెసుకొని జీవితం అంతా వృధా చెసుకుంటున్నాడు
అంటే నీ వుద్దేశ్యం రమ కంఠం తీవ్రంగా విన్పించటం చూసి సుందరం సర్దుకొని-
అబ్బె మరేం లేదు రమా! అమ్మా నాన్న కోసం నిన్ను హింస పెట్టటం బాగలేదు
ఆ తరువాత సంభాషణ సినిమా మీదకు వెళ్ళింది రమకి మూర్తి రాలేదని చాలా కోపం వచ్చింది అతని మీద కోపంతో ఇంటికెళ్ళినా అన్నం తినకుండానె దుప్పటి ముసుగుపెట్టింది

★ ★ ★ ★ ★

రమ స్కూల్లో వుండగా మూర్తి దగ్గర కాంపౌండర్‌గా పని చేసె అతను,



రమను కలుసుకొని 'మూర్తిగారు ఇమ్మన్నారంటూ' ఒక చీటి ఇచ్చాడు.
నాన్నగారికి చాలా సీరియస్‌గా వుంది నేను రాపటంలేదు ఏమి అనుకోక అని వుంది అందులో
ఎప్పుడు ఇచ్చారు ఈ చీటీ
నిన్ననేనండి మీ ఇంటికి వస్తె ఇల్లు తాళం వెసి వుంది అందుకని ఈ రోజు స్కూల్లో కలుసుకోవచ్చని వచ్చాను
మీరు వుంటారా వెళ్ళిపోతారా!
మా అత్తగారు వూరు ఇదేనండి రెండు రోజులు శెలవు పెట్టి వచ్చాను అన్నాడు సిగ్గుపడుతూ
రమ అతన్ని పంపి, హెడ్ మిస్ట్రస్ నడిగి శెలవు తీసుకొని గబగబ ఇంటికొచ్చి నాలుగు చీరలు బ్యాగ్‌లో సర్దుకొని అత్తగారింటికి బయలుదేరింది
రమ వెళ్ళేసరికి ఇల్లంతా చాలా గంధరగోళంగా శోకాలతో విషాదంగా వుంది మామగారు రాత్రే పోయినట్లు, ఉదయం దహన సంస్కారాల కోసం శవాన్ని తీసుకెళ్ళిపోయినట్లు అక్కడ వాళ్ళ మాటల మధ్య తెలిసింది రమకేం

# ముసురు వెలిసింది

చెయాలో పాలుపోనట్లు నిలబడిపోయింది

ఎందుకో అటుగా వచ్చిన యశోద అదేమిట రమా! అలా నిలబడిపోయావేం రా లో పలికి అంటూ చెయి పట్టుకుని తీసుకెళ్ళింది

మూర్తి రమను చూచి ఆశ్చర్యం ప్రకటించాడు బర్తనెలా పలకరించాలో అతన్నెలా ఓదార్చాలో తెలియలేదు రమకి మూర్తి మొహం వాడి వుంది అతనికి తండ్రి చావు అంతకుముందు నుంచె తెలిసినప్పటికి ఒక్కసారి వాస్తవంలో ఆ సంఘటన అతని మనసును బాదపెట్టింది

రమ ఎవరితోను కల్పించుకుని మాట్లాడకపోయినా, ఆ పని ఈ పని నెత్తిన వేసుకొని మిగిలిన తోడి కోడళ్ళతో సమానంగా చెస్తూనే వుంది అత్తగార్ని ఒకసారి పలకరించి ఆవిడ ఒక్కసారి రమ మీద ఏడుస్తూ విరుచుకుపడేసరికి మళ్ళ ఆవిడున్న గదిలోకి కూడ తొంగి చూడలేదు

అయితే రమని అడబడుచులు వదలలేదు

ఏం గుంటూరులోనే వుంటున్నావుగా మా ఇంట వైపైనా తొంగి చూడలేవేం ఔన్లె అయినా ఎవర్నో వెంట వేసుకొని సినిమాకి షికార్లకి తిరగటానికి నీకు టైముంటుంది కాని మా ఇంటికి రావటానికెలా తీరుబడి అవుతుంది అంటూ కాంతం

ఏరి కోరి పెళ్ళిచెసుకొన్నావ్ మా వాడిని, పట్టుమని పదేళ్ళు కూడ కాకుండానే విడిపోవడం ఏమిటి? అంటూ రెండో ఆడబడుచు

ఈవిడగారు అడుగు పెట్టిన వేళా విశేషం అక్కయ్యా! సుమతి ఈవిడ పోరలతో మతి పోగొట్టుకొని ఎవడితోనో లేచిపోయింది చెట్టంత నాన్నగారు మనోవ్యాధితో తీసుకుని తీసుకుని పోయారు అంటూ ప్రసూన రమని అవకాశం దొరికినప్పుడల్లా శూలాల్లాంటి మాటలతో బాదించెవారు

మూర్తితో తన బాద వెళ్ళబోసుకుందామని వున్నా ఇంట్లో చుట్టాలు, తండ్రి కర్మకాండలతో అతను తీరుబడిగా దొరికేవాడు కాదు అక్కడికి ఒకసారి అతని ముందు తన బాదను బయటపెట్టింది

చూడు రమా! నిన్ను అందుకే ఇక్కడికి రమ్మని చెప్పలేదు నువ్వు ఉండగలిగితె వుండు లెకపోతె వెళ్ళిపో! అంతెగాని ఎలాటి రభసలు చేసి నలుగురిలో నువ్వు అల్లరిపాలు కాకు, నన్ను అల్లరి పెట్టకు అంటూ నిష్కర్షగా చెప్పాడు

అతని ఓదార్పు మండే ఆమె మనసులో మరింత ఆజ్యం పోసింది!!

ఆ రోజుతో కర్మకాండలు ముగిసాయి చుట్టాలంతా రేపు పదమూడో రోజు వుండకూడదంటూ ఎక్కడివాళ్ళక్కడ వెళ్ళిపోయారు రమ కూడా ప్రయాణం అయింది కాని యశోద రేపు వెళ్ళొచ్చులె అంటూ ఆపేసింది

అక్కా! ఇక ఈ ఇంటికి నేను రావటం ఇదే చివరిసారి ఇప్పుడైనా, నలుగురు ఏమనుకుంటారోనని వచ్చాను

రమా! నువ్వలా అంటంలో అర్థం లేకపోలేదు ఏం చెస్తాం వీళ్ళ సంస్కారం ఇంతె! అసలు మామగారిలా మనోవ్యాధితో మంచం ఎక్కటానికి అన్నిటికి ఆ మహాతల్లులే కారణం అంది యశోద

ఇద్దరూ పెరటిలో బాదం చెట్టు కింద మంచం వేసుకొని పడుకున్నారు భోజనాలు అయ్యేసరికి సాయంకాలం అయిదు అయింది అంతా తిని అలసటగా తలా ఒక చోట పడుకున్నారు యశోదకి, రమకి మనసు విప్పి కబుర్లు చెప్పుకునే ఏకాంతం, తీరిక అప్పుడు చిక్కాయి

రమ యశోద చేప్పేది అర్థంగానట్లు చూసింది

నిజం రమా! నేను కాపురానికొచ్చి పదిహేనేళ్ళు అవుతున్నాయి నాకీ ఇంట్లో అందరి మనస్తత్వాలు, పరిస్థితులు క్షుణ్ణంగా తెలుసు నా పెళ్ళికి ఎంత భోగభాగ్యాల్లో తేలుతున్నారో! నా కంటి ముందరే ఈ స్థితికి వచ్చారు

ఎందుకని అంత మార్పు రమ వుండబట్టలేక అడిగింది

ఈ సంసారం ఇలా అవటానికి మూల కారణం మన అత్తగారు ఆమెకు కూతుళ్ళ మీదున్న విపరీతపు ప్రేమ ఆఖరికి సంసారం పరిస్థితులు కూడా పట్టించుకోకుండా చేసింది ఇద్దరి కూతుళ్ళకు ఘనంగా కట్నాలు ఇచ్చి గొప్పగా పెళ్ళిళ్ళు చేసింది వాళ్ళ పురుళ్ళకు, పుణ్యాలకు వస్తుంటె చీరెలు సారెలు అంటూ ఎప్పుడు ఏదో ఖర్చే! మామగారి హయాంలోనే ఆస్తి సగం పోయింది ఆయన ఆ బాధ్యతను పెద్దకొడుకు మీద పడేసి భారం వదిలించుకున్నారు ఆయనకు తెలుసు భార్యను అదుపులో పెట్టలేనని ఖర్చులు తగ్గించలేనని మొట్టమొదటి నుంచి మీ చిన్న బావగారు ఆస్తిపాస్తులతోను, ఈ ఇంటి వ్యవహారాలతోను సంబంధం పెట్టుకోకుండానే వున్నారు ఇక కాశీపతి అటు బావగారి బాధ్యతలో పాలు పంచుకోక, ఇటు చదువుకొని, ఉద్యోగం సంపాదించుకోక, సంసారాన్ని పెంచుతూ, జల్సా ఖర్చులుచెస్తూ, డబ్బులు విచ్చలవిడిగా ఖర్చు పెడుతున్నాడు ఈ ఉమ్మడి సంసారంలో ఎవరి దారి వాళ్ళదే! ఇంటి పరిస్థితి ఇలా వుండగా, ఆ మధ్య రెండేళ్ళు తుపాన్ వచ్చి పంట తుడుచుకు పెట్టుకుపోయింది దాంతో మళ్ళీ అప్పులు మూర్తి వచ్చి ఇక్కడ ప్రాక్టీస్ పెట్టాక చీటికి మాటికి అప్పులు చేయటం తగ్గిందనే చెప్పాలి అయినా అసలు అప్పులు పెరుగుతూనే వున్నాయి

ఇంతలో ప్రసూన పెళ్ళి వచ్చింది కట్నం కాకుండా పెళ్ళి ఖర్చే పాతిక వెలైందిట బావగారు మాత్రం ఎక్కడి నుంచి తెస్తారు ఇల్లు తాకట్టు పెట్టి అప్పు చేసారుట ఇవన్ని అత్తగారికి తెలిసి కాబోలు ప్రసూన పెళ్ళిలోనే తన నగలు ముగ్గురు కూతుళ్ళకు పంచి ఇచ్చేసింది

ఇవన్నీ ఇలా వుండగా కాశీపతి మామగారు కూతురి ద్వారా అల్లుడి పరిస్థితి తెలుసుకొని ఇప్పుడే పంచుకుంటే ఆస్తి అప్పుల వాళ్ళ వాత పడకుండా వుంటుందనీ, తను చెస్తున్న బియ్యం వ్యాపారంలో అల్లుడికి వాటా ఇస్తాను మీ నాన్న నడిగి నీ ఆస్తి తెచ్చుకోమంటూ! కాశీపతిని పురికొల్పి పంపాడుట ఆయన కొడుకు అలాంటి క్లిష్ట సమయంలో భాగం పంచమంటూ రావటంతో మామగారికి బలమైన దెబ్బ తగిలింది దానికి తోడు మనమరాలు కులంకాని వాడిని పెళ్ళి చేసుకుందని అన్ని కలిసి వచ్చాయిలె!

కాని సుమతి హాయిగా తన కాపురం తను చెసుకుంటోంది '

ఔను రెండు, మూడు సార్లు వచ్చింది ఒకసారి వరలక్ష్మి వ్రతం చేసుకొని పేరంటానికి పిలిస్తే నేను వెళ్ళొచ్చాను వాళ్ళ అత్తగారు కూడ చాలా మంచి ఆవిడ వాళ్ళిల్లు, ఆ అట్టహాసం చూస్తుంటే సుమతి చాలా లక్కీ ఫెలో అనిపించింది నాకు మాత్రం

అక్కయ్యకి తెలిస్తె బాగుండును సుమతి సంగతి

నేనే ఒకసారి చెప్పాను నాకు ఏం చెప్పఖ్ఖర్లేదు దానికి, నాకు సంబందం లేదంటూనే అన్నీ వింది ఎంతైనా తల్లి ప్రాణం కదా!

ప్రసూన లాగా ఎంతో ఖర్చు పెట్టించి మరింత అప్పుల్లో ముంచితే వీళ్ళకు బాగుండేది

సరే ఇంతకీ అసలు విషయం చెప్పలేదు మొన్న పెద్ద వాళ్ళందరూ కూర్చుండగా ఆస్తి వ్యవహారాలు వచ్చాయి

ఇంకా పంచుకోటానికి ఆస్తి ఏముంది అక్కయ్యా!"

వున్నదే! అప్పులు ఎవరు తీర్చాలన్నది వచ్చిందిట కాశీపతి నాకు అప్పులకు ఏం సంబంధం లేదు నాకు రావాలసిన వాటా నాకిస్తె నా దారిన నేను పోతాను అని ఖండితంగా చెప్పెసాడుట అన్నదమ్ముల మధ్య నలుగురిలో ఈ కీచులాట ఎందుకని మూర్తి, మీ చిన్న బావగారు ఆస్తి మాకేమి వద్దని, కాశీపతి వాటా అతని కిచ్చేయమని చెప్పారుట మిగిలిన కొంచెం పొలం ఈ ఇల్లు పెద్దబావగారికి చెందేలా ఒప్పుకున్నారుట

అప్పులు "

"అదే అందరికి బాధ కలిగిస్తున్నది మీ చిన్న బావగారికి ఆస్తి వదులుకున్నాక ఇక అప్పులు తీర్చటం ఆయన కొచ్చే జీతంతో కష్టం కదా! అందుకని అప్పులు విషయం మీరెవరూ బాధ పడద్దు అన్నీ నేను తీరుస్తాను అంటూ మూర్తి ఆ ప్రోనోట్లన్ని తన పేర వ్రాయించుకున్నాడట '

అయితే తను పంచుకున్నది అప్పుల భారాన్నన్న మాట

'మేమంతా వద్దనే అన్నాం మూర్తి వినటం లేదు నువ్వైనా చెప్పు '

ప్రమాదం అందుకే ఇంతగా చెప్తున్నా మీ యిష్టం మీరేం చేసినా సరే!' తను చెప్పదల్చుకున్నది ఇంకేమీ లేదు అన్నట్టుగా సంభాషణ ముగించి అక్కడి నించి కదిలింది జానకి

జగన్నాధంగారి మనస్సు సుభద్రమ్మని గురించిన ఆలోచనలతో నిండింది

ముప్పై ఏళ్ళనాటి మాట జానకి ఆ యింటి కోడలుగా అడుగు పెట్టి ఇంకా ఏడాది దాట లేదు జగన్నాధంగారు వృత్తిపరంగా ఇంకా శైశవదశలో నే ఉన్నారు అదేమి దురదృష్టమో జానకి ఆరోగ్యం మొదటి నించీ అంతంత మాత్రంగానే ఉండేది తను వ్యాపార వ్యవహారాల మీద ఊళ్ళు తిరుగుతూ ఉంటే ఇంటి దగ్గర జానకిని నమ్మకంగా అంటిపెట్టుకుని సేవ చేసే మనిషి ఎవరైనా దొరుకుతారేమోనని ఆయన వెతుకుతున్న రోజుల్లో సుభద్రమ్మ ఆ యింటి వంటమనిషిగా అడుగు పెట్టింది జగన్నాధంగారికి సుభద్రమ్మని చూడగానే సానుభూతి సద్భావమూ కలిగాయి సుభద్రమ్మ కూడా తొందరలోనే ఆ యింట్లో మనిషిలా కలిసి పోయింది జగన్నాధాన్ని తన తమ్ముడిగానూ, జానకిని తన మరదలుగానూ చెప్తూ ఉండేది సుభద్రమ్మ ఇంటి పనుల్లో తెలివితేటలూ మాటల్లో అణుకువా ఆప్యాయతా, అన్నింటినీ మించి వంట పనిలో నైపుణ్యమూ సుభద్రమ్మ స్థానాన్ని ఆ యింటిలో సుస్థిరం చేశాయి ఆవిడ వచ్చాక జానకికి ఇంటి బెంగ తీరింది ఇక జానకికి నెల తప్పినప్పుడల్లా సుభద్రమ్మ జానకి గురించి తీసుకునే శ్రద్ధ ఇంతా అంతా కాదు పుట్టిన బిడ్డకి అర్నెల్లు దాటేదాకా జానకిని అటు పుల్ల తీసి ఇటు పెట్టనిచ్చేది కాదు జానకికి ఏదైనా అనారోగ్యం చేస్తే ఆ సమయంలో పసిపిల్లల సంరక్షణ భారం కూడా పూర్తిగా సుభద్రమ్మే చూసుకునేది ఇంతగా తమ కుటుంబానికి సేవలు చేస్తున్న సుభద్రమ్మకి ఏవిచేస్తే ఋణం తీరుతుంది? అని జగన్నాధం దంపతులు అనుకున్న సందర్భాలు కూడా లేకపోలేదు

గడిచిన ముప్పై ఏళ్ళలో ఆయన వ్యాపారం మూడు పువ్వులూ ముప్పై కాయలుగా అభివృద్ధి చెందింది పెద్ద కొడుకూ, పెద్ద కూతురూ పెళ్ళిళ్ళై వేరే ఊళ్ళల్లో ఉంటున్నారు రెండో కొడుకూ రెండో కూతురూ కాలేజీ చదువులకి వచ్చారు అన్ని విధాలా ఆ కుటుంబంలో సుఖం పెరిగింది సంపద పెరిగింది వాటితో పాటే సుభద్రమ్మ వయస్సూ పెరిగింది తగ్గిందల్లా ఆవిడ ఒంట్లో ఓపికా ఆరోగ్యమూ మాత్రమే

సుభద్రమ్మ – తనకి ఇంతగా ఆలోచించవల్సిన సమస్య అవుతుందని జగన్నాధంగారు ఏనాడు అనుకో లేదు ఆవిడయందు ఎంతగా కృతజ్ఞత ఉన్నప్పటికీ, తరం మారుతోందనీ పొద్దు వాలుతోందనీ గ్రహించలేని స్థితిలో లేరాయన సుభద్రమ్మని తన యింటి నించి పంపించినప్పటికీ ఆవిడ గురించీ, ఆవిడ ఆరోగ్యం గురించీ శ్రద్ధ తీసుకునే సంరక్షకు లెవరికైనా అప్పగించాలని ఆయన తపన శానిటోరియంకో, సంక్షేమ గృహానికో పంపించే ఆలోచన ఆయనకి నచ్చ లేదు అందుకే- ఆవిడని ఎక్కడికి పంపించాలి? ఎప్పుడు పంపించాలీ అనే ప్రశ్నలతో సతమతమౌతూ నిద్రలోకి జారారు –

చూస్తూ ఉండగానే నెల రోజులు గడిచి పోయాయి వేసవి సెలవలకి కూతురూ అల్లుడూ, ట్రాన్స్‌ఫర్ మీద కొడుకూ కోడలూ మనవళ్ళు మనవరాళ్ళూ అంతా రావటంతో ఇల్లంతా ఒకటే సందడిగా ఉంది ఉదయమే టిఫిన్, కాఫీ ముగించి వరండాలో కూర్చుని పేపరు చదువు తున్నారు జగన్నాధంగారు అంతలోనే ఇంట్లోంచి రేవతి గొంతు తారాస్థాయిలో వినిపించింది రేవతి ఆయన పెద్ద కూతురు విషయ మేమిటో తెల్సుకునేందుకు లోపలికి వెళ్ళిన జగన్నాధంగారికి కూతురు మనవడినీ, మనవరాలినీ రెండు చెంపలూ వాయించి గట్టిగా మందలిస్తున్న దృశ్యం కంటబడింది

ఏమ్మా? ఏం చేశారు? అలా కొడ్తున్నావ్? అడిగా రాయన ఆమెని వారించే ప్రయత్నంలో

చూడండి నాన్నా ఆ ముసలావిడ ఉంటున్న పెంకుటింట్లోకి వెళ్ళద్దర్రా అని ఎన్నిసార్లు చెప్పినా బుద్ధి లేదు వీళ్ళకి ఇంత ఇల్లూ ఇంత మంది మనుషులూ ఉంటే వీళ్ళ ఆటలకి చాలట్లేదు ఎప్పుడూ ఆ ముసలమ్మ చుట్టూ ఆ గదిలోనే ప్రదక్షిణలు పోనీ పిల్లలకి తెలియకపోతే ఆవిడకైనా తెలియఖ్ఖర్లా? తనరోగం వాళ్ళ కంటుతుందేమోననే ఆలోచన ఉండద్దూ? మేము ఇక్కడ ఉన్న న్నాళ్లో జాలూ కాస్త ఆ తలుపులు మూసుకుని లోపలే ఉండవమ్మా అని ఒచ్చిన రోజునే చెప్పాను వింటేగా? ఆవిడ ఎప్పుడూ తలుపులు తెరిచిపెట్టి ఉంచటమూ పిల్లలు అందులోకి దూరటమూ- ప్రతిక్షణం వీళ్ళకి కాపలా కాయలేక ఛస్తున్నాను ఇక్కడి పరిస్థితి ఇలా ఉందని తెలిస్తే, ఈ సెలవలకి పిల్లలని తీసుకుని మా బావగారింటికి బెంగుళూరైనా వెళ్ళేవాళ్ళం అన్నయ్యా వదినా కూడా వచ్చారని వచ్చాం కానీ

ప్రవాహంలా సాగుతున్న రేవతి మాటలు వింటూ ఏం చెప్పాలో తోచలేదు జగన్నాధంగారికి మండే వేసవి కాలంలో పెంకుటింట్లో తలుపులు మూసుక్కూర్చోవటం ఎంత కష్టమో రేవతికి తెలియదా? అని ఒక్క క్షణం విస్తుపోయారాయన కూతురు ధోరణి ఇలా ఉంటే కొడుకూ కోడలూ కూడా వచ్చినప్పట్నించీ ఆవిడమీద ఎందుకో ఒకందుకు రుసరుసలాడుతూ ఉండటం కూడా ఆయన గమనించక పోలేదు ఆయన దృష్టి పెరట్లో పెంకుటి వసారా ముందు తలవంచుకుని కళ్ళు తుడుచుకుంటున్న సుభద్రమ్మ మీద నిలిచింది ఆ క్షణంలో ఆవిడపట్ల సానుభూతితో ఆయన హృదయం ద్రవించింది ఎంత మారిపోయింది ఈవిడ స్థితి? ఒకప్పుడు తమ దంపతుల సేవకోసం భగవంతుడు పంపిన దేవతలా ఈ యింట అడుగుపెట్టిన వ్యక్తి ఈనాడు వయోభారంతో, అనారోగ్యంతో చిక్కి శల్యమై నిన్నగాక మొన్న పుట్టిన వాళ్ళ నిందలకి బదులు చెప్పలేక రోదిస్తూ నిలబడింది జానకి చెప్పిందే నిజం ఆవిడంటె తమకి ఉన్న అభిమానం పిల్లలికి లేదు, ఉండదు వాళ్ళ దృష్టిలో ఆవిడ ఈ యింట్లో ఒక పనికిరాని వస్తువు వాళ్ళ కోపతాపాల నించి సుభద్రమ్మని ప్రతిక్షణం రక్షించాలని ప్రయత్నిస్తే ఇంటి వాతావరణమే చెడుతుంది ఆవిడని వీలైనంత తొందరగా ఇక్కణ్నించి పంపించెయ్యటమే అందరికీ మంచిది- ఆలోచనలు అంతదాకా వచ్చాక ఎక్కడికి? అన్న ప్రశ్నకి జవాబు తోచక

విశాఖపట్నంనుంచి
అందిన సమాచారం ప్రకారం
కోస్తా జిల్లాల్లో
తుఫానుగాలులు
వీస్తాయి

హైదరాబాద్‌నుండి
అందిన సమాచారంప్రకారం
కోస్తా జిల్లాల్లో
వడగాల్పులు
వీస్తాయి

కాసు

# ఈ బ్రతుకుకీ గెలుపుచాలు

నిట్టూరిస్తూ బైటకి కదిలారు జగన్నాధంగారు

సాయంత్రం – బైట లాన్‌లో కూర్చుని టీ తాగుతూంటే పెద్ద కొడుకు వేణు సమీపించాడు అతని ముఖం చూస్తూనే ఏదో ముఖ్యమైన విషయమే ఉందని ఊహించారాయన ఆయన ఊహ తప్పుపోలేదు

మేము మా ఆఫీస్ దగ్గర్లో వేరే ఇల్లు అద్దెక తీసుకుని ఉందామనుకుంటున్నాం నాన్నా చెప్పాడు వేణు

జగన్నాధంగారికి కొడుకు ఆంతర్యం అర్ధమైంది ఆగ్రహాన్ని అణుచుకుంటూ అడిగారు ఏం ఈ యిల్లు ఇరుగ్గా ఉందా? ఇక్కడ సుఖంగా లేదా?

అదేం కాదు ఆఫీసుక దగ్గరగా ఉందామని అంతే నసిగాడు వేణు

మనస్సులో ఉన్నది సూటిగా చెప్పవేం? నువ్వు ఇల్లు మారదామనుకుంటున్నది ఆ ముసలావిడ ఈ యింట్లో ఉందనేకదూ?

ఆఁ! అందుకే తప్పా? ఉక్రోషంగా అడిగాడు వేణు ఎల్లల ఆరోగ్యం గురించి మీ కోడలు ఆందోళన చెందుతోంది మీరేమో ఆ ముసలావిడని ఇంట్లోంచి బైటకి పంపించరు రేపు ఆ రోగం కొంపలో మరెవరికైనా అంటుకుంటె తప్ప మీకు తెలిసిరాదు కోపంగా అంటున్న వేణుని చూసి నిర్విణ్ణుడయ్యారాయన

రేపు నాకో మీ అమ్మకో ఏదైనా జబ్బు చేస్తే మమ్మల్ని కూడా అలానే వదిలించు కుంటారన్నమాట

అసందర్భంగా మాట్లాడకండి మాకు మీరూ ఆవిడా ఒకటి ఎలా అవుతారు? అయినా ఇలాట వాదనలన్నీ అనవసరం మేము వేరే యింటిక వెళ్ళామని నిర్ణయించుకున్నాం అంతే! విసురుగా అనేసి బైటకి నడిచాడు వేణు

ఆ రాత్రి జానకితో కూడా వాదన తప్పలేదాయనకి

ఇదేం చోద్యమండీ? సంవత్సరాల తరబడి ఎక్కడెక్కడో తిరిగి, ఇప్పుడు వాళ్ళ కాళ్ళూ వీళ్ళ కాళ్ళూ పట్టుకుని ఈ ఊరు ట్రాన్స్‌ఫర్ చేయించుకుని, తీరా ఈ ఊరొచ్చాక, వాళ్ళొక యింట్లోనూ, మనమొక యింట్లోనూనా?

ఏం చెయ్యమంటావ్ మరి? సుబద్రమ్మ ఇంట్లో ఉంటే వాళ్ళు ఇక్కడ ఉండరుట ఇన్నాళ్ళూ మననే నమ్ముకుని చాకిరీ చేసిన మనిషిని, మరె దిక్కూలేని ముసలిదాన్ని ఇలాటి పరిస్థితుల్లో ఎక్కడికి పంపాలో ఎలా పంపాలో నాకు తోచట్లేదు ఆవిడ బాగోగులు చూసుకునే మరో వ్యక్తి

ఎవరైనా ఉంటే

అలాటి వ్యక్తి ఎవరైనా ఉంటె వాళ్ళ దగ్గిరకి సుబద్రమ్మగారిని పంపించటానికి మీకు అబ్యంతరం లేదుగా? చటుక్కున అడిగింది జానకి

విస్మయంగా చూశారు జగన్నాధంగారు మనం తప్ప ఎవరున్నారు? ఆవిడ గురించి ఆ మాత్రం పట్టించుకునేవాళ్ళు?

మీకు తెలియదు కొద్ది రోజుల క్రితందాకా నాక్కూడా తెలియదు ఆ మధ్యన మాటల సందర్భంలో ఆవిడే చెప్పింది ఆవిడమేనల్లుడొకడు హైదరాబాద్‌లో ఏదో కంపెనీలో వాచ్‌మన్‌గా చేస్తున్నాడుట ఒకప్పుడు ఈవిడ అతనికి చాలా సాయం చేసింది తనకున్న కొద్దిపాటి భూమినీ నగలనీ అతనికేయిచ్చిందిట అతను హైదరాబాద్‌లో ఇల్లు కట్టుకుంటానంటె మీరిచ్చిన జీతం నించి కూడబెట్టిన సొమ్ముని కూడా అతనికే పంపిందిట కాని

కానీ ?

కానీ వాడొక కృతజ్ఞతలేని పశువు కొన్నాళ్ళ క్రిందట ఈవిడ వాడికొక ఉత్తరం రాసిందిట ఒంట్లో సత్తువైపోతోందీ, చివరి రోజుల్లో నీ దగ్గిరకి వచ్చి ఉందామను కుంటున్నానూ అని కానీ ఆ పశువు ఎట్టి పరిస్థితుల్లోనూ నా యింటికి రావద్దు, నిన్ను భరించటం నావల్ల కాదు అని నిష్కర్షగా జవాబిచ్చాడుట పది రోజుల క్రితం ఆ ఉత్తరం వచ్చినప్పుడు నాకు చూపించి కళ్ళ నీళ్ళు పెట్టుకుందావిడ

మరి అలాటి వెధవ దగ్గిరకి ఈవిడని ఎలా పంపుతాం?

నవ్వింది జానకి ఇంత అమాయకులు ఇన్ని వ్యాపారాలు ఎలా చేస్తున్నారండీ? వాడు రాసిన ఉత్తరాన్ని బట్టి వాడెలాటివాడో తెలియట్లేదూ? డబ్బు పడేస్తే అలాటివాళ్ళు దేనికైనా తలూపుతారు మీరెందుకు మీరూరుకోండి నేను రేపే వేణుని హైదరాబాద్ పంపుతాను, సుబద్రమ్మగారు బ్రతికున్నంత కాలమూ ఆవిడ బాద్యత వాడు తీసుకునేటట్టు ఏదో ఒకరకంగా ఒప్పించి వస్తాడు

భార్య చెప్పిన దానికి మౌనంగా తన అంగీకారాన్ని తెలిపారు జగన్నాధంగారు జానకి సూచనమీద ఆ రోజె హైదరాబాద్ వెళ్ళి మర్నాటి రాత్రికి తిరిగి వచ్చాడు వేణు వెళ్ళిన పని ఏమైంది అన్నట్టు చూశారు జగన్నాధం దంపతులు

నాన్నా సమస్య పరిష్కారమైనట్టే సుబద్రమ్మగారి మేనల్లుడిని కలిసి పరిస్థితి చెప్పాను ఆవిడ భారం తను తీసుకోలేననీ, తనది చిన్న యిల్లూ పెద్ద కుటుంబం అనీ తనకి వచ్చేది తనకె చాలట్లేదనీ పీద అరుపులు అరిచాడు వాడొట్టి డబ్బు మనిషని మాటల్ని బట్టి అర్ధమైంది సుబద్రమ్మగారి సంరక్షణబారం తీసుకునేట్టైతే మొదట ఒక అయిదు వేలూ, తర్వాత నెల నెలా రెండొందలూ పంపే ఏర్పాటు చేస్తానని చెప్పగానే ఎగిరి గంతేసి ఒప్పుకున్నాడు

గాఢంగా నిట్టూర్చారు జగన్నాధంగారు సరే సుబద్రమ్మకి ఈ విషయాలు రేపొద్దున నేనూ మీ అమ్మా నెమ్మదిగా వివరించి చెప్తాం నువ్వు వెళ్ళి పడుకో వేణుని పంపించి నిద్రకుపక్రమించిన జగన్నాధంగారికి సుబద్రమ్మ సమస్యకి పరిష్కారం దొరికినందుకు సంతృప్తి ఈ పరిష్కారం సరైనదేనా అనె సందేహమూ చెరొక వైపునించీ నిద్రపట్టకుండా చేశాయి –

మర్నాటి ఉదయం - ఎవరో తట్టి లేపుతూంటె మెళుకువ వచ్చింది జగన్నాధంగారికి లేచి కూర్చునేసరికి ఎదురుగా తప్పు చేసిన వాడిలా తలదించుకుని వేణు అతని వెనకాల జానకీ, రేవతీ సుజాతా గంబీరవదనాలతో కనిపించారు ఏమిట్రా? ఏమైంది? ఏం జరిగిందో అర్ధంకాక ఆందోళనగా అడిగారు

ప్రమాదమేమీ జరగలేదు నాన్నా కానీ కానీ సుభద్రమ్మగారు నిన్న రాత్రే ఇల్లు విడిచి వెళ్ళిపోయారు ఆవిడ గదిలో ఈ ఉత్తరం మీకు రాసింది కనిపించింది

వేణు చేతిలోని కాయితాన్ని అందుకున్నారు జగన్నాధంగారు వణికే చేతులతో వంకర టింకరగా వ్రాయబడిన అక్షరాల వెంట పరిగెత్తింది ఆయన దృష్టి

నాయనా జగన్నాధం

ఇన్ని సంవత్సరాలు నీకు అక్కగారిగా భావించుకుంటూ నీ కుటుంబంలో ఒకరిగా ఉండి ఇప్పుడు ఇలా చెప్పకుండా వెళ్ళిపోతున్నందుకు క్షమించు ముందుగా చెప్తె నువ్వు వెళ్ళ నివ్వవేమోననే ఇలా రహస్యంగా నిష్క్ర మిస్తున్నాను ఇన్ని సంవత్సరాలుగా మీరు అడగనిదీ నేను చెప్పనిదీ అయిన నా గతం గురించి మీకు చెప్పటానికి ఇదే నాకున్న చివరి అవకాశం

పచ్చి పల్లెటూళ్ళో పుట్టి పెరిగినదాన్ని నేను అప్పటి పద్ధతులని బట్టి నాకు ఊహ రాకముందే పెళ్ళి చేశారు మా పెద్దలు తల్లితండ్రులు చిన్ననాటనే పోవటంచేతా అన్నగారు బాద్యతపట్టని వాడవటం చేతా చిన్న వయసులోనె అత్తవారింటికి వెళ్ళాను నా భర్త - నాకన్న పదిహేనేళ్ళు పెద్దవారు ఆయనకి లేని వ్యసనం లేదు అన్నిటితో పాటె స్త్రీలోలతి కూడా అత్తవారింట్లో ఎవరికీ అక్కర్లేనిదాన్ని నేను అత్త మామలు పోయాక నా భర్త నన్ను కూడా వదిలేసి ఎటో వెళ్ళి పోయారు ఎటుపోవాలో ఎలా బతకాలో తెలియక అయిష్టంగానే అన్నగారి దగ్గరికి చేరాను అక్కడ వదినగారి తిట్లని మొగుడొదిలేసిన దానివనే అవహేళనలనీ భరిస్తూ వాళ్ళకి ఊడిగం చేస్తూ - వాళ్ళు బైటకి పొమ్మనేంతదాకా గడిపాను వీదిన పడ్డ నాకు ఎలా బతకాలో ఎందుకు బతకాలో తెలియని

# ధర్మపథం




## ధ్యానబలం

ముక్తి పొందడానికి అనేక మార్గాలున్నవి ప్రతిభావంతులై, తత్త్వ విచారణ శక్తి కలవారు జ్ఞాన యోగ మార్గం ద్వారా కృతార్థులు కాగలరు ఆ యోగ్యత లేనివారు సత్కర్మల మూలంగా లక్ష్యాన్ని అధిగమిస్తారు ఆ కర్మలను ఆచరించడానికీ శక్తి లేని వారు కేవలం భక్తి యోగ మార్గాన్ని అవలంబిస్తే కృతార్థులు కాగలరు ఈ మార్గాలు విభిన్నంగా ఉన్నా, లక్ష్యం ఒక్కటే కాబట్టి, ఈ మూడింటికీ సమ ప్రాధాన్యం ఉన్నదని చాలామంది విద్వాంసుల అభిప్రాయం ఇది ఇలా ఉండగా మానవుడు తరించడానికి అనువైనది సన్యాసాశ్రమ స్వీకరణమే అని కొందరి అభిప్రాయం సంసారంలో పడి కొట్టుమిట్టాడుతున్న మానవుడికి ఐహికాల పైనే గాని ఆధ్యాత్మికంపై దృష్టి పోదనీ, అతడు తరించడం సాధ్యంకాదనీ వారి అభిప్రాయం కావచ్చు

కాని మానవులు గృహస్థులయి ఉండీ కూడా ముక్తిని పొందవచ్చును గృహస్థుడికి జీవితాంతమూ ఎన్నో సమస్యలు ఎదురవుతూ ఉంటాయి వాటిని గురించిన ఆలోచనలో నే కాలం గడుస్తుంది భగవచ్చింతనకు అవకాశం చాలా తక్కువ అయినా – ఏదో అవకాశం కల్పించుకొని సమయం దొరికినపుడల్లా భగవన్నామం స్మరిస్తూ సత్కార్యాలనే ఆచరిస్తూ ఉంటే చాలు అదే ఉత్తమ తరణోపాయం!

గృహస్థుడైనవాడు భగవద్ ధ్యాననిష్ఠుడై ఉండగలడా? అతడు తరించగలడా? అనే సందేహం నారదుడి మనస్సులో కలిగింది తానే గొప్ప ధ్యాననిష్ఠుడనని ఆ ముని అభిప్రాయం అతడు తన సందేహాన్ని శ్రీకృష్ణుడికి తెలియజేశాడు ఫలానా గ్రామంలో ఉన్న కర్షకుడి వద్దకు వెళ్ళి, వాడేమి చేస్తున్నదీ గమనించి రమ్మని ఆయన నారదుడితో అన్నాడు నారదుడు అక్కడికి పోయి చూడగా ఆ కాపు తన పనులతోనే మునిగి ఉన్నాడు కాని ప్రతీ పని ముందూ, నారాయణా, వాసుదేవా! 'కృష్ణా! రామా!" అని ఏదో ఒక నామం స్మరిస్తున్నాడు అంతకంటే విశేషం కానరాలేదు ఈ సంగతే నారదుడు కృష్ణునికి చెప్పాడు తనకు విశేషమేమీ తోచలేదనీ చెప్పగా కృష్ణుడు, ఒక చిన్న గిన్నె అంచుల వరకూ నూనె పోసి నారదుడికిచ్చి 'ఒక నూనె బొట్టయినా క్రింద పడకుండా జాగ్రత్తగా పట్టుకొని వూరు చుట్టి ర"మ్మని చెప్పాడు నారదుడు గిన్నె పయినే ధ్యానం ఉంచి, అతి కష్టం మీద నూనె చెదిరి నేలపై పడకుండా చూస్తూ, కృష్ణుని వద్దకు వచ్చాడు కృష్ణుడు "ఇలా వస్తూ, ఒకసారయినా నామస్మరణ చేశావా?" అని అడిగాడు "గిన్నెను చూసుకోనేదా? ధ్యానం చేసేదా?' అన్నాడు కృష్ణుడు నవ్వి "నీకే ఒక్కసారి కూడా – ఈ పనిలో నామస్మరణకు సాధ్యంకాలేదు ఆ కర్షకుడు ప్రతీ పని ముందూ నామస్మరణ చెయ్యడం విశేషం కాదా?' అని ప్రశ్నించగా, నారదుడు సిగ్గుతో తలవంచుకున్నాడు పనులు జరుపుతూ ధ్యానం చెయ్యడం ఉత్తమ గృహస్థ ధర్మం అతడు తరించగలడు

("గురువాణి" ఆధారంగా)

— బులుసు వేంకట రమణయ్య

---

స్తితి ఎప్పటికైనా నా భర్త నన్ను మళ్ళీ చేరదీస్తాడేమోననే స్త్రీ సహజమైన వెర్రి ఆశ ఎక్కడో అంతరాంతరాలలో రగుల్తూ బతుకుమీద కోర్కె మిగిల్చింది పెద్దగా చదువూ లోకజ్ఞానమూ లేని నేను, ఎలా బతకాలో తెలియక సతమతమౌతూ మీ దరికి చేరాను మీ దంపతుల అన్యోన్యతనీ మంచితనాన్నీ చూశాక నాకు బతకాలనే కోరిక బలపడింది నా భర్త జాడ తెలియ లేదు ఆ కోరిక ఎండమావిగానే మిగిలినా, మీ దంపతుల ఆదరణ నాకు మనశ్శాంతిని ప్రసాదించింది

అయితే ఈ జీవితం ఇలా ప్రశాంతంగా ముగిసిపోవటం బగవంతుడికి ఇష్టం లేదేమో గత నెల రోజులుగా మీరు మథనపడుతున్న నా జీవితపు తుది మజిలీ గురించి నాక్కూడా చాలా రోజుల క్రితమే సంశయం కలిగింది కానీ ఏం చెయ్యను? విధిచేత తుదివరకూ శిక్షింపబడుతున్న దాన్ని జీవన సంధ్యాసమయాన తలదాచుకునే గూడు చూపిస్తాడెమోనని నేను నమ్ముకున్న నా మేనల్లుడు కూడా నేనివ్వగలిగిందంతా నా వద్ద నించి తీసుకుని ఇప్పుడు నా దారి నన్ను చూసుకోమన్నాడు

నిస్పృహతో విరక్తితో నిశ్చేష్టురాలినైన నేను, నన్ను గురించి మీ దంపతు లిద్దరూ ఎంతగా కలత చెందుతున్నారో గమనిస్తూనే ఉన్నాను చివరికి నా క్షేమంకోసం, ఒకప్పుడు నా బాధ్యతని తిరస్కరించిన నా మేనల్లుడికి పెద్ద మొత్తంలో డబ్బు ముట్ట చెప్పటానిక్కూడా సిద్ధమైనారని తెలిశాక– నిజంగా అంతటి ఔదార్యానికి నేను అర్హురాలినేనా అనే సంశయం కలిగింది– అందుకే ఈ యింటి నించి నిష్క్రమిస్తున్నాను

బాబూ నిన్నటిదాకా నా జీవితం అడివిలో మోడు వంటిదనీ, నిష్ప్రయోజన మైనదనీ నిస్పృహ నన్ను ఆవరించుకుని ఉండేది కానీ నా గురించి మీరు పడుతున్న ఆందోళనా, చెయ్యబోతున్న త్యాగమూ తెలుసుకున్నాక, జీవితంలో అన్నిటా ఓడిపోయినా మీలాటి మంచి మనుషుల హృదయాలలో స్థానాన్ని గెల్చుకున్నాననే సంతృప్తి కలిగింది ఈ బ్రతుకుకీ గెలుపు చాలు నా శేష జీవితానికి ఆ సంతృప్తి చాలు ఎండిపోయిన ఆకు రాలటానికి ఎంతో కాలం పట్టదు దాన్ని గురించి విచారించటం అనవసరం నా గురించి ఆలోచించి బాధపడకండి నీకూ జానకికీ పిల్లలకీ ఆశీస్సులతో అభాగ్యురాలు – మీ అక్క–

జగన్నాధం కంటివెంట అశ్రువులు చూడటం అక్కడివారికి అదే మొదటిసారి □

# పేదవారి రిఫ్రిజిరేటర్

ఈ రోజుల్లో రిఫ్రిజిరేటర్ దర వేలల్లో ఉండడం వల్ల కొన్ని కుటుంబాలకు మాత్రమే అందుబాటులో ఉంది పేదవారి కొరకు సెంటర్ ఆఫ్ సైన్స్ పర్ విలేజెస్ – వార్ధా వారు మట్టితో చేసిన ఒక ఫ్రిజ్‌ను రూపొందించారు రెండు తొట్టెల వంటి నిర్మాణాలతో చేయబడ్డ ఈ ఫ్రిజ్‌లో కూరగాయలు, పండ్లు పాలు మరియు వండిన పదార్థాలను దాదాపు వారం రోజుల వరకు నిలువుంచుకోవచ్చు

ఫోటోలో చూపిన విధంగా ఒక తొట్టిలో (బయటి) మరొక తొట్టి (లోపలి) ఉంటుంది బయటి తొట్టిలో నీళ్ళుంటాయి నీటిని పోయడానికి గాను ప్రక్కన ఒక గరాటు లాంటి రంధ్రం ఉంటుంది లోపలి తొట్టిలో నిలువుంచదలచుకున్న పదార్థాలను ఉంచాలి బయటితొట్టిలోని నీరు సూక్ష్మ రంధ్రాల ద్వారా నిరంతరం బాష్పీభవనం చెందడం వల్ల లోపలి నీరు చల్లబడుతుంది ఈ విధంగా శీతలమైన నీరు లోపలి తొట్టిని చల్లగా ఉంచుతుంది చుట్టు ప్రక్కలా మరియు లోపలి తొట్టిలోని ఉష్ణోగ్రతలను పరిశీలించినపుడు 11 సెంటీగ్రేడ్ డిగ్రీల తేడా ఉన్నట్లు గమనించారు

రెండు కుండలకు ఉమ్మడిగా ఒకే మూత ఉంటుంది దీనికి చిన్న రంధ్రాలుంటాయి వీటి ద్వారా నిలువ పదార్థాల నుండి వెలువడే ఆవిరులు, వాయువులు బయటకు వెళ్ళడానికి మరియు గాలి ప్రసరవాలు జరగడానికి ఉపయోగపడతాయి

జనతా ఫ్రిజ్ నుండి పూర్తి లాభాలు పొందాలనుకున్న వారు కొన్ని ముందు జాగ్రత్తలు తీసుకోవడం ఆవశ్యకం అవి, 1 లోపలి తొట్టిని ఎప్పుడు శుభ్రంగా మరియు పొడిగా ఉంచడం 2 బయటి తొట్టిలో పోసే నీరు స్వచ్ఛంగా ఉండేటట్లు చూడండి 3 బయటి తొట్టిలో నీరు లేని స్థితికి రానీయకండి 4 నీటిని రోజుకోమారు మారుస్తుండండి – అపుడపుడు బాగా కడిగి ఎండ బెట్టండి-- వాసన ఏమైన ఉంటే ఎగిరి పోయేటట్లు చూడండి 5 ఉల్లిగడ్డలు మరియు బంగాళ దుంపలను ఈ ఫ్రిజ్‌లో నిలువుంచకండి లోపల ఎక్కువ తేమగా ఉండడం వల్ల మొలకెత్తడం ఆరంభిస్తాయి ఈ ఫ్రిజ్ వివిధ చోట్లలో వివిద సైజుల్లో 15 నుండి 35 రూపాయలకు లభ్యమవుతుంది గ్రామాల్లో నివసించే కుమ్మరి వారు దీన్ని తేలిగ్గా చేయగలుగుతారు ఆసక్తి గలవారు వివరాల కొరకు సెరమిక్ యూనిట్, సెంటర్ ఆఫ్ సైన్స్ పర్ విలేజస్, మగన్ సంగ్రహాలయ, వార్ధా--442001 మహారాష్ట్ర వారిని సంప్రదించవచ్చు

వ్యాసం, ఫోటోలు
–టి సంపత్ కుమార్

బయటి మరియు లోపలి తొట్టిల అమరిక
నీటిని పోయడానికి ప్రక్కనున్న నిర్మాణాన్ని గమనించండి.



రెండు తొట్టిలను కప్పి ఉంచిన మూత
చిన్న రంధ్రాలను గమనించండి.



# అసలైన తెలుపు ఏమిటో!... ప్రపంచానికి చూపండి

# డెట్






## ఉత్తమం... ఉత్తమం... తెలుపులో సర్వోత్తమం!

డెట్ మీకు అందిస్తుంది ఎంతో ఎక్కువ దీని క్రొత్త రేపర్ ఎంతో అందమైనది. ఆకర్షణీయమైనది. తీసి చూడండి, లోపల మరో ఆశ్చర్యం — ఉల్లాసకరమైన మనమోహక పరిమళం. అంతేకాదు, డెట్‌లో నిండి వున్నది ఎంతో ఎక్కువ తెలుపు శక్తి. మరి రండి, డెట్ ప్రపంచంలో అడుగిడండి. స్వయంగా చూడండి, అందరికీ చూపండి. డెట్ తెలుపు...అసలైన తెలుపు!

Shilpi DM 9A/84 Tel



# సీరియల్ మల్లిక

యార్లగడ్డ కెమిలార

(గత సంచిక తరువాయి)

షుమారు పదెకరాల స్థలంలో వుంది స్పా బిల్డింగ్' దాని చుట్టుపట్ల కనుచూపుమేరలో ఎక్కడా ఇళ్ళు లేవు బిల్డింగ్ చుట్టూరా తీగఫెన్స్ వుంది ఎంట్రెన్స్ గేటుపైన ఆర్చిలాగా వున్న పెద్ద బోర్డుమీద మ్యాజిక్ ఎగర్ సెలూన్ అని వ్రాసి వుంది

గేటుగుండా కారు లోపలికి పోనిచ్చింది మల్లిక చెట్ల ఆకుల శబ్దం కూడా వినబడేంత నిశబ్దంగా ప్రశాంతంగా వుంది లోపల బిల్డింగ్ ప్రక్కనే వున్న పార్కింగ్‌లాట్‌లో కారు పార్క్ చేసి మల్లిక అంజలి కారు దిగారు

మల్లిక ఫ్రంట్ డెస్క్ దగ్గర ఆగి పేరు రిజిస్టర్ చెయించుకుంది ఆ తర్వాత ఇద్దరూ లోపలికెళ్ళారు మల్లిక లాకర్‌రూంలోకి వెళ్ళి జిమ్‌సూట్ వేసుకుంది అంజలిని వెంటబెట్టుకుని బిల్డింగంతా తిరిగి చూపించింది

చాలా పెద్ద 'స్పా అది' రకరకాల విభాగాలున్నాయి ఎరోబిక్ డాన్సింగ్ హైడ్రాజిమ్ ఎక్సర్‌సైజింగ్ సానా, స్టీమ్‌రూమ్ విర్ల్‌పూల్ బాత్, మస్సాజింగ్ అల్ట్రావయొలెట్ సన్‌రూం– వగైరాలు

బిల్డింగ్ వెనకవైపున పెద్ద స్విమ్మింగ్‌పూల్ వుంది దానినానుకుని ఆడంబరమైన లాంజ్' స్విమ్ చేసి వచ్చి చాలామంది లాంజ్‌లో ఈజీచైర్లల్లో రెస్టుతీసుకుంటున్నారు కొందరు పూల్ గట్టుమీద కుర్చీలలో కూర్చుని సన్‌బాత్ చేస్తున్నారు

రోజూ వచ్చిపోయేవాళ్ళేగాక దూరంనుండి వచ్చిన హౌస్‌గెస్టులు కూడా వున్నారక్కడ వాళ్ళకి వుండటానికి విడిగా కాటేజీలు వున్నాయి చాలామంది కేవలం సన్నబడటానికేగాక హెల్త్ రీజన్స్‌కి కూడా వస్తుంటారు

మల్లికా అటుచూడు' అరిచింది అంజలి ఆ ఆకుపచ్చ రంగు స్విమ్‌డ్రెస్ వేసుకున్నావిణ్ని చూశావా? కొంచం కదిలితేనే ఒళ్ళు జెల్లోలాగా, ఎలా షేక్ అవుతోందో! బాబోయ్! అంత లావుపాటి మనిషిని ఇంతవరకూ ఎక్కడా చూడలేదు కొన్నాళ్ళు పోతే నేనూ అలాగే అవుతానంటావా? భయం భయంగా అడిగింది

అయినా నేనాశ్చర్యపడను నవ్వు దాచుకుంటూ అంది మల్లిక

కొరకొరా చూసింది అంజలి

డైట్ కౌన్సెలింగ్ అన్న బోర్డున్న రూం దగ్గర ఆగింది మల్లిక లోపలికి తొంగి చూసింది రూత్ నలుగురైదుగుర్ని కూర్చోబెట్టుకుని ఏమిటో చెబుతోంది

మల్లికవంక చూసి లోపలికొచ్చి కూర్చోమని సైగజేసి, తనపనిలో తను మునిగిపోయింది రూత్

పద లోపల కూర్చుందాం ఆ డైటీషియన్ నా స్నేహితురాలే!

ఇద్దరూ వెళ్ళి కూర్చున్నారు

పది నిముషాల్లో చెప్పటం ముగించి వాళ్ళని పంపించి ఇటొచ్చింది రూత్

హాల్లో మల్లికా! గ్లాడ్‌టు సె యు సో సూన్' నవ్వుతూ వచ్చి కూర్చుంది

మల్లిక ఇద్దర్ని ఒకరికొకరికి పరిచయం చేసింది

మీరూ ఇక్కడ చేరారా? అంజలిని అడిగింది రూత్ అంజలి ఎందుకో మల్లిక వంక చూసింది మల్లిక అంజలి వంకే చూస్తున్నదల్లా తల అటు తిప్పింది అంజలికి తెలుసు మల్లిక మనస్సులో ఏం కదులుతోందో! ఆ లావుపాటావిణ్ని చూశాక చేరకుండా ఇంకెక్కడికి పోతావులే అనుకుంటూంది కదూ? మల్లిక వూహ తప్పించటానికైనా చేరకుండా వుండాలి కాని, ఆ జెల్లోషేక్

ఇంకా లేదు కాని చేరాలనుకుంటున్నాను అనుకోకుండానే అనేసింది

మల్లిక ఏం ఎరగనట్లే ఆశ్చర్యంగా చూసింది అంజలి ఆ చూపులు పట్టించుకోనట్లే రూత్‌తో ఏదో సంభాషణలోకి దిగింది

* * * * *

నెలరోజులు గడిచాయి ఆరోజు స్పా నుండి హుషారుగా వచ్చింది మల్లిక బార్గవ్ ఇంట్లోనే వున్నాడు

రావటంతోనే బార్గవ్ దగ్గరగా వెళ్ళి నిల్చుంది నాలో ఏదైనా మార్పు కన్పిస్తోందా?

న్యూస్‌పేపర్‌లో నుండి తలెత్తి చూశాడు బార్గవ్ తల విదిలించి, వుహు లేదే' అన్నాడు

జాగ్రత్తగా చూడు

కాస్త పరిశీలనగా చూసి, నాకేం తెలియటం లేదు నువ్వేచెప్పు అన్నాడు

కాస్త ఆశాభంగం పొందింది మల్లిక ఇంత స్పష్టంగా కన్పిస్తుంటే తెలియటం లేదూ? ఒట్టి అయోమయం మనిషి అని మనస్సులో విసుక్కుంది

ఆరుపౌన్లు తగ్గాను పొట్టచూడు, ఎంత లోతుకు పోయిందో! తప్పక తనే చెప్పింది

లోతుకుపోయే బదులు పైకొస్తే ఎంతో సంతోషించే వాణ్ని! అని పేపర్ చదవటంలో మునిగిపోయాడు బార్గవ్

కొరడాదెబ్బ తగిలినట్లు అలాగే నిలబడిపోయింది మల్లిక సున్నితమైన భాగంలో సుత్తితో కొట్టినట్లు మనస్సు విలవిలలాడింది మనస్సులోని వుత్సాహమంతా పొంగిన పాలపొంగులాగా అణగారిపోయింది

గిరుక్కున తిరిగి పైకెళ్ళింది గబగబా షవర్ తిప్పి స్నానం చేసింది క్రిందకొచ్చి వంట పూర్తి చేసింది

బార్గవ్ ఇంకా పేపర్ చదువుతూనే వున్నాడు

మురిగ్గా వున్న అవన్ తుడిచి శుభ్రం చేసింది ఏనాడో క్లీన్‌చేసిన రెఫ్రిజరేటర్

**జరిగిన కథ –12** బార్గవ్ అమెరికాలో ఒక చిన్న ప్రైవేటు కంపెనీలో ఉద్యోగం చేస్తున్నాడు బార్గవ్‌కి మల్లిక పరిచయం అయ్యింది ఆమె ఉద్యోగంలో చేరినాక వారిద్దరు పెళ్ళి చేసుకున్నారు వారి జీవితం సాఫీగా సాగిపోతున్నా పిల్లలు మాత్రం కలుగలేదు అందుకై ఆ దంపతులు డాక్టర్ల చుట్టూ తిరగటం ప్రారంభించారు వారికి పిల్లలు పుట్టక పోవడానికి కారణాన్ని ఏ డాక్టరూ చెప్పలేకపోయాడు కాని బార్గవ్‌కి మాత్రం తమకు తప్పక పిల్లలు పుడుతారని నమ్మకం ఒంటరి తనంతో బాధపడుతున్న మల్లికకి చిన్ననాటి స్నేహితురాలు అంజలి తారసపడటం ఆనందాన్ని ఇచ్చింది ఎదురింటి పాప స్టేసీ అంటే మల్లికకు తగని ప్రేమ పిల్లల్ని పెంపకం తీసుకునే విషయంలో తమకి ఆసక్తి లేదని డాక్టరుతో చెపుతాడు బార్గవ్ డాక్టరు మాటలు విన్న బార్గవ్‌కి తనింట్లో చిన్నప్పుడు పాలేరుగా ఉండిన చిట్టిగాడు, వాడి పిల్లలు జ్ఞప్తికి వస్తారు చిట్టిగాడి పిల్లలకి ఏదో ఒక దారి చూపించాలనుకుంటాడు చిట్టిగాడి భార్య చనిపోయిందని, వాడు క్షయతో బాధ పడుతున్నాడని తండ్రి ఉత్తరం ద్వారా తెలుసుకున్న బార్గవ్ ఆవేదన చెందుతాడు డేవిడ్ తన ఇంట్లో కంపెనీ తరఫున ఇచ్చే క్రిస్‌మస్ పార్టీకి మల్లిక, బార్గవ్ వెళతారు బార్గవ్ తనతో ఇదివరకటిలా ఉండటం లేదని స్నేహితురాలు అంజలికి చెప్పి బాధపడుతుంది మల్లిక మల్లిక బార్గవ్ సపోర్ట్ గ్రూప్ మీటింగ్‌కి వెళ్తారు లావు తగ్గడానికే గాక, పెరక్కుండా ఉండటానికి 'హెల్త్ స్పా'కి వెళ్ళాలనుకుంటుంది మల్లిక

తెరిచి అన్నీ బైటికితీసి అరలన్నీ శుభ్రంగా కడిగి, మళ్ళీ అన్నీ పెట్టేసింది పేంట్రీలో చిందరవందరగా వున్న సామానంతా ఎక్కడివక్కడ సర్దింది ఎప్పట్నుండో ఒదిలేసిన షూ క్లోజట్‌లో బూట్లు, షూలేసులు, సాక్స్ బైటికి తీసి మరీ పాతబడినవి ట్రాష్‌కాన్‌లో పడేసి మిగతావి నీట్‌గా సర్దింది అక్కడక్కడా మురికిపట్టిన కిచన్ గోడలు, బాత్‌రూం గోడలు స్పంజ్‌తో తుడిచేసింది

కిచన్ టైల్స్ పాలిష్‌చేసి చాలాకాలమైంది–అనుకుంటూ బేస్‌మెంట్‌లోకి వెళ్ళి బకెట్, మాప్ తీసుకొచ్చింది

బార్గవ్ మధ్యమద్యలో అంతా గమనిస్తూనే వున్నాడు'

భరించరాని బాధకలిగినప్పుడు, బాగా కోపం వచ్చినప్పుడూ మల్లిక ఆర్గ్యూ చెయ్యదు ఇల్లు క్లీన్ చేస్తుంది'

పేపర్ ప్రక్కనపెట్టి లేచాడు భార్గవ్

అబ్బ' ఆకలిగావుంది వంటయ్యిందా? కిచన్‌లోకి వచ్చి అడిగాడు

ఎప్పుడో అయ్యింది అన్నీ స్టవ్‌మీద వున్నాయి పెట్టుకుని తినొచ్చు. తనపని తను చేసుకుంటూ అంది మల్లిక

ఇల్లంతా ఎంత క్లీన్‌గా, తళతళా మెరిసిపోతోంది! ఏమిటి విశేషం? ఎరగనట్లే అన్నాడు

మల్లిక సీరియస్‌గా నేల పాలిష్ చేస్తూనే వుంది

చటుక్కున మాప్ పట్టుకున్నాడు బార్గవ్ మల్లిక మాప్ లాక్కోవటానికి ప్రయత్నించింది భార్గవ్ వదల్లేదు అతనిముఖం ఆమె ముఖానికి దగ్గరగా వచ్చింది చేత్తో ఆమె గడ్డంఎత్తి, కళ్ళల్లోకి చూశాడు

అయామ్ సారీ మల్లీ' నిన్ను బాధపెట్టటానికి అలా అన్లేదు లాబ్ చికాకుల్లో ఈరోజు మనస్సుబాగుండలేదు

మల్లిక అతని చెయ్యి తొలగించి మాప్ చేతిలోకి తీసుకుంది

అదివరకు ఎన్ని చికాకుల్లో వున్నా ఇలా ఎప్పుడూ అనలేదు సారీ అన్నంత



# మల్లిక

మాత్రాన కొన్ని బాధలు పోవు సరే, ఈ కొంచం పాలిష్‌చేసెయ్యనీ భోంచేద్దాం

* * * * *

ఆఫీసు డైనింగ్‌రూంలో కూర్చొనివుంది మల్లిక కాఫీ బ్రేక్ అయిపోయి మిగతా అందరూ వెళ్ళిపోయినా ఆమె అలాగె కూర్చుంది రాత్రి భార్గవ్ అన్నమాట ఇంకా ఆమె మనస్సులో ముల్లులా పొడుస్తూనె వుంది సూటిగా తప్పు పెడార్థం వచ్చేట్లు భార్గవ్ అంతకుముందెన్నడూ మాట్లాడలేదు అంటే, మనస్సులో అతనా విషయమై బాగా మదనపడుతున్నాడన్న మాట! సపోర్ట్‌గ్రూప్ మీటింగ్‌లో చెప్పలేని విధంగా కలిగిన వుత్సాహంతో 'హెల్త్‌చేస్పా'లో చెరినాక ఇన్నాళ్ళూ ఆ విషయం పెద్దగా ఆలోచించలేదు మల్లిక

అవును తమ సమస్య అలాగె వుంది! సపోర్ట్‌గ్రూప్ వల్ల భార్గవ్ మానసిక స్థితిలో, ఆలోచనారీతిలో మార్పు రాలేదు అసలా గ్రూప్ థెరపీనతడు సీరియస్‌గా తీసుకుంటే గదా? ఇప్పుడు తనేం చెయ్యాలి? కణతలు నొక్కుకుంది

హల్లో మల్లికా! ఒక్కదానివె కూర్చొని ఏమిటి ఆలోచిస్తున్నావ్?' అన్నమాట వినబడి వులిక్కిపడి చూసింది

ఎదురుగా ఫిలిప్ నిలబడి వున్నాడు

నువ్వా? వెకేషన్ నుండి ఎప్పుడొచ్చావ్?

నెలరోజుల తర్వాత ఆఫీసులో అడుగుపెడుతుంటే ఎంత గొప్ప స్వాగతమో!' నిష్ఠూరంగా అని, నేనూ కూర్చోవచ్చా అనడిగి, మల్లిక జవాబు చెప్పేలోపలే కుర్చీ లాక్కుని కూర్చున్నాడు ఫిలిప్

కాలిఫోర్నియా ఎలావుంది? అడిగింది మల్లిక

'సూపర్బ్' బీచ్ షికార్లు, వాటర్ స్కీయింగ్, సర్ఫింగ్, సైట్ సీయింగ్ ఒకటేమిటి? ముఖ్యంగా హాలీవుడ్‌లో నా ఫేవరిట్ స్టార్లనందర్ని చూశాను ఐ మీన్, ఆల్‌మోస్ట్ అందర్ని! సినిమా షూటింగులెలా తీస్తారో చూశాను

నీకు తెలుసా, సినిమాలో వర్షంలా మనల్ని భ్రమింపజేసేది పాలజల్లని? నేనంతకుముందు పైనుండి నీళ్ళు గుమ్మరిస్తారనుకునేవాణ్ని పాలజల్లైతేగాని తెరమీద నీళ్ళజల్లులా కనబడదట!

హీరోలు పెద్దపోజుకొట్టి కష్టపడి ఎత్తిపడేసేవి బండరాళ్ళు కావు దూదితోనో, అంతకంటే తేలికైన దానితోనో చెసిన రాళ్ళ ఆకారాలు మాత్రమే! అలా చెప్పుకుంటూ పోతే ఎన్నో! అవన్నీ చూసినాక ఇప్పుడు సినిమాలు చూస్తుంటే ఏడవ్వాలసినచోట పొట్ట పగిలేలా నవ్వొస్తోంది నా సలహా ఏమిటంటే, సినిమా ఎంజాయ్ చెయ్యాలనుకునే వాళ్ళు షూటింగులు చూడనేకూడదు పిడికిలి మూసివుంటేనే అందం!–

హె, మల్లికా! నేను చెప్పేది వింటున్నావా? వులిక్కిపడి చూసింది మల్లిక

సారీ! ఏమిటంటున్నావ్?

ఇంతా వాగనిచ్చి ఏమిటంటున్నావని అడుగుతున్నావా? ఓకె! వాటీజ్ రాంగ్?

'ఏంలేదు నీ మాటల్ను వినీవినీ బోర్ కొట్టింది '

'నా మాటలు నీకు బోరని తెలుసుగానీ అసలు సంగతి చెప్పు '

'ఏదైనా కారణం వుండాలనీ, వున్నా అది నీకు చెప్పాలనీ ఎక్కడైనా వ్రాసిపెట్టి వుందా?' ఎలాగోలా అతన్ని ఒదిలించుకోవాలని అంది

ఫిలిప్ కొంచమైనా చెలించలేదు సరిగదా వున్నచోటునుండి కదలలేదు అతని దృష్టి టేబుల్‌మీదున్న మల్లిక చేతుల మీద నిలిచింది

ఆ, ఇప్పుడు తెలిసింది! నీ భర్తతో తెగతెంపులు చేసుకున్నావ్!" సంబరంగా అన్నాడు

కోపంగా చూసింది మల్లిక నీ ఈ స్టుపిడ్ డిస్కవరీకి ఆధారమేమిటో తెలుసుకోవచ్చా?'

అదుగో, ఖాళీగావున్న నీ ఎడం చేతి వేలు!' గర్వంగా అన్నాడు

ఎడంచెయ్యి చూసుకుంది మల్లిక ప్రొద్దున్న స్నానం చేసినప్పుడు వుంగరంతీసి మళ్ళీ పెట్టుకోవటం మర్చిపోయినట్టుంది

ఆత్రంగా చూస్తున్న ఫిలిప్ ముఖం చూస్తే నవ్వొచ్చింది

నీ అతి తెలివికి సంతోషించాం గాని నీ అభిప్రాయం శుద్ధ తప్పు!' లేచి నిలబడింది

బెటర్ లక్ నెక్ట్స్ టైం! అనుకుంటూ వెళ్ళిపోయాడు ఫిలిప్.

అతను వెళ్ళినవైపె కాస్సేపు చూసి తన ఆఫీసురూంలోకి వెళ్ళింది మల్లిక మనస్సంతా ఇందాకటికంటే తేలిగ్గావుంది జోవియల్‌గా మాట్లాడటంలో ఫిలిప్‌కున్న నేర్పు ఇంకెవరికీ లేదేమో!

ఫిలిప్‌తో పరిచయం గుర్తొచ్చింది

అతను రెండేళ్ళ క్రిందట ఆఫీసులో చేరాడు చాలా వుత్సాహంగా, చలాకీగా వుంటాడు అతను పనిచేసేది అకౌంటింగ్ డిపార్ట్‌మెంట్లో అయినా మిగతా అన్ని డిపార్ట్‌మెంట్ల వాళ్ళతో నూ స్నేహంగా వుంటాడు

ఒకరోజు ఏదో పనుండి ఎకౌంటింగ్ ఆఫీసుకి వెళ్ళింది మల్లిక పని పూర్తిచేసుకుని వస్తుండగా ఫిలిప్ ఎదురొచ్చాడు

హల్లో! నాపేరు ఫిలిప్ మిమ్మల్ని చాలాసార్లు చూశానుగాని పేరు తెలియదు " అంటూ నిలదీశాడు

మల్లిక అని వచ్చెయ్యబోయింది

అద్భుతొలగలేదు ఫిలిప్ 'మనిషిలాగే పేరూ అందంగా వుంది! అన్నాడు

ఇబ్బందిగా చూసింది మల్లిక

' నాదగ్గర 'బ్రోడ్‌వే షో'కి రెండు టిక్కెట్లున్నాయి మీ కభ్యంతరం లేకపోతే సాయంత్రం వెళ్దాం, వస్తారా? మర్యాదగా అడిగాడు

ఎదురుచూడని ఆ ఆహ్వానానికి తెల్లబోయింది మల్లిక బైటికి కనపడకుండానే, థాంక్స్ ఫర్ ది ఆఫర్! కానీ రాలేను ' అంది

కారణం తెలుసుకోవచ్చా?'

నిరభ్యంతరంగా'నేను పెళ్ళయినదాన్ని'

ఫిలిప్ తెల్లబోయినట్టు అతని ముఖంలో స్పష్టంగా కనపడింది 'మీరంత చిన్నగా వుంటేనూ

మీవేలికి వెడ్డింగ్ రింగ్ లేకపోతేనూ అంటూ తడబడ్డాడు

ఇట్సాల్‌రైట్! మీ వయస్సెంతో చెబుతారా? అడిగింది సంబంధంలేని ఆ ప్రశ్నకు కాస్త తికమకపడినా చెప్పాడు

'ఇరవై

' దానికి కనీసం పదేళ్ళు కలుపుకుంటే అది నా వయస్సు " నిశ్చేష్టుడై ఇటే చూస్తున్న ఫిలిప్‌ని వదిలి వచ్చేసింది మల్లిక

ఆ తర్వాత పెళ్ళికి భార్గవ్ కొనిపెట్టిన వెడ్డింగ్ రింగ్ విడవకుండా పెట్టుకోవడం మొదలెట్టింది

మల్లికకు పెళ్ళయిందని తెలిసినా, ఫిలిప్ ఏదో ఒక విషయం మీద ఆమెను కామెంటో, కాంప్లిమెంటో చేస్తూనే వుంటాడు ఆమె చర్యలను గమనిస్తూనే వుంటాడు

ఒకసారి మల్లిక జుట్టు బాగా షార్ట్‌గా కట్ చేయించుకుంది

"నీ అందమైన పొడుగాటి జుట్టుకి ఏ గతి పట్టించావో చూడు!" అంటూ చాలా విచారపడ్డాడు

మల్లికకు మొదట్లో ఫిలిప్ తనమీద చూపిస్తున్న ఇంటరెస్ట్‌కి చిరాకనిపించినా, రానురాను అతని ఆసక్తి హానికరమైనది కాదని, కేవలం స్నేహ పూరితమైనదని గమనించాక తనూ చనువుగా వుండటం మొదలుపెట్టింది

*           *           *           *

మల్లిక ఏదో సెమినార్‌వల్ల లేటుగా ఇంటికొచ్చింది భార్గవ్ అంతకు ముందేవచ్చి పేపర్ చదువుతూ సోఫాలో పడుకున్నాడు

బాగా అలిసిపోయి వుంది మల్లిక చేసిన వంటేమీలేదు ఇప్పుడు వంట చెయ్యాలనిలేదు

"ఇప్పుడు వంట చేసే ఓపికలేదు బైట తిందామా?

'ఇప్పుడు కదిలే ఓపిక కూడాలేదు ఏదో ఒకటి ఒండేయ్' అన్నాడు భార్గవ్

# కొవ్వొత్తుల చిరువెలుగులలో... గులాబీపూల సువాసనలలో...

మేమిద్దరమే వున్న
ఏకాంతంలో!



# ఏముండాలి విందు భోజనంలో?

ఆ విందు చాలా ప్రత్యేకంగా ఉండాలి మరి ఎందుకంటే
మీరు ప్రత్యేకమైన వారికోసం వంట చేస్తున్నారు
కాబట్టీ
అప్పుడు మీకు కావలసినవి విజయ పాల ఉత్పాదనలు
విజయ వెన్న, నెయ్యి, జున్ను, పాలపొడి ఏదైనా కానీ మీ
వంటకు ప్రత్యేకమయిన రుచిని ఇస్తాయి
నిముషాలలో తయారు చేసే ఫలహారం కానీ షడ్రుచుల
విందుభోజనం కానీ విజయ రుచి విశిష్టం
ఎప్పుడూ విజయ ఉత్పాదనలను మీ అందుబాటులో
ఉంచుకోండి ఎందుకంటే ఎప్పుడు అవసరం వస్తుందో ఎవరికి
తెలుసు ?

**ఆంధ్ర ప్రదేశ్ పాడి పరిశ్రమ సమాఖ్య**
లాలా పేట, హైదరాబాదు - 500 017






# విజయ. అది లేకుంటే విందులో స్వారస్యం ఎక్కడిదిమరి!

APDDC/37/85/Tel

# మల్లిక

పేపర్లోనుండి తలెత్తకుండానే

కిచన్ సింక్‌లోనుండి మురికిపాత్రలు స్టేర్ చేస్తున్నాయి అవన్నీ కడిగి వంట చెయ్యాలనే ఆలోచన ఆమెకు కళ్లనీళ్లు పర్యంతంగా వుంది!

భార్గవ్ కొంచెం హెల్ప్ చేస్తావా? కిచన్‌లో చాలా పనుంది విదిలేక అడిగింది

హెల్ప్ చెయ్యటమా? అన్నం కలిపి ముద్దలు తినిపించాలి నువ్వు అలావుంది పరిస్థితి!

అతని మాటలకు ఒళ్లు మండింది

నా పరిస్థితీ అలాగే వుంది తప్పక చెయ్యటమేగాని సరదా అనుకుంటున్నావా?

అలా అయితే పెందలాడే ఇంటికొచ్చెయ్యకూడదూ?

సెమినార్ వుందని చెప్పలేదూ?

ఆ సెమినార్‌కి వుండకపోతే ఏం పోయిందటా?

సెమినార్ ఇచ్చేవాళ్లు సెమినార్‌లో వుండితీరాలని వేరే చెప్పాలా?

'మానేసేయ్ వెధవ వుద్యోగం! నువ్విప్పుడు వుద్యోగం చెయ్యకపోతే మనకు తరిగేదేం వుండదు

అలాగే నిలబడిపోయింది మల్లిక పూర్వపు రోజుల్లో, తనుకాస్త అలిసిపోయి ఇంటికొస్తే ఎంత హడావిడి చేసేవాడు! వుద్యోగం మీద తనకున్న శ్రద్ధను ఎంత గౌరవించేవాడు! అదంతా ఏమయ్యిందో?

ఆ రాత్రి భార్గవ్ చిన్న మెత్తు సహాయం చెయ్యకుండానే మల్లికే కిచన్‌లో పనంతా చేసుకుంది

★ ★ ★ ★

ఇంకా ఎంత కాలం పడాలో ఈ పాట్లు? ఎక్సర్‌సైజ్ బైక్ మీద పెడల్ తొక్కుతున్న అంజలి ఒగరుస్తూ అంది

ఇప్పటికి ఎన్ని పౌన్లు తగ్గావ్? తనూ బైక్ తొక్కుతూ అడిగింది మల్లిక

పది!

అయితే ఇంకొక పదేగా తగ్గాల్సింది?

అంత తేలిగ్గా అనకు ఈ పదీ తగ్గటానికి నేను పడిన పాట్లు పగవాళ్లకు కూడావద్దు! కడుపునిండా తిండిలేదు కంటినిండా నిద్రలేదు ఇంక ఎందుకొచ్చిన బ్రతుకు? పగలు పశువుల్లా ఆకులూ అలములూ నమలటం, రాత్రిళ్లు ఒళ్లు నొప్పులతో పక్కమీద దొర్లటం! పోనీ ఇలాగే కష్టపడి ఆ పది పౌన్లూ తగ్గాననుకో! అంతటితో ఆగుతుందా? వుహు! మళ్లీ బరువు పెరక్కుండా జీవితాంతం అలా చేస్తూనే వుండాలిట నావల్లకాదు బాబూ!

మరీ దారుణంగా మాట్లాడకు మొదట్లో వున్నంత కష్టం తర్వాత తర్వాత వుండదు మనం బొత్తిగా శారీరక శ్రమ చెయ్యకపోవటంతో మొదట్లో అలాగే వుంటుంది అలవాటైనాక నువ్వు మానమన్నా మానవు, చూస్తుండు!

ఏం అలవాటవ్వటమో! ఈ మధ్యలో ఆకలితో నా ప్రాణాలు పోకుండా వుంటే చాలు!

చాల్లే నీ అతిశయం మాటలూ, నువ్వూను! కాస్త తిండి తగ్గించినంత మాత్రానే ప్రాణాలు పోతాయా? కసురుకుంది మల్లిక

కాస్త లావుగా వుంటే ఏమవుతుందో? మరీ ఈ దేశంలోనే ఈ విపరీతం! ఎవరి నోట విన్నా డైటింగ్, ఎక్సర్‌సైజింగ్ ఇవే మాటలు ఇదొక పెద్ద ఫ్యాషనైపోయింది! మనుషులకే కాక జంతువులక్కూడా! కుక్కలూ పిల్లులూ లావు కాకుండా వుండటానికి వాటికి ప్రత్యేకమైన ఫుడ్! వీళ్ళకి డబ్బెక్కువై క్రిందామీదా కానకుండా వుంది 'అక్కసుగా అంది అంజలి

పోనీ అలాగే అనుకో! డబ్బూ, అవకాశమూ వున్నప్పుడు శరీరాన్ని చక్కగా వుంచుకోవటంలో తప్పేముంది? వూబగా వుండటం కంటే సన్నగా వుండటం అందమే కాకుండా ఆరోగ్యం కూడానని జగమెరిగిన సత్యమే కదా? అందులోనూ, వెస్ట్రన్ దేశాల్లో సన్నగా వుండటం స్టేటస్ సింబల్! మనదేశంలో ఎంత లావుగా

వుంటే వాళ్ళకంత డబ్బూ, దర్పం వుందని గుర్తు. ఇక్కడ ఎంత డబ్బుంటే అంత సన్నగా వుండటం గొప్ప! అదీగాక ప్రతిసారీ నువ్వు తగ్గించే గుప్పెడు భోజనానికి నీ ఆయుఃప్రమాణం ఒక గంటైనా పెరుగుతుందట, తెలుసా?

నిజమేననుకో కాని, ఆ జెల్లోని చూడు? రెండు నెలల నుండీ చూస్తున్నా ఆ శరీరంలో మార్పొచ్చినట్లే కనబట్టంలేదు దున్నపోతు మీద నీళ్ళు పోసినట్లు కదలికే లేదు నేను మాత్రం తగ్గగలనంటావా? దిగులుగా అంది అంజలి

నీకూ ఆవిడకూ పోలికేమిటి? శరీరాన్ని ఆ స్థితికి తీసుకొచ్చినాక మళ్ళ మామూలుగా అవ్వటం మిరకలే! ఎంతో శ్రమ చెయ్యాలి ఎంతో కాలం చెయ్యాలి ఇప్పుడు నువ్వు పడుతున్న కష్టం దాన్లో వందో వంతు కూడా లేదు అందుకే, ఆ స్థితికి రాకముందే జాగ్రత్తపడమనేది

హూ అంటూ మూలిగింది అంజలి, ఇక మాట్లాడే ఓపికలేక

రెడ్‌లైట్ రావటంతో కారాపింది మల్లిక

నాలుగురోడ్ల పెద్ద కూడలి అది! ఒక్కొక్క రోడ్డుకీ మూడు లేన్లున్నాయి మొత్తం నాలుగు వైపులా పన్నెండు లేన్లు అయినా అన్నీ సందులేకుండా కార్లతో నిండిపోయి వున్నాయి

గ్రీన్‌లైట్ కోసం ఎదురు చూసేవి కొన్నైతే లైటు రాగానే చకచకా నేరుగా కదిలి వెళ్ళేవి కొన్ని, చుట్టూ చూసుకుని కుడిమలుపు తిప్పేవి కొన్ని, ఎడమవైపు తిప్పేవి మరికొన్ని ఆ దృశ్యం యుద్ధరంగంలో సైనికులు ఒక పద్ధతిలో పన్నిన వ్యూహంలా చూట్టానికి చాలా ఆసక్తికరంగా వుంటుంది

గ్రీన్‌లైట్ కోసం చూస్తూ మల్లిక వాటినే గమనిస్తోంది

లైటు రాగానే కారు ముందుకు పోనిచ్చింది ప్రక్కలేన్‌లో నుండి ఒక స్పోర్ట్స్ కారు మల్లిక కారుని దూసుకుపోయింది ఆ కారంతా పువ్వుల మాలలతో, రంగురంగుల కాయితాలతో అలంకరించి వుంది

కారు వెనక 'ఇప్పుడే పెళ్ళయ్యింది' అన్న బోర్డు వ్రేళ్ళాడుతోంది!

హనీమూన్ ఆత్రంలో వున్నట్లున్నారు– అనుకుంటుంటే మల్లిక పెదవుల మీద చిరునవ్వు కదిలింది ఆమె మదిలో ఇంకొక విషయం కూడా మెదిలింది

ఇవ్వాళే వాళ్ళ తొమ్మిదవ వెడ్డింగ్ యానివర్సరీ!

ప్రతిసారి భార్గవ్ డిన్నర్‌కి బైటికి తీసికెళ్ళేవాడు అప్పటి దాకా గుర్తు లేనట్లే ప్రవర్తించి, అప్పటికప్పుడు ఏదో ఒక కానుకతో సర్‌ప్రైజ్ చేసేవాడు

అప్పుడే పెళ్ళై తొమ్మిది సంవత్సరాలైందంటే ఆశ్చర్యంగా వుంది మల్లికకు తమ పెళ్ళిరోజు– ఇంకా నిన్నోమొన్నో జరిగినట్లు కళ్ళకు కడుతోంది

ఆ రోజు– పెళ్ళి సంతకాల తర్వాత అపార్ట్‌మెంట్‌లోనే చిన్న పార్టీ అరేంజ్ చేసింది లూసీ

వెడ్డింగ్ కేక్, షాంపేన్, ఆర్‌డర్వ్స్, బెలూన్స్, సాఫ్ట్ మ్యూజిక్, వెడ్డింగ్ చీర్స్ – వీటన్నిటి మధ్యా అతిదులు వుత్సాహంతో కేరింతలు కొడుతున్నారు

వీలు చూసుకుని మల్లిక దగ్గరకొచ్చాడు భార్గవ్

పద మనమిక వెళ్ళిపోదాం వీళ్ళ కేరింతలు ఇప్పుడప్పుడే సమసిపోవు నెమ్మదిగా అన్నాడు

ఇబ్బందిగా చూసింది మల్లిక మన కోసం ఇంత కష్టపడి పార్టీ అరేంజ్ చేస్తే మనం మధ్యలోనే వెళ్ళిపోతే బాగుంటుందా?

అసలు పెళ్ళి పార్టీ అనేది అతిదుల కోసమేనోయ్! మన పార్టీ వేరే వుంది మనం వెళితే వాళ్ళేం అనుకోరు పైగా వెళ్ళకుండా ఇక్కడుంటేనే ఏమైనా అనుకోగలరు!

అందరికీ థాంక్స్ చెప్పి, అందరి దగ్గరా శెలవు తీసుకుని, వాళ్ళు వేసే జోక్స్‌కి మనస్సులోనే నవ్వుకుంటూ బైటికి వచ్చేశారు

(ఇంకా ఉంది)

# అభ్యంజనం

–పులికంటి కృష్ణారెడ్డి

ఓయీ! మనిషీ!!
వెర్రి నవ్వులయవనికపై
నాగరికతా నగిషీ!
రాతి నెత్తిన నీళ్ళు పోస్తే
అభిషేకం!
నీ నెత్తిన నీళ్ళు పోస్తే
అభ్యంజనం!
అభిషేకజలం పవిత్ర తీర్థం!
అభ్యంజన జలం మురికిమయం!!
నిన్ను చేరిన క్షణం
మైలపడుతున్న పరిశుద్ధ జలం
నీలో పేరుకొన్న మురికికి నిదర్శనం!
రాతి కంటే హీనమైన ఓ మనిషీ
రాతి ముందర నిలబడి మొక్కితే కాలేవు ఋషి!
బక ధ్యానాలు కట్టిపెట్టు
శుకపిక ధ్యానాలు వదలిపెట్టు
అట్టహాసాలు అణచిపెట్టు
పరిహాసాలు ప్రక్కన పెట్టు
కులమత వర్గ విద్వేషాల విడిచిపెట్టు
హింసా ప్రవృత్తిని తరిమికొట్టు
సమైక్య సందేశామృత భావ వీచికలు
ఉవ్వెత్తుగా లేచే హృదయ సరస్సును వెదకి పట్టు! –
క్షణ క్షణము మైలపడుతున్న మనస్సును
అణుక్షణము అందులో పడి కడుక్కో!
మనస్సుకు అభ్యంజనం
మానవాళికి అభిషేకమని నేర్చుకో!

# నింగి చుంబించిన నేల

## జి. భాను

పశ్చిమ దిగ్భాగం రాగరంజితమైంది!

అన్ని ప్రాణులు తమ స్థావరాలు చేరుకొనే ప్రయత్నంలో ఉన్నాయి!

ఆ సమయంలో ఆ ఇంటి ముందు 'మాదవయ్యా గారూ!' అని ఒక యువకుని గొంతు విన్పించింది

'ఉన్నారు రండి కూర్చోండి' ఒక యువతి గొంతు సమాధానం ఇచ్చింది ఆ క్రొత్త గొంతులోని తీయందనానికి విస్తుపోయి, సాలోచనగా, పరిచయమైన ఆ పెంకుటింటి వసారాలో కుర్చీ మీద కూర్చున్నాడు సూర్యప్రకాశరావు పాత పత్రికల పేజీలు తిప్పుతూ ఉండగా మాధవయ్యా గారు ద్వారానికి ఉన్న కర్టెన్ తొలగించి, ఆ యువకుణ్ని చూసి, కన్నుల్లో వెన్నెల కాయగా 'ఓహో! సూర్యప్రకాశరావ్! ఈ రోజు సుదినం!' అన్నాడు

'నమస్కారం మాష్టారూ! మూణెల్ల తర్వాత మీ ఇంటికి రావడమే నాకు సుదినం! ఓ సారి చూసి పోదామని వచ్చాను ' గౌరవపూర్వకంగా అన్నాడు

'చాలా సంతోషం! అమ్మా భూదేవీ! కాఫీ పెట్టమ్మా' అని మాదవయ్యా సూర్యప్రకాశరావు ఎదురుగా పడక కుర్చీలో కూర్చున్నాడు

'ఏమిటి ప్రకాశరావ్! మా మీద శీతకన్ను వేసినట్టున్నావ్? నుమ్మల్ని బొత్తిగా మర్చి పోయావన్న మాట! ఏమైనా విశేషాలున్నాయా? మీ అమ్మగారూ, చెల్లెళ్ళు, తమ్ముడూ భాగున్నట్టు ఉత్తరాలు వస్తున్నాయా? నిన్ను గురించే ఈ మధ్య మరీమరీ మనస్సులో అనుకొంటున్నాను ఒంట్లో బాగుండక రాలేదు గానీ కాలేజీకే వద్దామనుకొన్నాను ఎందుకో ఈ మద్య సన్ని హితుల్ని, ఆత్మీయుల్ని చూడాలని అని పిస్తోంది ఏమైనా నువ్వొచ్చావు అదే సంతోషం!' మాధవయ్యా సూర్యప్రకాశరావును కన్నారా చూస్తూ మాట్లాడుతున్నాడు

మాదవయ్యా ఆర్ద్రమైన అంతరంగం సూర్య ప్రకాశరావును విచలితుణ్ని చేసింది!

నిజానికి ఏమంత పరిచయం ఉందని మాదవయ్యా తనని సన్నిహితునిగా భావించారు?

ఆ పరిచయం కూడా కేవలం మానవతా కారణాల దృష్ట్యా ఏర్పడ్డ అల్ప సంఘటను పురస్కరించే గాని అసాదారణమైందేమీ కాదు! కానీ ఆ సంపటనే మాదవయ్యా మంచి హృదయంలో మంచి గంధంలా గుబాళిస్తుందన్న మాట!

ఆ రోజు – ఉదయం పది పదకొండు గంటల మధ్య స్టేట్‌బాంక్‌లో చెక్ మార్చుకొని డబ్బు తీసుకొంటూనే హఠాత్తుగా కళ్ళు తిరిగి పడబోయాడు మాదవయ్యా కానీ వెనక ఉన్న సూర్యప్రకాశరావు ఆయన్ని పడకుండా పట్టుకొని, సోఫాలో కూర్చోబెట్టి మంచినీళ్ళు ముఖం మీద జల్లి, కొంచెం తాగించినప్పటికీ మగత నుంచి తేరుకోలేదు అందుకని దగ్గరే ఉన్న సుదా క్లినిక్‌కు రిక్షా మీద తీసుకొని వెళ్ళి, బెడ్‌లో చేర్పించి ఇంజెక్షన్లు, మందులు వాడగా సాయంత్రానికి గాని మాదవయ్యకు సరిగా స్పృహ రాలేదు తర్వాత ఆయన్ని ఇంటికి తీసుకొని వెళ్ళేటప్పటికి తండ్రి ఏమయ్యాడో అర్థం కాక వ్యాకుల స్థితిలో ఉన్న ఇద్దరు ఆడపిల్లలు, ఒక కుర్రవాడు ప్రాణం లేచి వచ్చినంత సంబరపడ్డారు తల్లి లేని వాళ్ళకి తండ్రే సమస్తమని సూర్యప్రకాశరావుకు అవగతమైంది ఆనాడు వారి దృష్టిలో తానొక ఆపద్బంధువు! కరుణా రస సింధువు!

అప్పటి నుండి ప్రకాశరావు ఆ ఇంటి సభ్యుడైపోయాడు ఆ ఇంట్లో అందరికీ అతడంటే ఒక ప్రత్యేకమైన గౌరవం! అనంతమైన అభిమానం! అఖండమైన సాన్నిహిత్యం!

పన్నెండు మాసాల క్రిందట ఆ సంఘటన ప్రకాశరావు మనోదర్పణంపై నీడగా కదిలింది తర్వాత లోకంలో పడి, 'శ్రీదేవీ, భవానీ, మధు కనబడరే? ఏమయ్యారు? ఇల్లంతా నిశ్శబ్దంగా ఉందే' అన్నాడు

'ప్రకాశ్! వాళ్ళకి మహాయోగం పట్టింది ఓ మహాతల్లి రాక మూలంగా మ్యాట్నీకి వెళ్ళారు ఈ మద్య వాళ్ళకి ఇటువంటి అవకాశాలు దొరుకు తున్నాయిలే!'

'మహాయోగం, మహాతల్లి రాక, అవకాశాలు దొ ర కడం – నాకు సరిగా అర్థం కాలేదండి' అన్నాడు ప్రకాశ్

అంతలోనే కాఫీ గ్లాసులతో ప్రవేశించిన అమ్మాయిని చూపిస్తూ మాధవయ్యా 'ప్రకాశరావ్! మా పెద్ద అమ్మాయి మహాతల్లి భూదేవి రెండు నెలల క్రిందటే వచ్చింది ఇంత కాలం వరకూ మా తమ్ముడి ఇంట్లో ఉంది అదివరకే చెప్పాను గదా నీకు అన్ని విషయాలు! ఇంతవరకూ చాకిరీ చేయించుకొని, పెళ్ళి చేయబడుతుందని ఏవో వంకలు చెప్పి ఇక్కడకు పంపేశారు అయితే అయింది ఇక్కడే వుంటుంది ఇక నా తల్లి రావడం మూలంగా ఈ ముగ్గురికీ మహాయోగం పట్టి కాళ్ళు వచ్చాయి ఇటువంటి మ్యాట్నీ అవకాశాలు వస్తున్నవి అర్థమైందా?' అని ఒకగ్లాసు అందు కొని ప్రకాశరావుకు ఇచ్చి, ఇంకోటి తాను తీసు కొన్నాడు

'అమ్మా! దేవీ! సూర్యప్రకాశరావు అని చెప్పానే అతనే ఇతను! వీరే లేకపోతే నీ తమ్ముడు ఇంటర్ ప్యాసయ్యేవాడు కాదు సుమా!'

నమస్కారం' అన్నది భూదేవి మెరుస్తున్న కన్నులతో

ఆమె నమస్కారం అన్నప్పుడు అభివ్యక్తమైన విశాల నయనాల్లోని తళుక్కును చూసినప్పుడు, ఏ నాడూ పరవశం పొందని హృదయంలో ఏదో మధుర భావన మోసులెత్తగా అతనిలోని క్రొత్తదనం అతనికే క్రొత్తనిపించింది

భూదేవి ఇంట్లోకి వెళ్ళిన తర్వాత 'నా కింకో బరువు' అని నవ్వి, 'కాఫీ చల్లారిపోతున్నది!' అని మాదవయ్యా ప్రకాశరావును హెచ్చరించాడు

కాఫీ తాగిన తర్వాత 'ప్రకాశరావ్! ఇక్కడ విశేషాలు లేవు నువ్వే చెప్పాలి ఉంటే ఏమైనా! ఈ మూణ్నెల్లలో జరిగిన వింతలు, విశేషాలు చెప్పు అదివరకు కొంత చెప్పావు గదూ! అదే మీ చెల్లెళ్ళ పెళ్ళిళ్ళు ఎంత వరకొచ్చాయి? తమ్ముడు బాగా చదువుతున్నాడా?'

ఆఁ భారతి పెళ్ళి సెటిల్ అయ్యింది ఆ తిరుగుళ్ళు మూలంగానే నేను ఇక్కడకు రాలేక పోయాను కొన్ని పరిస్థితుల మూలంగా ప్రమీల పెళ్ళి వచ్చే ఏటికి వాయిదా పడింది ఇద్దరిదీ ఒకేసారి అయినట్లయితే బర్డన్ తొలగి పోయేది! ఇక తమ్ముడు ప్రసాద్‌కు కూడా వచ్చే సంవత్సరానికి డిగ్రీ పూర్తి అవుతుంది అప్పటివరకు మా అమ్మకు నిద్ర ఉండదు నాకు విశ్రాంతి ఉండదు జీవితం అంటే సమస్యల పజిల్‌లాగా ఉన్నది మాష్టారు అని చెప్పి గాడంగా నిట్టూర్చాడు

ప్రకాశరావు కన్నుల్లోకి చూసి బరువుగా నవ్వాడు మాదవయ్యా

అసలు విషయం మర్చి పోయాను నాకు హైదరాబాద్ ట్రాన్స్‌ఫర్ అయ్యింది రిలీవ్ అయి, ఇంటికి వెళ్ళి వచ్చాను రెండు రోజుల్లో వెళ్ళి జాయిన్ అవ్వాలి ఈ విషయం చెబుదామనే ముఖ్యంగా మీ దగ్గరకు వచ్చాను

అరే! అట్లాగా!! మాదవయ్యా, ఆశ్చర్యంగా అన్నాడు

రెండు నిముషాలు ఎవరూ మాట్లాడలేదు

'ఈ బదిలీలు జీవితంలో మజిలీల వంటివి ప్రకాశ్ కొంత మంది కలత చెందుతారు కొంత మంది

సంతోషంగా స్వీకరిస్తారు నువ్వు యువకుడివి ఎంతో సర్వీసు, భవిష్యత్తు ఉన్న వాడివి ఇంకా ఎన్నో ప్రదేశాలు చూడాలి లోకాన్ని అర్థం చేసుకోవాలి ఈ ప్రదేశంలో మన పరిచయం ఆప్యాయతల సంగమం నీ ట్రాన్సుఫర్‌ను పురస్కరించుకొని ఈ పూట మా ఇంట్లో బోజనం చేయాలి

మాష్టారూ' ఎన్నిసార్లు మీ అతిదిని కాలేదు?

ఆ ఎన్నోసార్లు వేరు' ఇప్పటి పరిస్థితి వేరు'

వారిని తప్పనిసరిగా ఉండమనండి నాన్నా కొద్ది సేపట్లో అంతా రెడీయై పోతుంది కర్టన్ వెనుక నుండి కోమలమైన కంఠం పలికింది

ఆఁ ప్రకాశ్' ఇక నువ్వు కాదనకూడదు అని మాదవయ్య అంటే, ప్రకాశరావు చిరునవ్వు నవ్వాడు

అదే సమయంలో మ్యాట్నీ నుండి వచ్చిన శ్రీదేవి బవాని, మదు సూర్యప్రకాశరావుని చూసి సంతోషం ప్రకటించారు ప్రకాశరావు ఆ ముగ్గుర్ని అబిమానంగా పలకరించాడు తండ్రి చెప్పిన ట్రాన్సుపర్ వార్త విని క్రుంగి పోయారు మదు అయితే ఏడ్పును ఆపుకోలేకపోయాడు ఒక మంచి వ్యక్తి, హితోబిలాష ఈ బదిలీ మూలంగా దూరమౌతున్నాడనే బాద అందరి మనస్సుల్లో నిశ్శబ్దంగా గూడు కట్టుకొనే ఉంది'

బోజనానికి కూర్చున్నప్పుడు ప్రకాశరావుకు ఒక విషయం విస్మయాన్ని కలిగించింది విస్తరిలో ఉన్న పదార్థాలన్నీ తనకు ఇష్టమైనవే' తన పరోక్షంలో కూడా తన అబిరుచుల్ని కనుక్కోగలిగిన, బూదేవి సామాన్యురాలు కాదని పించింది కొసరి కొసరి వడ్డించిన ఆమె ఆప్యాయత ప్రకాశరావు గుండెలో పొగడ పూలదండే అయ్యింది'

కురియని మబ్బుల్లాగా పగలని అగ్ని పర్వతాల్లాగా ఉన్న ఆ కుటుంబ సభ్యుల నుండి సూర్యప్రకాశరావు వీడ్కోలు తీసుకొన్నాడు అతని బరువెక్కిన గుండెలో రూపు కట్టని దృశ్యాలు నాట్యం చేస్తున్నాయి'

కాల ప్రవాహంలో మూడు సంవత్సర బిందువులు లీనమైనాయి'

ఒకనాటి వసంత కాలంలో సాయంత్రం'




మాదవయ్య గారూ' అని ఒక యువకుని గంభీరమైన గొంతు ధ్వనించింది ఇంటిలోని కుట్టుమిషన్ శబ్దం ఆగిపోయింది వచ్చిన వ్యక్తి మళ్ళీ పిల్చాడు ఎవరూ' విసుగుతో కూడిన యువతి గొంతు వినబడింది

ఉద్వేగంగా ఎదురుచూస్తున్న ఆ వ్యక్తికి కొద్ది క్షణాల తర్వాత ఆ యువతి రూపం సాక్షాత్కరించింది'

ఎదురుగా ఫుల్ సూట్‌లో నిల్చున్న గాగుల్స్‌లో

అందమైన భారీ విగ్రహం!

నిర్ఘాంతపడి, బొమ్మలా నిలబడి పోయింది భూదేవి! తర్వాత తేరుకొని ఒక్క అడుగు వెనక్కు వేసి మీ మీరా? అంది అణచి పెట్టుకొన్న ఆసక్తి ఆ మాటలో బ్రద్ధలైంది

అవును భూదేవీ! సారీ భూదేవిగారు నేను ప్రకాశరావును . మళ్ళా ఈ వూరు ట్రాన్సుఫర్ మీద వచ్చాను మీ నాన్నగారు ఉన్నారా? అడిగాడు ఆమె ఆపాదమస్తకం చూపులతో స్పృశిస్తూ

కూర్చోండి అన్నది నిలబడి కూర్చున్నాడు ప్రకాశరావు

ఆ ఇరువురి మధ్య నిశ్శబ్దం నిలబడింది!

మాట్లాడరేం?'

మా నాన్నగారు తిరిగిరాని చోటికి వెళ్ళి 'పోయారు అతి ప్రయత్నం మీద దుర్భర దుఃఖాన్ని ఆపుకొన్నది

'ఆఁ ఎంత కాలమైంది?'

రెండేళ్ళయ్యింది

అప్పుడు నేను ఎక్కడ ఉన్నదీ తెలిసీ కూడా నాకు తెలియపర్చక పోవడం అన్యాయం కదూ?'

మీకు తెలియపర్చక పోవడం పరమ న్యాయ మంటాను

ఎలాగో చెప్పండి మరీ దారుణంగా మాట్లాడు తున్నారు

ఒక క్షణం మౌనం తర్వాత భూదేవి మాట్లాడింది

మీరేమైనా అనుకోండి మేము ఆ విషయాన్ని ఉద్దేశపూర్వకంగా తెలియపర్చక పోవడం దురుద్దేశంతో మాత్రం కాదు పై చదువుల కోసం ఎక్కడో దూరంగా అమెరికాలో ఉన్న మీ మానసిక ప్రశాంతిని నాశనం చేయడానికి మనస్కరించ లేదు పైగా ఇక్కడి సంగతులన్నీ మీకు రాయడం భావ్యం కాదనీ

అంటే మీ సంగతులు తెలుసుకొనేటంత సన్ని హితుణ్ని కాదనేగా మీ తాత్పర్యం? ఆమె ముఖం వైపు చూస్తూ అడిగాడు

క్షమించాలి మీరు మా కుటుంబానికి సన్ని హితులు. శ్రేయోభిలాషులు కాదని నేననడం లేదండీ అంతకు మించి ఆశించే పేరాశ మాకు లేదు మా దురదృష్టాల్ని, కన్నీటిని, కడగండ్లని మీ దృష్టికి తేవడం సముచితమేనా? అట్లా తెచ్చే అర్హత మాకేముంది? గొంతు గద్గదికమైంది

ఓహో! అయితే మిమ్మల్ని ఐ మీన్ మీ కుటుంబాన్ని దగ్గరగా భావించే పేరాశ నాకుంది! దానికి అర్హతానర్హతలు అడ్డొస్తాయని నేను భావించడం లేదు ఇటువంటి ఉద్దేశాలతో ఉండి మీరు సరిగా ఉత్తరాలు రాయించ లేదన్న మాట

# రాగిమాల్ట్

కావలసిన వస్తువులు –

రాగులు 1 కిలో,
యాలకులు 10,
మిరాయి రంగు 1/2 స్పూను

తయారు చేయు విధానం :

ముందు రాగులు ఇసుక లేకుండా శుభ్రం చేసుకొని నీళ్లలో ఒక రాత్రి నానబెట్టాలి మర్నాడు నానిన రాగులను ఒక పాత బట్టలో మూటగట్టి మేకుకు తగిలించాలి ఆ మర్నాటికి రాగులు మొల కెత్తుతాయి మొలకెత్తిన రాగులను ఎండ పెట్టాలి బాగా తడి లేకుండా ఎండిన తరువాత సన్నటి సెగపై వెచ్చ చేసి చెరిగేస్తే పైపొట్టు ఎగిరిపోతుంది పొట్టు తీసిన రాగులను మెత్తగా మర పట్టించాలి (ఇంట్లో గ్రైండర్ ఉన్న వాళ్ళు గ్రైండర్‌లో వేసుకోవచ్చు) ఈ రాగి మాల్ట్‌లో మెత్తగా పొడి చేసిన యాలక పొడిని, మిరాయి రంగుని వేసి కలపాలి డబ్బాలో వేసి మూత పెడితే ఈ మాల్ట్ రెండు నెలలైనా నిలవ ఉంటుంది ఒక గ్లాసుడు నీళ్ళు మరగపెట్టి రెండు స్పూన్ల రాగి మాల్ట్‌ను ముందు చన్నీళ్లలో పేస్టులాగ చేసి మరిగే నీటిని అందులో పోసి అయిదు నిమిషాలు మూత పెట్టాలి తరువాత తేల్చి రెండు స్పూన్ల పంచదారా వీలైన వాళ్ళు కొంచెం పాలు కలిపి తాగితే యాలక సువాసనతో చాల రుచిగా ఉంటుంది పాలు కలపకపోయినా పరవాలేదు దీనిని పిల్లలు పెద్దలు కూడా తాగవచ్చు బలవర్ధకమైన పానీయం ఈ రాగి మాల్ట్

— ఇందిర

## నింగి చుంబించిన నేల

భూదేవిగారు మీరు క్రొత్తగా మారి పోయారు!

లేదు లేదు కొత్తగా మారి పోలేదు ఆ పాత మనిషినే నండీ ఆ పాత భావనలే నా ద్వాశం క్రొత్త భావనలకు జంకి లోలోన కుమిలి పోతున్నానే గాని . నేను అడ్డు కాలేదే!

మీ పాత భావనలకి క్రొత్త రంగు వేయించాలి. మీ పిరికి తనానికి ధైర్యాన్ని టానిక్‌గా ఇవ్వాలి అప్పుడుగాని సరిగా మాట్లాడరు సవ్యంగా ఆలోచించరు.. నాకు మధు ఎక్కడున్నాడో చెప్పండి

మధు కోపరేటివ్ బ్యాంక్‌లో గుమాస్తాగా ఉన్నాడు! మేం మీకు ఎంతో రుణపడి ఉన్నాం

మంచిదే! రుణాన్ని తీసుకొంటాను ప్రస్తుతానికి వస్తాను లేచాడు

ఓ నిముషం ఆగండి కాఫీ

ఇప్పుడు కాఫీ వద్దండి మీ చేతి వంట రుచి ఇంకా గుర్తున్నది భోజనానికే వస్తాను తొందరలో అని లేచి నాలుగైదు అడుగులు వెళ్ళి వెనక్కి తిరిగి చూశాడు స్థాణువులాగా నిలబడి చూస్తున్న భూదేవి కన్నులు బరువుగా వాలి పోయాయి

ఆటో కోపరేటివ్ బ్యాంక్ గేటులో ఆగడం, మధు ఎదురు రావటం కాకతాళీయంగా జరిగింది

'మధు ఆశ్చర్యానికి అవధులు లేవు 'ప్రకాశరావు గారూ! ఇది కలా? నిజమా? అన్నంత విచిత్రంగా ఉందండీ అని ఆనందం పట్టలేక కౌగలించు కొన్నంత పని చేశాడు ప్రకాశరావు మధు భుజం మీద చెతులువేసి ప్రేమగా స్పృశించాడు

ఈ రోజు ఎంత సుదినం! నేను ఇక్కడ ఉద్యోగం చేస్తున్నట్టు ఎవరు చెప్పారు మీకు?

మీ ఇంటి దగ్గర నుంచె వస్తున్నా

అయితే ఇంకే మా పెద్దక్క అన్ని విషయాలు చెప్పి వుంటుంది కాఫీ ఇచ్చి ఉంటుంది కన్నీళ్ళు పెట్టుకొని ఉంటుంది అయినా కాఫీ తీసుకొందాం పదండి

అదే వండర్ మీ అక్క ఏ సంగతీ సరిగా చెప్ప లేదు ముక్తసరిగా మాట్లాడింది కర్ర విరిచినట్లు మాట్లాడింది నేను ఎవరినో అన్నట్లుగా ప్రవ ర్తించింది కానీ ద్వంద్వ భావాల విషాదమూర్తి లాగా నాకు అన్పించింది అందుకే నీ వద్దకు రావలసి వచ్చింది

నిజంగానే? నడుస్తున్న మధు, ప్రకాశరావు ముఖం చూస్తూ అన్నాడు

మా అక్క ఎంత మనిషై పోయిందండీ మా నాన్నగారు పోయాక మరీను ఆ సంగతి వ్రాస్తానంటే వారి కెందుకురా? దూరంగా ఉన్న వారికి రాయడం మంచిది కాదు' అంది పోనీ ఇక్కడ విషయాలు, వార్తలు తెల్పుదాం అంటే– అంత అవసరమా? అనేది వారు ఉత్తరాలు రాస్తు న్నారుగా సమాధానం ఇవ్వొద్దా? అంటే సరే ఏదో వ్రాయి అనేది మీ సంగతి, నాన్న స్నేహాన్ని గుర్తు చేసుకొంటుంటే అందని పెద్ద వారిని గురించి అట్టే ఆలోచించడం మంచిది కాదు అనేది ఇదండీ మా అక్క తత్వం! ప్రపంచం అంతా స్వార్థమయమట! ఇది ఆమె సిద్ధాంతం మా చిన్నక్క లిద్దరికీ పెళ్ళి చేసింది! మీకు ఈ వివరాలు రాశాను ఆమె పెళ్ళి మాట ఎత్తితే గయ్యమని లేస్తుంది ఏదో అనాసక్తి, నిర్లిప్తత! అక్కతో మాట్లాడదా మంటే భయం! ఆ మిషన్ కుట్టడం, పూల మొక్కలు

పెంచడం, కూరగాయలు అమ్మడం ఆమె వ్యాపకం నాకు సంబంధాలు కూడా చూస్తున్నదండీ! అక్కకు నచ్చ జెప్పేదెట్లా?' నిట్టూర్పు విడిచాడు

వెళ్ళి హోటల్లో కూర్చున్నారు ఒక మూలన

ప్రకాశరావు తలలో భూదేవి తిరుగుతున్నది

తనలాగే జీవితాన్ని కుటుంబం కోసం అంకితం చేసుకొన్నదన్నమాట! తాను ఎంత మానసిక సంక్షోభాన్ని అనుభవించాడు? కట్నాలు కానుకలు ఇచ్చి, లాంఛనాలు జరిపించి, మగపెళ్ళివారి తెగని ఆశలు తీర్చి, తన తల్లి తాను ఎంత ఆరాటపడిందీ, ఆవేగపడింది ఇంకా తనకు గుర్తున్నది పిత్రార్జితమైన కొంత భూమి, తన ఉద్యోగం ఆసరాగా ఆ వివాహ యజ్ఞాలు సవ్యంగానే జరిగాయి హైదరాబాద్‌లో ఉండగా ఒక చెల్లెలి పెళ్ళి, అమెరికాలో ఉండగా ఇంకో చెల్లెలి పెళ్ళి జరిగి పోయాయి ప్రసాద్ ఉద్యోగస్తుడయ్యాడు బాధ్యతలు, బరువులు తీరినా ఇంకా తాను అవివాహితుడు! అన్నీ ఉన్న అంగనామణులు చెంగున తన పాణీ గ్రహణానికి మొగ్గుతున్న సర్వలక్షణ సంపన్నుడైన వరుడు!

మాధవయ్య మాష్టారు చనిపోయినే తర్వాత భూదేవి కూడా తనలాగే ! పాపం! చెల్లెళ్ళ పెళ్ళిళ్ళకోసం ఎంత తపన పడి ఉంటుందో! ఒక్క అబల యొక్క పోని ధైర్యంతో లౌకిక సమస్యల్ని ఎట్లా ఎదుర్కొన్నదో! అందరికి అంత గుండె బలం, దీక్ష ఉండవు! మధుకి కూడా వివాహం చేస్తుందట! పాత మనిషినే అంటుంది అమాయకురాలు!

ఏది ఏమైనా ఒక్కటి మాత్రం యదార్థం! తమ ఇద్దరి ఆశయాలు, లక్ష్యాలు ఒకే గమ్యం వైపు పయనిస్తున్నవి తమ జీవితం ఎన్నో విధాల సారూప్యం కల్గివుంది కాలానికి కగ్గిపోని పరస్పర ఆకర్షణ, అవర్ణ్యమైన మధురభావం ఉంది వయస్సులతో పాటు పరిపక్వమైన అనుభూతి, ఆర్ద్రత, అనురాగం అంతర్వాహినిగా ఉంది!అనంతమైన ఓర్పు, నేర్పు, కష్టసహిష్ణుత ఉన్న భూదేవికి లేనిది తాను సంపాదించగల్గే డబ్బు! భూదేవి డబ్బుకంటే అమూల్యమైంది!

'ఏమిటి ఆలోచిస్తున్నారు? కాఫీ చల్లారి పోతున్నది మధు అన్నాడు

బాహ్య ప్రపంచంలోకి వచ్చిన ప్రకాశరావు నవ్వి, కాఫీ తీసుకొన్నాడు

హోటల్‌లో నుండి బైటకు వస్తూ ప్రకాశరావు అన్నాడు మధుతో

మధూ! మనం సన్నిహితంగా కలుసుకొందాం?

"ఎప్పుడూ? 'ఖచ్చితంగా పది రోజుల్లో

'ఏమిటి అంత ఖచ్చితంగా చెబుతున్నారు?

అదంతే

మీరు విశేషాలు చెప్పలేదు ఎక్కడ ఉంటున్నది చెప్పలేదు ఏమీ చెప్ప లేదు నా కేమీ అర్థం కావడం లేదు '

అన్ని విశేషాలు తొందరలో వింటావు ప్రస్తుతం

# ఇ'వేమన'పద్యాలు







ఇక్కడ ఫ్రెండ్ ఇంట్లో ఉంటున్నాను నవ్వి భుజం తట్టాడు

నన్ను వెళ్ళమంటారా?

అలాగే!" ఇద్దరూ విడిపోయారు

పది రోజుల తర్వాత సూర్యప్రకాశరావు తల్లి జానకమ్మ భూదేవిని చూసింది ఇంకో పది రోజుల తర్వాత ముహూర్తం చూసింది!

శోభనం రాత్రి! సూర్యప్రకాశరావు భూదేవిని కన్నులనిండా చూసి, "నా భూదేవీ! అని దగ్గరకు తీసుకొంటే, అశ్రుసిక్తాలైన కన్నులతో భర్త పాదాలపైన వాలి పోయింది!

అర్థాంగిని లాలనగా లేపి, కౌగిలిలో బంధించి, చెవిలో ఈ బరువు గుండె గల భూదేవి వంటి భూదేవిని పొందే భాగ్యం కల్గుతుందని అనుకోలేదు ఈ విషయంలో నిజంగా అదృష్ట వంతుణ్ణి! అన్నాడు కన్నులు మూసుకొని

భూదేవి అతని పెదాలు చేతితో మూసి "మీరు అంత మాట అనొచ్చా? ఇప్పటికీ ఇది కలో? నిజమో తెలియని స్థితిలో ఉన్నాను అనాటి మీ అమృతపు చూపులతో చిగుళ్ళు తొడిగి, ఆశల పువ్వులతో ధ్యానం చేస్తూ, తపస్సు చేశాను నా తపస్సు ఫలించి, ఆకాశం నాపైన వంగింది! ఈ అందని నింగిని అందుకొన్న నేను ఎంత అదృష్టవంతురాల్ని' అని భూదేవి, భర్తతో కరగి, లీనమై పోయింది!

అగరువత్తుల పొగలు సుళ్ళు తిరుగుతూ ఒక దానితో ఒకటి హత్తుకొని పోతున్నవి! □




## తండ్రి ఆగ్రహిస్తే తనయుని ఆత్మహత్య!

వేలూరుకు చెందిన గిరికృష్ణ ముదలియార్ అనే ఆయన 22 ఏళ్ళ కొడుకు రవి ఒక కార్లు బాగు చేసే కంపెనీలో ఎలక్ట్రీషియన్‌గా పని చేస్తున్నాడట ప్రతి రాత్రీ యింటికి ఆలస్యంగా రావడం, వరుసగా కొన్నాళ్ళు రాక పోవడం వంటి పనులు రవి చేయడంచూసి, ఆతని తండ్రి రోజూ తిట్టేవాడట ఒకనాడాయన తిట్లు భరించ లేక రవి ఎలుకల మందుత్రాగి, ఆత్మహత్య చేసుకున్నాడట

## ఆయుర్దాయానికి చిట్కా!

నీ ఆయుర్దాయం పెరగాలంటే నీ నడుంసైజు పెరక్కుండా చూసుకో అని చైనా సామెతట నడుం పెరగడం, పొట్టమీద మాంసం మందమవడం వంటివి ఆరోగ్యానికి గొడ్డలి పెట్టులని అక్కడి శాస్త్రజ్ఞుల అభిప్రాయ మట

## పాళాక్షుని పేర

## కుటీర పరిశ్రమగా వ్యభిచారం!

చిలకలూరిపేటలో వ్యబిచారం వో కుటీర పరిశ్రమగా సాగుతోందట ఆ వూరిలో సుమారు 350 వ్యబిచారి గృహాలు వున్నాయట వీటిలో సుమారు వెయ్యిమందికి పైగా అనేక వయస్సుల, సైజుల, రంగుల, అమ్మాయిలు వున్నారట వీరి పరిశ్రమకి ఏశ్రమా లేకుండా వుండడానికి ఒక సమాఖ్యగా చేరి యీ కంపెనీలు నడుపుతున్నారట!

## విరక్తితో హిప్పీగా మారిన అమ్మాయి!

మద్రాసుకు చెందిన సత్యప్రకాష్ అనే ఆయన కూతురు సుచిత్రాదేవి అనే 23 ఏళ్ళ అమ్మాయిని చూడ బోలెడు సంబంధాలు వచ్చి, చివరికి కట్నం దగ్గర వీగిపోయేవట మధురకు చెందిన కృష్ణమూర్తి అనే అతనితో పెళ్ళివరకూ వచ్చిన విషయం కట్నంవద్ద ఆగిపోయిందట అతనికి మరో పెళ్ళి జరిగిందట దాంతో సుచిత్రాదేవికి జీవితం మీద, వివాహం మీదా విరక్తి కలిగి , మదురలోని హరేరామ, హరేకృష్ణలో చేరడానికి తమ యింట్లోపని చేసే శ్రీనివాసన్ అనే అతని సహాయంతో యిల్లొదిలి పారిపోయిందట ఆమె తలిదండ్రులు శ్రీనివాసన్ మీద రిపోర్టిస్తే వారు వెతికి యిద్దర్ని పట్టుకున్నారట శ్రీనివాసను తనను ఎత్తుకుగానీ, లెవదీసుకు గానీ పోలేదని, తనను కూతురులా చూసుకున్నాడనీ బియ్యే పాసయిన ఆ 23 ఏళ్ళ సుచిత్ర అన్నదట □



## గ మ ని క

వ్యక్తులపేర మీ రచనలు పంపితే వాటి పరిశీలనలో ఆలస్యం జరిగే ప్రమాదాలెక్కువ కనుక మీ రచనలన్నీ కూడా శీర్షిక పేరు కవరుపైన లేదా కార్డుపైన ఉదహరిస్తూ సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ – 520 003 అన్న చిరునామాకి పంపండి.

—సం.

# హైదరాబాద్ నోట్‌బుక్

## శ్రీ చిదానంద భారతి :–

భారతీయ జీవిత విధానం చతురాశ్రమాలపై నడిచే చక్కని వ్యవస్థ బాల్యంలోను, కౌమారంలోను బ్రహ్మచర్యం అనుష్ఠించి విద్య నేర్చిన వాడు యౌవనంలో గృహస్థాశ్రమంలో ప్రవేశించి ధర్మార్థ కామాలూ సేవించి, వయస్సు మళ్ళిన పిదప విషయ సుఖాలు తగ్గించుకొని వానప్రస్థుడై పదపడి పూర్తిగా కామ్యకర్మలు వదలి సన్యాసి అయి జీవితాన్ని సార్థకం చేసుకోడం ఒక్క భారతీయులే కాదు ప్రపంచంలోని ప్రతి మానవుడూ కోరదగిందే వయస్సులో నియమనిష్ఠలతో ద్వంద్వాలను లక్ష్యపెట్టక గడపవచ్చును గాని, వయసు మళ్ళిన తర్వాత తీరని కోరికలు క్షణక్షణమూ మనస్సును ముసురుకుంటుండగా నియమ నిష్ఠలు పాటించడం ఏటికి ఎదురీదడం వంటిది అలాటి దుష్కరమైన కార్యానికి పూనుకున్నారు మిత్రులు శ్రీ దమ్మాలపాటి శేషగిరిశర్మ శ్రీ శర్మ చిన్ననాటి నుంచే నిష్ఠాపరులు తిరుపతి శ్రీ వేంకటేశ్వర సంస్కృత కళాశాలలోను, మద్రాసు మైలాపూరు సంస్కృత కళాశాలలోను సాహిత్య వేదాంతాలు అధ్యయనం చేసి సాహిత్య, వేదాంత శిరోమణి, విశారదులయ్యారు తర్క వేదాంత విశారదులు, మహా విద్వాంసులు అయిన శ్రీ ముదిగొండ వేంకటరామశాస్త్రి గారి వద్ద ప్రస్థానత్రయ శాంతి చేశారు నరసారావుపేట హైస్కూలులో సంస్కృతోపాధ్యాయులుగాను నరసారావుపేట సంస్కృత కళాశాల ప్రిన్సిపాలుగాను పని చేశారు నాలుగు దశాబ్దాల నుంచి సనాతన ధార్మిక సంఘాన్ని నడుపుతూ తద్వారా విద్యార్థులకు ధర్మవిజ్ఞానం కలిగించారు ఈ శౌనకర ప్రశ్న ముండకోపనిషత్తులను లలిత శైలిలో సంస్కృత కావ్యాలుగా వెలయించారు షట్ శాస్త్రపండితులైన బెల్లంకొండ రామారావు గారి పెక్కు సంస్కృత గ్రంథాలను పునరుద్ధరించి సంస్కరించి ప్రకటించారు వారణాసిలోని సార్వభౌమ సంస్కృత ప్రచారిణీ సభ రజతోత్సవాలకు ఆంధ్ర ప్రతినిధులుగా వెళ్ళారు కాశీ విద్వత్పరిషత్తు వారు సగౌరవంగా ఇచ్చిన మహామహోపాధ్యాయ బిరుదం స్వీకరించారు గృహస్థులుగా నిర్వహించవలసిన పనులన్నీ నిర్వహించారు జూన్ 13 వ తేదీన విజయవాడలో కృష్ణానదీ తీరంలో సన్యాసాశ్రమం స్వీకరించారు ఈ ఆశ్రమ స్వీకారమహోత్సవం జూన్ 10 నుంచి 13 వరకు వివిధ క్రతువులతో గవర్నరుపేట దత్తాత్రేయాశ్రమంలో జరిగింది 10 వ తేదీన యత్యాశ్రమ స్వీకార సంకల్పం, సర్వప్రాయశ్చిత్తం, మృత్తికా స్నానం, శాలాగ్ని హోమాదులు, 11 న దేవఋషి ఆత్మశ్రద్ధాది అష్టశ్రాద్ధాలు, 12 న అగ్నిపతిచర్య సక్తుపిష్టభక్షణం, విరజా హోమాదులు, 13 న ప్రైషోచ్చారణ, ప్రణవోపదేశం, గురుపాద పూజాదులు జరిగాయి ఈ క్రతువుకు శ్రీ గుండిమెడ కామేశ్వరశర్మ బ్రహ్మత్వం వహించారు గన్నవరంలోని శ్రీ భువనేశ్వర పీఠాధిపతులైన పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ శ్రీ సత్యానంద భారతీస్వాముల వారు ప్రణవోపదేశం చేసి, శ్రీ శర్మ గారికి శ్రీ చిదానందభారతి అనే ఆశ్రమ నామకరణం చేశారు. తమ తర్వాత ఆయన భువనేశ్వర పీఠానికి ఉత్తరాధికారిగాను



శ్రీ పరమహంస పరివ్రాజకాచార్య
శ్రీ చిదానంద భారతీస్వామి

ప్రకటించారు ఈ ఉత్సవం దత్తాత్రేయాశ్రమస్థులు శ్రీ పరమహంస పరివ్రాజకాచార్యులు శ్రీ పూర్ణానంద భారతీస్వామి, శ్రీ రాజనృసింహానంద భారతీస్వామి సాన్నిధ్యంలో జరిగింది ఈ ఉత్సవానికి శ్రీ చిదానందభారతీస్వామి ముగ్గురు కుమారులు, అరుగురు కుమార్తెలు, బంధుమిత్రులు వచ్చారు సన్యాసం అసిధారా వ్రతం వంటిది కామ్యకర్మల త్యాగం సన్యాసమని భగవద్గీత చెబుతున్నది మనస్సు కోతి వంటిది ఈదరగాలి వంటిది దానిని చిక్కబట్టడం సులభం కాదు సన్యాసికి ఉండవలసిన లక్షణాలను కృష్ణుడు భగవద్గీతలో ఒక్కమాటలో నిర్వచించాడు

జ్ఞేయస్స నిత్యసన్యాసీ
యో నద్వేష్టిన కాంక్షతి,
నిర్ద్వంద్వోహి మహా బాహో
సుఖం బంధాత్ప్రముచ్యతే

సన్యాసి ఎవరినీ ద్వేషించరాదు, ఏదీ కోరరాదు, సుఖదుఃఖాలు, శీతోష్ణాలు మొదలయిన ద్వంద్వాలకు అతీతుడుగాను వుండాలి ఈ సన్యాసం తీర్థ, ఆశ్రమ, వన, అరణ్య, గిరి, పర్వత, సాగర, సరస్వతీ, భారతీ, పురీ – అని పది విధాలు విద్యారణ్య, ఆనందగిరి– ఇత్యాదిగా ఆశ్రమ నామధేయాలు ధరిస్తారు భారతీ అనే పేరును బృహచ్ఛంకర విజయంలో విద్యారణ్యులు ఇలా నిర్వచించారు –

విద్యా భారేణ సంపూర్ణః
సర్వభారం పరిత్యజేత్,
దుఃఖ భారం న జానాతి
భారతీ పరికీర్తితః

భారతీ నామధేయం గ్రహించిన వారు విద్యాభారంతో నిండుకుండలలాగ వుండాలి సకల సంసార భావాలను పరిత్యజించాలి దుఃఖ భారమేమిటో తెలియరాదు ఇది భారతీ పదానికి, పదవికి నిర్వచనం శ్రీ పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ చిదానంద భారతీస్వాముల వారు భారతీ నామదేయానికి సంపూర్ణంగా అర్హులు విద్యాభారం కలవారు, సకల భారాలు ఇప్పుడే కాదు, గృహస్థాశ్రమంలోను త్యజించారు దుఃఖభారమనేది వారికి ఎప్పుడూ లేదు కష్టాల వల్ల కలిగే వికారం ఎప్పుడూ వారి ముఖంలో కానరాలేదు, చిరునవ్వు తప్ప. సాహిత్య వేదాంతాది శాస్త్ర పారంగతులైన శ్రీ చిదానందస్వాముల వారు భువనేశ్వర పీఠాన్ని గొప్ప విద్యాపీఠంగా రూపొందిస్తారని ఆశిస్తున్నాను విశ్వమానవ శ్రేయస్సును కోరేది మన సనాతన ధర్మం మనిషికీ మనిషికీ అడ్డుగోడలు వేస్తున్న ఈ కాలంలో, వాటిని కూల్చి, ప్రేమ స్వరూపుడైన భగవంతుని దయామృతాన్ని అందరికీ పంచిపెట్టి, విద్వేషాలను పోనాడే విద్యను స్వాముల వారు యువకులకు భిక్ష పెట్టాలని కోరుతున్నాను

## ఉపశ్రుతి :–

మీకు మందస్మితం బాగా వుంది – అన్నారు జ్యోస్యులు శ్రీ వి వి రావు ఒక చిరచిర ముఖం క్యూయింటును చూచి నేను ప్రశ్నార్థకంగా తల పైకెత్తాను మందస్మితమంటే శని మహారాజు అనుగ్రహమండీ అని వివరించారు ఆయన బాగా అన్నారు మందుని స్మితంతో ఏడున్నర సంవత్సరాలే బాధ, మందయాన స్మితమయితే జీవితమంతా బాధ - అన్నారు పక్కన వున్న సాహిత్యవేత్త ఒకరు

–తిరుమల రామచంద్ర

Printed and Published for Nageswara Rao Estates Private Ltd, by S. Nageswara Rao at the Andhra Patrika Press, Gandhinagar Vijayawada-3, Editor S Radhakrishna.
Phones P B X 61247, 61248 & 75667

# జుట్టుకు సిల్క్‌వంటి మృదుత్వము నిచ్చుటకు నైసర్గిక ఉపాయము...



శుద్ధమైన షీకాయిలోని సహజ లాభకర గుణములు స్వస్తిక్ షీకాకాయ్ సబ్బులో నింపబడినవి. వాడడానికి అనువైనది. లిక్విడ్ షాంపూ కంటే ఎంతో పొదుపైనది.



దీని పుష్కలమైన, మృదువైన నురగ మీ జుట్టును మెత్తగా, పూర్తిగా శుభ్రపరుస్తుంది. మీ జుట్టును ఆరోగ్యంగా, నిగనిగలాడేలా వుంచుతుంది. తాజా సువాసన నింపి పట్టువంటి మృదుత్వాన్ని ఒసగుతుంది.






## స్వస్తిక్
# షీకాకాయ్ సబ్బు

ఇందులో షీకాయి కలిసి వుంది. భారత స్త్రీల అందమైన జుట్టుకు పారంపర్యమైన రహస్యము.

shilpi dm 25/79 tel

# అమృతాంజన్ లిమిటెడ్

## 90 సంవత్సరాల పైగా గృహౌషధాలు తయారు చేస్తున్నవారు!






- అమృతాంజనం బాధానివారిణి
  తలనొప్పి, ఒళ్ళునొప్పులు, బెణుకులు, జలుబు, దగ్గు, కండరాల నొప్పులకు.
- అమృతాంజన్ గ్రైప్ మిక్స్చర్
  పసిబిడ్డల అజీర్ణానికి, పళ్ళు వచ్చేటప్పుడు కలిగే బాధలకు.
- అమృతాంజన్ డెర్మల్ ఆయింట్ మెంట్
  తామర, తీట, గజ్జి వగైరాలకు.
- అమృతాంజన్ పిలోమిక్స్
  దగ్గు మంచి వెంటనే ఉపశమనమునకు కాఫ్ మిక్చర్.
- క్యాప్ మింట్ బిళ్లలు
  నోటినీ గొంతుకునీ శుభ్రంగా ఉంచేందుకు

....ఇండియాలోను,
ఇతర దేశాలలోను
పేరుపొందినది.

- అమృతాంజన్ ఇన్‌హేలర్
  జలుబుచేసి ముక్కుదిబ్బడ, తుమ్ముల వగైరాలకు.
- అనోలియమ్—కోల్డ్ రబ్
  దగ్గు జలుబులను పారద్రోలే అమో... ఒక కొత్త శక్తి.
- శాలోఫెన్—బాధానివారిణి ...తలు
  తలనొప్పి, ఫ్లూ, ఒళ్ళు నొప్పులకు.
- అమృతాంజన్ కాస్టర్ ఆయి...
  శుద్ధిచేసిన, వాసనలేని స్వచ్ఛమైన ఆముదం.

అమృతాంజన్ ...డ

మ-4
















